**BRAMHA VIDYA SERIES.**

శ్రీ

# భగవదుత్తరగీత.

ఇది

శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తిచే

అర్జునునకు

ఉపదేశింపఁబడెను.



టీక తాత్పర్యములతోను అనుభవార్థములతోను

విశేషార్థములతోను

వ్రాయఁబడినది.

**Second Edition.**

PRINTED AT K. R. PRESS,

**MADRAS.**

1911

(*Al Rights Reserved.*)

దీనివెల 12 అణాలు.

# పీఠిక.

---

శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి భారతయుద్ధరంగమందు అర్జునునకు భగవద్గీతలనుజెప్పెను. అట్లు యుద్ధరంగమందుఁ బలుమాఱులు చెప్పఁబడిన పరబ్రహ్మతత్త్వమును మఱచి తటస్థస్వరూపలక్షణముల చేత నా తత్త్వమును తిరుగా చెప్పుమని యర్జునుఁడు అడిగెను. పూర్వమునందుఁ జెప్పినవిషయమును మఱచినప్పటికిని తిరుగాజ్ఞప్తికిఁ దెచ్చుకొని యడుగుచున్నాఁడు గనుక బుద్ధిమంతుఁడనితలంచి ఆపరబ్రహ్మతత్త్వమును కృష్ణుఁడు తిరుగాఁజెప్పఁదొడఁగెను. అదియ భగవదుత్తరగీత. ఇది నాలుఁగధ్యాయములగ్రంథము. ఇందు టీక తాత్పర్యములు విశేషార్థములు అనుభవార్థములు వ్రాయఁబడెను. కావున నిది సర్వజ్ఞులయిన పండితశ్రేష్ఠులకు సయితము విశ్వాసపాత్రముగా నుండునని నమ్ముచున్నాఁడను.

ఇట్లు

సజ్జనవిధేయుఁడు,

గొల్లపూడి - దుర్గాప్రసాదరావు

గుంటూరు.

# విషయసూచిక.

# ఓం

## శ్రీకృష్ణాయనమః.

ఓమ్. అస్యశ్రీ భగవదుత్తరగీతా శాస్త్రసార మహామంత్రస్య॥
బ్రహ్మావిష్ణు మహేశ్వరా ఋషయః॥
గాయత్రీ త్రిష్టు బనుష్టుప్ ఛందాంసి॥
ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నయ స్థానాని॥
ఋ గ్యజు స్సామ వేదాః॥
నీల పీత శ్వేత వర్ణాః॥
అకారో బీజమ్॥
ఉకార శ్శక్తిః॥
మకారః కీలకమ్॥
ప్రణవాది సంపుటమ్॥
శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థే జపే వినియోగః॥

—:0:—

## అథ కరన్యాసః.

శ్రీమజ్జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అఙ్గుష్ఠాభ్యాంనమః॥
శ్రీమ దైశ్వర్యాత్మనే ఛందసే తర్జనీభ్యాంనమః॥
శ్రీమ చ్ఛక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాంనమః॥
శ్రీమ ద్బలాత్మనే బలభద్రరామాయ అనామికాభ్యాంనమః॥
శ్రీమ ద్దయాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాంనమః॥
శ్రీమద్విజయాత్మనే గాండీవ ధన్వనే అర్జునాయ కరతల కరపృష్ఠాభ్యాంనమః॥

—:0:—

## అథ హృదయాదిన్యాసః.

శ్రీమద్జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృదయాయనమః॥
శ్రీమదైశ్వర్యాత్మనే ఛందసే శిరసేస్వాహా॥
శ్రీమచ్ఛక్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయై వౌషట్॥
శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయ కవచాయహుమ్॥
శ్రీమద్దయాత్మనే వాసుదేవాయ నేత్రత్రయాయ వౌషట్॥
శ్రీమద్విజయాత్మనే గాండీవధన్వనే అర్జునాయ అస్త్రాయఫట్॥
భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

---

ధ్యానమ్॥ ఆతామ్రపాణికమల ప్రణయప్రతోద
మాలోల హారమణికుండల హేమసూత్రం
ఆవిశ్రమాంబుకణ మంబుద నీలమవ్యా
దాద్యం ధనుంజయ రథాభరణం మహోనః॥
పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మమ్బత్వా మనుసంద ధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥

ఇతిధ్యానంకుర్యాత్.

—:0:—

ఓం

శ్రీకృష్ణాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీభగవదుత్తరగీత — యోగశాస్త్రము.

## ప్రథమోధ్యాయః.

హరిః ఓం॥ వాచకః ప్రణవోయస్య క్రీడావ దఖిలంజగత్
శ్రుతివాఙ్మానసాతీతం త వందే దేవకీసుతమ్॥ ౧

టీక॥ ప్రణవః=ఓంకారము, యస్య=ఏశ్రీకృష్ణునకు, వాచకః=అభిధాయక శబ్దమో, అఖిలమ్=సమస్తమైన, జగత్=లోకము, క్రీడావత్=క్రీడవంటిదో, తమ్=అట్టి, శ్రుతివాఙ్మానసాతీతమ్=వేదములకును వాక్కులకును మనస్సునకును అగోచరుఁడైన, దేవకీసుతమ్=దేవకీదేవికి పుత్త్రుఁడగు శ్రీకృష్ణునిగురించి, వందే=నమస్కరించుచున్నాను.

తాత్పర్యము॥ "ఓమిత్యేకాక్షరంబ్రహ్మ" అనుశ్రుతి ప్రమాణానుసారముగ ప్రణవముచేత అనఁగా ఓంకారముచేతఁ జెప్పఁబడుచున్నవాఁడును, "క్రీడార్థమితి చాపరే" అనుశ్రుతి ప్రమాణానుసారముగ క్రీడానిమిత్తము సకలలోకములను సృజించినవాఁడును, "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ" అనుశ్రుతిప్రమాణానుసారముగ వేదములకును, పరాపశ్యంతి మధ్యమ వైఖరీవాక్కులకును, మనస్సునకును గోచరముకానివాఁడును, భక్తానుగ్రహముకొఱకు దేవకీదేవికి పుత్త్రుఁడై యవతరించినవాఁడును అయిన శ్రీకృష్ణ పరబ్రహ్మమునకు శిష్టాచారమున ననుసరించి నేను జేయఁబూనిన యీయుత్తరగీతోపనిషత్తు నిర్విఘ్నముగ పరిసమాప్తిని పొందుటకు నమస్కరించుచున్నానని తాత్పర్యము.

శ్లో॥ అఖండ సచ్చిదానంద మవాఙ్మానస గోచరమ్
ఆత్మాన మఖిలాధార మాశ్రయే భీష్టసిద్ధయే॥ ౨

టీ॥ అఖండ సచ్చిదానందమ్=ఎడతెగని సచ్చిదానందస్వరూపుఁడును, అవాఙ్మానసగోచరమ్=వాక్కులకును మనస్సునకును గోచరముకానివాఁడును, ఆత్మానమ్=ఆత్మరూపుఁడును, అఖిలాధారమ్ = సర్వమునకును ఆధారుఁడును అయిన శ్రీకృష్ణుని, అభీష్టసిద్ధయే = పరమపురుషార్థసిద్ధికొఱకు, ఆశ్రయే = ఆశ్రయించుచున్నాను.

తా॥ అఖండాకారుఁడును సచ్చిదానందస్వరూపుఁడును వాఙ్మనస్సులకు గోచరముకానివాఁడును ఆత్మరూపుఁడును సర్వమునకును ఆధారుఁడును అయిన శ్రీకృష్ణుని పరమపురుషార్థమగు మోక్షము సిద్ధించుటకొఱకు ఆశ్రయించుచున్నానని తాత్పర్యము.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ పరంపరస్యాః ప్రకృతేరనాది మేకంవిశిష్టం బహుధాగుహాసు
సర్వాలయంసర్వచరాచరస్థం త్వామేవవిష్ణుం శరణంప్రపద్యే ॥3

టీ॥ పరస్యాః = పరయనుపేరుగల, ప్రకృతేః = మూలప్రకృతికంటె, పరమ్ = పరుఁడవును, అనాదిమ్ = ఆదిలేనివాఁడవును, ఏకమ్ = ఒక్కఁడవును, గుహాసు = బుద్ధిగుహలయందు, బహుధా = అనేకవిధములుగా, విశిష్టమ్ = కూడియున్నవాఁడవును, సర్వాలయమ్ = సర్వమునకును ఆధారస్థానమైనవాఁడవును, సర్వచరాచరస్థమ్ = సమస్తములగు స్థావరజంగమదేహములయందు అంతర్యామిరూపముతోనున్న వాఁడవును, విష్ణుమ్ = సర్వవ్యాపకుఁడవును, (అయిన) త్వామేవ=నిన్నే, శరణమ్=శరణమును, ప్రపద్యే=పొందుచున్నాను.

తా॥ "పరాచాపరాచ" అనునట్టి శ్రుతియందుఁ జెప్పఁబడిన పరాప్రకృతికంటెపరుఁడవును—అనఁగా పరాప్రకృతికవ్వలనుండువాఁడవును ఆదిలేనివాఁడవును "ఏకోదేవః" అనుశ్రుతిప్రమాణానుసారముగ అద్వితీయుఁడవును "ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే" అనుశ్రుతిప్రమాణానుసారముగ బుద్ధిగుహలయందు జీవరూపముల నవలంబించి సుఖి దుఃఖి జ్ఞాని అజ్ఞాని మొదలుగాఁగల భేదములతో అనేకవిధముల నున్నవాఁడవును "తస్మిన్‌సర్వంప్రతిష్ఠితమ్" అను శ్రుతిప్రమాణానుసారముగ సర్వమునకును అధారమైనవాఁడవును "సర్వభూతేషుగూఢః" అను శ్రుతిప్రమాణానుసారముగ స్థావరజంగమాత్మకములగు దేహములయందు అంతర్యామిరూపముతో నున్నవాఁడవును సర్వవ్యాపకుఁడవును అయిన నిన్నే శరణముగా అనఁగా ప్రాప్యస్థానమునుగా సేవించుచున్నానని తాత్పర్యము.

శ్లో॥ యదేకంనిష్కళంబ్రహ్మ వ్యోమాతీతంనిరంజనం
అప్రతర్క్యమవిజ్ఞేయం వినాశోత్పత్తివర్జితమ్॥ ౪

శ్లో॥ కారణంయోగనిర్ముక్తం హేతుసాధనవర్జితం
హృదయాంబుజమధ్యస్థం జ్ఞానంజ్ఞేయస్వరూపిణమ్॥ ౫

శ్లో॥ కైవల్యంకేవలంశాంతం శుద్ధమత్యంతనిర్మలం
నిర్గుణంపరమంజ్యోతి రప్రమేయమనుత్తమమ్॥ ౬

శ్లో॥ ఆద్యంతరహితంసూక్ష్మం శివమద్వైతమవ్యయం
యద్జ్ఞాత్వాముక్తిమాగచ్ఛే త్తద్జ్ఞానంబ్రూహికేశవ॥ ౭

టీ॥ యత్=ఏది, ఏకమ్=సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమును, నిష్కళమ్ = కళలు (అంశములు) లేనిదియును, బ్రహ్మ = పరబ్రహ్మస్వరూపమును, వ్యోమాతీతమ్=చతుర్వింశతితత్వములకును కారణమైన ఆకాశమును అతిక్రమించినదియును, నిరంజనమ్=తమోరహితమైనదై జడసంబంధశూన్యమును, అప్రతర్క్యమ్=మనోవాక్కులచేత నూహింపనలవికానిదియును, అవిజ్ఞేయమ్ = ప్రత్యక్షప్రమాణము మొదలుగాఁగల ప్రమాణములచేతను దెలియ శక్యముగానిదియును, వినాశోత్పత్తివర్జితమ్=జననమరణములు లేనిదియును, (అనఁగా కాలత్రయాబాధ్యమును.)

టీ॥ కారణమ్=ప్రపంచముయొక్క పుట్టువునకు కారణమును, యోగనిర్ముక్తమ్ = ఇతరవస్తుసంబంధము లేనిదియును, హేతుసాధనవర్జితమ్ = సర్వకారణుఁడగుటచేత తనకువేఱొకకారణమును యోగసాధనమును లేనిదియును, హృదయాంబుజమధ్యస్థమ్=హృదయకమల మధ్యమందున్నదియును, జ్ఞానమ్=జ్ఞానస్వరూపమును, జ్ఞేయస్వరూపిణమ్=తెలియఁదగిన పరమాత్మయేస్వరూపముగాఁ గలదియును,

టీ॥ కైవల్యమ్= మోక్షస్వరూపమైనదియును, కేవలమ్ = బంధమోక్షములులేనిదియును, శాంతమ్=రాగాదిపరిణామరహితమును—అనఁగా అంతరింద్రియనిగ్రహరూపమును, శుద్ధమ్ = ప్రపంచసంబంధము లేనిదియును, అత్యంతనిర్మలమ్ : పంచవిధములగు మలములు లేకుండా బాగాకళంకరహితమైనదియును, నిర్గుణమ్=సత్త్వము రజస్సు తమస్సు అనియెడు త్రిగుణములులేనిదియును, పరమమ్=సర్వోత్తమమును, జ్యోతిః=దివ్యప్రకాశముకలదియును, అప్రమేయమ్=ఇంతపరిమితికలది యనుటకుఁ దగనిదియును, అనుత్తమమ్=తనకంటె నుత్తమము లేనిదియును,

టీ॥ ఆద్యంతరహితమ్=మొదలుచివరలులేనిదియును, సూక్ష్మమ్ = అతిసూక్ష్మస్వరూపమై మనశ్చక్షువులచేతఁ దెలియశక్యముగానిదియును, శివమ్=మంగళకరమైనదియును, అద్వైతమ్ = భేదములేనిదియును, అవ్యయమ్ = వికారరహితమైనదియును అయియున్నదో, యత్=ఏజ్ఞానమును, జ్ఞాత్వా = గురూపదేశమూలకముగా పెద్దలవలనఁదెలిసి, ముక్తిమ్ = మోక్షమును, ఆగచ్ఛేత్ = పొందవచ్చునో, తద్జ్ఞానమ్=అట్టిపరబ్రహ్మజ్ఞానమును, హే కేశవ=ఓకృష్ణుఁడా! బ్రూహి=చెప్పుము.

తా॥ సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమును, కళలు (అంశములు) లేనిదియును, పరబ్రహ్మస్వరూపమును, యిరువదినాలుగుతత్త్వములకంటె వేరయిన దియును, తమోగుణరహితమైనదియును, అనఁగా జడసంబంధములేనిదియును, మనస్సుచేతనూహింపనలవికానిదియును, వాక్కులచేత చెప్పశక్యముకానిదియును, ప్రత్యక్షప్రమాణము మొదలుగాఁగల ఆఱువిధములగు ప్రమాణములచేతను దెలియశక్యముకానిదియును, జననమరణములు లేనిదియును, అనఁగా కాలత్రయాబాధ్యమైన దియును, ప్రపంచోత్పత్తికి కారణమైనదియును, వస్త్వంతరసంబంధము లేనిదియును, తానుసర్వకారణమైయుండుటచేత తనకుకారణమును సాధనమును లేనిదియును, ఆత్మగుహాయనెడు హృత్పుండరీకముయొక్క మధ్యయందు అంతర్యామిరూపముతో నున్నదియును, జ్ఞానమేస్వరూపముగాఁ గలదియును, తెలియదగిన పరమాత్మయే స్వరూపముగాఁ గలదియును, మోక్షస్వరూపమైనదియును, బంధమోక్షములు లేనిదియును, రాగాదిపరిణామరహితమును, అనఁగా అంతరింద్రియనిగ్రహరూపమును, ప్రపంచసంబంధరహితమైనదియును, అయిదువిధములయిన ఆణవమలము కార్మికమలము మాయికమలము మాయేయమలము తిరోధానమలము అనునట్టి మలములులేనిదియును, సత్త్వము రజస్సు తమస్సు అనునట్టిత్రిగుణములు లేనిదియును, సర్వోత్తమమైనదియును, దివ్యప్రకాశముకలదియును, ఇంతపరిమితికలదని నిరూపింపనలవికానిదియును, తనకంటెనుత్తమమైనదియేదియును లేనిదియును, మొదలు చివరలులేనిదియును, మనస్సునకు నేత్రములకునుగూడ గోచరము కానిదియును, మంగళకరమైనదియును, రెండవదిలేనిదియును, వికారరహితమైనదియును, అనఁగా షడ్భావవికారములులేనిదియును, అయిన యేజ్ఞానమును తెలిసికొనుటవలన ముక్తిని పొందవచ్చునో యోకృష్ణుఁడా! అట్టిజ్ఞానమును ఉపదేశింపుమని యర్జునుఁడు అడిగెనని తాత్పర్యము

సజాతీయ విజాతీయ స్వగతభేదములు.—వృక్షములకు ఇతరవృక్షములు, మనుష్యులకు మనుష్యాంతరులు మొదలగునవి సజాతీయములు, వృక్షాదులకు మనుష్యాదులును, మనుష్యాదులకు వృక్షాదులును విజాతీయములు, అయ్యాజంతువులయొక్క నఖ దంత కేశాదులు అయ్యాజంతువులకు స్వగతభేదము. పరమాత్మకు సజాతీయభేదము విజాతీయభేదము స్వగతభేదము అనునట్టి మూఁడువిధములగు భేదములు లేవని యెఱుఁగవలయును.

ప్రమాణములు.—ప్రత్యక్షప్రమాణము, అనుమానప్రమాణము, ఉపమానప్రమాణము, శబ్దప్రమాణము, అర్థాపత్తిప్రమాణము, అనుపలబ్ధిప్రమాణము అని ప్రమాణములు ఆఱువిధములు. అందు:—

1. ప్రత్యక్షప్రమాణము = తాను స్వయముగాగాని యొకరుచూపినఁగాని చూచి యిది యిట్టిపదార్థమని తెలిసికొనుట. ఎట్లనఁగా:—కాశీపట్టణమున్నదని చెప్పినప్పుడు తానుస్వయముగాఁ జూచి కాశీపట్టణమున్నదని తెలిసికొనుట. అమూల్యరత్న మొకటియున్నదని చెప్పి దాని నొకరు చూపఁగాఁ జూచి యిట్టి రత్నము కలదని తెలిసికొనుట.

2. అనుమానప్రమాణము—ఒకవస్తువుతో సంబంధించిన మఱియొకవస్తువును జూచి యట్టివస్తువుకూడ నచ్చటనుండునని యూహించి తెలిసికొనుట. ఎట్లనఁగా:— అగ్నితో సంబంధముగల పొగను యింటిమీదఁ జూచి యింటిలో నిప్పున్నదని యూహించుట.

3. ఉపమానప్రమాణము = ఒకవస్తువును బోలు మఱియొకవస్తువునుజూచి యావస్తువుకూడ నిట్లేయుండునని తెలిసికొనుట. ఎట్లనఁగా:—చంద్రునివలె ముఖమున్నదనివిని చంద్రునిఁజూచి యిట్లేముఖముగూడ నాహ్లాదకరముగ నుండునని గ్రహించుట. గవయమృగము గోవువలె నున్నదని పెద్దలవలనఁ దెలిసికొనినపిమ్మట నడవిలోఁ దిరుగుచున్నపుడు గోవువంటిమృగమునుజూచి యిదియే గవయమృగమని తెలిసికొనుట.

4. శబ్దప్రమాణము = మఱియొకప్రమాణము చేతఁ దెలియుటకు వీలులేనివస్తు విట్టిదని తెలియఁజేయు ప్రాజ్ఞునివాక్యమునుబట్టి యట్టివస్తువును తెలిసికొనుట. ఎట్లనఁగా:—లండనుపట్టణము నుండి వచ్చిన యొక మనుష్యుఁడు ఆదేశమిట్లున్నదనియు ఆపట్టణమున నీ యీ పదార్థములు కలవనియును జెప్పిన విని నమ్ముట. మఱియును యితరప్రమాణములచేత గోచరముకాని బ్రహ్మవస్తుస్వరూపమును, బ్రహ్మసాక్షాత్కారమును అపరోక్షస్వానుభవజ్ఞానమును గల ఋషులయొక్క వాక్యములను బట్టి తెలిసికొనుట.

5. అర్థాపత్తిప్రమాణము = పైలక్షణములనుబట్టి యీ యంశమిట్లుండవచ్చునని నిర్ణయించుకొని తెలిసికొనుట. ఎట్లనఁగా:—ఒకఁడు పగలు అన్నముతినఁడు కాని బలిసియున్నాఁడు. అనునది తెలిసికొని బొత్తిగాఁదిననియెడల బలియుట తటస్థింపదు గాన వీఁడు రాత్రి తినియుండునని నిర్ణయించుకొనుట.

6. అనుపలబ్ధిప్రమాణము = ఒకపదార్థ మొకస్థలమందు లేకపోవుటను దెలిసికొనుట. ఎట్లనఁగా:—భూమిమీఁద ఘటము (కుండ) లేదని తెలిసికొనుట.

పంచమలములు.—ఆణవమలము, కార్మికమలము, మాయికమలము, మాయేయమలము, తిరోధానమలము అని అయిదువిధములు. అందు;—

1. ఆణవమలము=పరబ్రహ్మమును తెలిసికొనవలెనను జ్ఞానము అప్పుడప్పుడు కలుగఁగా దానిని మఱుఁగుపఱచునది ఆణవమలము.

2. కార్మికమలము=పెద్దలవలన వేదాంతశాస్త్రవిషయములను రహస్యములను దెలిసికొనునపుడు వానియందు బుద్ధిని జొరనీయనిది కార్మికమలము.

3. మాయికమలము=దట్టమయిన యజ్ఞానము. పరబ్రహ్మమును తెలిసికొనవలెనను జ్ఞానవాసనను యెప్పుడును కలుగనీయనిది మాయికమలము.

4. మాయేయమలము=మాయసంబంధములగు పాపకార్యములయందు మనస్సును ప్రవేశపెట్టి చేయించునది మాయేయమలము.

5. తిరోధానమలము="జగత్సత్యంబ్రహ్మమిధ్య" యనునట్లు సర్వవృత్తిరహితంబును త్రిగుణాతీతంబును పంచకోశరహితంబును అవాఙ్మానసగోచరంబును అగునట్టి నిత్యసత్యపరిపూర్ణపరబ్రహ్మమందు అనిత్యబుద్ధిని పుట్టించి అజ్ఞానమునుగలుగఁజేసి పరబ్రహ్మమునకంటె వేరుగా పూజలు దేవతలు మంత్రములు క్రియలు మతములు సాధనములు కలవు అనియు అవిసత్యములు అనెడుబుద్ధిని కలుగఁజేసి జననమరణాదిదుఃఖముల యనుభవమునకు కారణమైనదియే తిరోధానమలము.

తత్త్వములు.—మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడు అంతరింద్రియములు, సమాన వ్యాన ఉదాన ప్రాణ అపానము లనెడుపంచప్రాణములు, శ్రోత్ర త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణము లనెడుజ్ఞానేంద్రియములు, శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడుపంచవిషయములు, వాక్కు పాణి పాద పాయువు ఉపస్థ లనెడుకర్మేంద్రియములునుకలిసి యిరువదినాలుగుతత్త్వములు.—అందు:—

1. మనస్సు—చంద్రుఁడు అధిదేవత. విషయము సంకల్పవికల్పములు.

2. బుద్ధి—బృహస్పతి అధిదేవత. విషయము నిశ్చయము.

3. చిత్తము—క్షేత్రజ్ఞుఁడు అధిదేవత. విషయము చంచలము.

4. అహంకారము—రుద్రుఁడు అధిదేవత. విషయము నేననెడి అభిమానము.

5. సమానవాయువు—జయుఁడు అధిదేవత. విషయము ఆహారమును పచనము చేసును. ప్రాణాపానములమధ్యను నాభిస్థానమందుండి భుజించిన భక్ష్యభోజ్యచోష్యలేహ్యములనెడు చతుర్విధాన్నమును జీర్ణముచేసి సప్తధాతువులకు పంచిపెట్టి శరీరమునకు దారుఢ్యమును కలుగజేయును.

6. వ్యానవాయువు—విశ్వయోని అధిదేవత. విషయము అన్నరసమును నరములకుఁ బంచిపెట్టును.

7. ఉదానవాయువు—అజుఁడు అధిదేవత. విషయము తినుట మ్రింగుట మొదలగునవి. ఈవాయువు కంఠస్థానమందుండి యిష్టపదార్థములను తినుచుమ్రింగుచు అసహ్యపదార్థములను వెలుపలికిఁద్రోయుచు వాగింద్రియమందుఁజేరి అకారాదియేబదియక్షరములను బలికించుచు వాంతిమొదలగువానిని కలుగఁచేయుచుండును. మఱియు చాచుట ముడుచుట మొదలగువ్యాపారములను జేయించుచు సుషుమ్నానాడిద్వారా ఊర్ధ్వముఖవ్యాపనముగలదై జీవునికి పుణ్యముచేత మంచిపదవులను పాపముచేత నరకమును కలుగఁజేయును.

8. ప్రాణవాయువు—విశిష్టుఁడు అధిదేవత. విషయము శ్వాసరూపమున సంచరించుట. హృదయస్థానమందుండినదై ముక్కురంధ్రములగుండ ఉచ్ఛ్వాసనిశ్వాసరూపములచేత 21600 హంసలుగా సంచరించును. నోటియందుండి ఉచ్చారణను, నాభియందుండి శబ్దమును గలుగఁజేయును. ముక్కునందుండి శ్వాసలను పూరించుట రేచించుటలు చేయును. హృదయమందుండి దగ్గుమొదలుగాఁగలవ్యాధులు గలుగఁజేయును.

9. అపానవాయువు—విశ్వకర్త అధిదేవత. విషయము మలములనుద్రోయుట. మలమూత్రద్వారములయందుండి అధోగమనవ్యాపారమును జేయుచు మలమూత్రశుక్లములను వెళ్లఁద్రోయును.

10. శ్రోత్రేంద్రియము—దిక్కులు అధిదేవత. శబ్దములనువినుట విషయము.

11. త్వగింద్రియము—వాయువు అధిదేవత. స్పర్శలనుదెలిసికొనుట విషయము.

12. చక్షురింద్రియము—సూర్యుఁడు అధిదేవత. దశవిధరూపములనుచూచుట విషయము.

13. జిహ్వేంద్రియము—వరుణుఁడు అధిదేవత. సప్తవిధరసగ్రహణమును జేయుట విషయము.

14. ఘ్రాణేంద్రియము—అశ్వినులు అధిదేవత. వాసనలను దెలిసికొనుట విషయము.

15. శబ్దము—సదాశివుఁడు అధిదేవత. ఏకదేశశబ్దమునుదెలిసికొనుట విషయము. శ్రోత్రము స్థానము.

16. స్పర్శము—ఈశ్వరుఁడు అధిదేవత. ఏకదేశస్పర్శనుదెలిసికొనుట విషయము. త్వక్కుస్థానము.

17. రూపము—రుద్రుఁడు అధిదేవత. ఏకదేశరూపమునుదెలిసికొనుట విషయము. నేత్రము స్థానము.

18. రసము—విష్ణువు అధిదేవత. ఏకదేశరసమును దెలిసికొనుట విషయము. జిహ్వ స్థానము

19. గంధము—బ్రహ్మ అధిదేవత. ఏకదేశగంధమును దెలిసికొనుట విషయము ఘ్రాణేంద్రియము స్థానము.

20. వాగింద్రియము—సరస్వతి అధిదేవత. పుణ్యపాపమిశ్రసంభాషణము విషయము.

21. పాణీంద్రియము—ఇంద్రుఁడు అధిదేవత. దానప్రతిగ్రహములు విషయము.

22. పాదేంద్రియము—ఉపేంద్రుఁడు అధిదేవత. గమనాగమనంబులు విషయము

23. ఉపస్థేంద్రియము—బ్రహ్మ అధిదేవత. సంయోగానందము విషయము.

24. పాయురింద్రియము—మృత్యువు అధిదేవత. మలవిసర్జనము విషయము.

హృదయాంబుజమధ్యస్థం—వక్షస్థలమందు ఱొమ్మెముకకును వీణాదండమునకును మధ్యనుండెడిహృత్పద్మముయొక్క మధ్యను పరమాత్మస్థానము. "పద్మకోశప్రతీకాశంహృదయంచాప్యధోముఖం అధోనిష్ట్యావితస్త్యాంతు నాభ్యాముపరితిష్ఠతి హృదయంతద్విజానీయా ద్విశ్వస్యాయతనంమహత్" తైత్తిరీయోపనిషత్. కంఠమునకుఁగ్రిందుగను బొడ్డునకు జానెడుమీఁదుగనుండి యధోముఖముగా వ్రేలాడు మాంసపిండముగు హృత్పద్మమందుఁబరమాత్మయున్నాఁడు.

శ్రీభగవానువాచ.

భగవంతుఁడగు కృష్ణుఁడుచెప్పుచున్నాడు.

శ్లో॥ సమ్యగుక్తంమయాపూర్వం తద్విస్మృత్యపునఃపునః
సాధుపృష్టంమహాబాహో బుద్ధిమానసిపాండవ!
యన్మాంపృచ్ఛసితత్త్వార్థ మశేషంప్రవదామితే॥ ౫

టీ॥ హేమహాబాహో = అధికమగుభుజపరాక్రమముకలవాఁడా! పాండవ=పాండురాజపుత్త్రుఁడా! అనఁగాఁఅర్జునుఁడా! పూర్వమ్ = మునుపు, మయా=నాచేత, పునఃపునః=పలుమారులు, సమ్యక్ = చక్కఁగా, ఉక్తమ్ = చెప్పఁబడిన, తత్ =ఆవిషయము, విస్మృత్య=మఱచి, (అద్య=ఇప్పుడు) సాధు=చక్కఁగా, పృష్టమ్=అడుగఁబడెను; బుద్ధిమాన్ = బుద్ధిమంతుఁడవు, అసి=అయితివి; మామ్=నన్ను, యత్=దేనిని గురించి, పృచ్ఛసి = అడుగుచున్నావోఅట్టి, తత్త్వార్థమ్=ఆత్మతత్త్వస్వరూపమును, అశేషమ్=కొఱతలేకుండా—అనఁగా సంపూర్ణముగా, తే=నీకొఱకు, ప్రవదామి=తెలియఁజెప్పుచున్నాను.

తా॥ అధికమైన భుజబలము కలవాఁడవును పాండురాజపుత్త్రుఁడవును అయినయోఽర్జునుఁడా ! యుద్ధరంగమున పలుమారులు చెప్పఁబడిన పరబ్రహ్మతత్త్వమును మఱిచి యిప్పడు తటస్థస్వరూపలక్షణములచేత ఆతత్త్వమును తిరుగాచెప్పమని విశేషముగ అడుగుచున్నావు. అయినప్పటికిని అనఁగా పూర్వమునందుఁ జెప్పినవిషయమును మఱిచినప్పటికిని యిప్పడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని యడుగుచున్నావు కనుక బుద్ధిమంతుఁడవైతివి. కాఁబట్టి ఆపరబ్రహ్మతత్త్వమును యిప్పడు సంపూర్ణముగఁ జెప్పెదనని తాత్పర్యము.

శ్లో॥ ఆత్మమంత్రస్యహంసస్య పరస్పరసమన్వయాత్
యోగేనగతకామానాం భావనాబ్రహ్మచక్షతే॥

టీ॥ ఆత్మమంత్రస్య-అజపామంత్రమునకును, హంసస్య = బ్రహ్మప్రతిపాదకమైన అజపామంత్రమును జపించునట్టి జీవునకును, పరస్పరసమన్వయాత్ = అన్యోన్యమును ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధము కలిగియుండుటవలన, యోగేన=చిత్తవృత్తినిరోధరూపమైన యోగముచేత, గతకామానామ్ = పోఁగొట్టఁబడిన యిహాముత్రార్థఫలభోగేచ్ఛలు గలవారియొక్క, భావనా=ధ్యానమే, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపమని, చక్షతే=చెప్పచున్నారు.

తా॥ అజపామంత్రమునకును అజపామంత్రమును జపించుచున్న జీవునకును ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధము కలిగియుండుటవలన (అనఁగా "సోహమ్" ఆపరబ్రహ్మము నేను అనియెడునర్థముగలమంత్రము అజపామంత్రమనియునుయీఅజపామంత్రముచే జీవుఁడు బోధింపఁబడుచున్నాఁడనియును తెలియవలయుననుట.) "యోగశ్చిత్తవృత్తినిరోధః" చిత్తవృత్తులను అడ్డగించుట యోగమనఁబడును అనునట్టి పాతంజలయోగసూత్రప్రమాణానుసారముగ చిత్తవృత్తినిరోధరూపమైన యోగముచేత ఇహాముత్రార్థఫలభోగములయందు విరక్తులయినవారియొక్క సంతతాత్మధ్యానమునే పరబ్రహ్మస్వరూపముగాఁ జెప్పచున్నారని తాత్పర్యము.

ఆత్మమంత్రము — సూర్యోదయముమొదలుకొని తిరుగ సూర్యోదయమగువఱకును మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారకమలములకు అధిదేవతలైన గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, యీశ్వర, సదాశివ, పరమాత్మలకు 21600 హంస అజపా గాయత్రీమంత్రజపమున సమర్పించుటయే ఆత్మమంత్రమనియు అజపామంత్రమనియుఁ జెప్పఁబడును. శ్లో॥ షట్ఛతంతు గణేశాయ షట్సహస్రంతు వేధసే షట్సహస్రం గదాపాణే షట్సహస్రం పినాకినే ఆత్మనేచ సహస్రంతు గురవేచ సహస్రకం జీవసంఖ్యా విజానీయాత్ సహస్రం పరమాత్మనే॥

హంస.—హంస యనఁగా ఉచ్ఛ్వాసనిశ్వాసంబులు. దీనికే ప్రాణమనియు చెప్పుదురు. హకార బిందు సకారములే హంస హకారము శివబీజము, సకారము శక్తిబీజమును యీరెంటిమధ్యను శివశ్శక్తులకు ఐక్యస్థానమై బిందురూపమగు బుద్ధి తత్త్వము ప్రకాశించుచుండును. హకారమే శుక్లము. సకారమే రక్తము. ఈ రెంటి యొక్క సంయోగమే బిందువు హకారమే సూర్యనాడి లేక పింగళ యని చెప్పఁబడి కుడిముక్కున వాయువును పీల్చును. సకారమే చంద్రనాడి లేక ఇడయని చెప్పఁబడి ఎడమముక్కున వాయువును పీల్చును. మధ్యనుండెడి బిందువునకే తేజోనాడియనియు లేక సుషుమ్నయనియుఁ జెప్పఁబడును. సకారము శక్తిబీజము గనుక బుద్ధి సకారమువైపున తిరిగినప్పుడు ప్రపంచవిషయజ్ఞానమును హకారమువైపునతిరిగినప్పుడు నిర్విషయజ్ఞానమున్ను కలుగును. ఈమూఁడే నాదబిందుకళలు. యీహంస ప్రకృతిమయమైన ప్రపంచజ్ఞానము శివమయమైన పరబ్రహ్మజ్ఞానము అనెడు రెండుఱెక్కలతో చిద్బిందురూపమున సకలప్రాణులయొక్క సహస్రారకమలములయందు సంచరించుచుండును. ఈహంస ప్రాణవాయురూపమున ప్రత్యక్షముగ కనఁబడును. ప్రాణమనఁగా లోపలికిపోయి వెలుపలికివచ్చుశ్వాసము ప్రాణమనఁగా నాలుగుశెకనులు. నిమిషమునకు పదునైదుప్రాణములు కనుక దినమునకు ప్రాణములు 21600. ఈహంసలను అజపాగాయత్రీమంత్రజపమున ఆధారచక్రమున కధిపతియగు గణపతికి 600, స్వాధిష్ఠాన చక్రమునకధిపతియగు బ్రహ్మకు 6000, మణిపూరకచక్రమున కధిపతియగు విష్ణుకు 6000, అనాహత చక్రమున కధిపతియగు రుద్రునకు 6000, విశుద్ధచక్రమున కధిపతియగు యీశ్వరునకు 1000, ఆజ్ఞాచక్రమున కధిపతియగు సదాశివునకు 1000, సహస్రారచక్రమున కధిపతియగు పరమాత్మకు 1000, ఈప్రకారముగ నిత్యము అజపాగాయత్రీమంత్రజపమున వారివారికి 21600 హంసలు పంచిపెట్టగనుదనకు కర్తవ్యములేదు. జ్ఞాతమనోబుద్ధి చిత్తాహంకారంబులనియెడు ఆకాశపంచకంబును, సమానవ్యానోదాన ప్రాణాపానంబులనియెడు వాయుపంచకంబును, శ్రోత్రత్వ క్చక్షు ర్జిహ్వాఘ్రాణంబులనియెడు అగ్నిపంచకంబును, శబ్దస్పర్శరూపరసగంధంబులనియెడు జలపంచకంబును, వాక్పాణి పాద పాయూపస్థలనియెడు పృథ్వీపంచకంబును యీ యిరువదియైదుతత్త్వంబులును సహస్రారంబుననుండెడి సుషుమ్నతో సంబంధమగుటనుబట్టి 25000 హంసలగును. అందులో 3400 కుంభకమందు నిలుచును. అది యోగులకే అనుభవనీయమును కరతలామలకంబునగును. కడమ 21600 హంసలు అజపాగాయత్రీమంత్రజపమున ఆయాచక్రాధిదేవతలకు సమర్పింపఁబడును. ఈహంస మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయంబులను షడాధారంబులఁజుట్టి తిరుగుచుండును. ఆరోహణము

అవరోహణములే సోహము. కనుక నాదబ్రహ్మమునులేపి యానందించవలయును. రేచక పూరకములే ఆరోహణ అవరోహణంబులని తెలియునది.

యోగము. యోగమనఁగా ప్రత్యగాత్మకును పరమాత్మకును ఘటాకాశమహాకాశములకువలె ఐక్యసంబంధముకలుగుట. అనఁగా మనస్సు ననేకరీతులుగా సంచరింపనీయక తనయందే మగ్నముచేసికొనుట. ఇంద్రియములను వశపఱచుకొని చిత్తము ఈశ్వరునియందు లయింపఁజేయుటయే యోగము ఇది సాంఖ్యమునకు సాధకము. "దృగ్ద్వయంలీయతేయత్ర మనస్తత్రైవలీయతే దృశ్యమనోలీయతేయత్ర మారుతం తత్రలీయతే" మనము దేనితో సమస్తపదార్థములను జూచుచుందుమో యట్టినేత్రద్వయముయొక్క చూపునకు బహిర్వ్యాప్తిలేకుండ దననుదాను జూచుకొనుట నేర్పిన నదివఱకుఁగనుపడు వస్తువులెల్లను గనుపడవు. దీనికే యంతర్ముఖవ్యాప్తియనిచెప్పుదురు. అట్లు చూపెచ్చట లీనమగునో యచ్చటనే మనస్సునైతము లీనమగును. చూపును మనసు నెచ్చటలీనమగునో నచ్చటనే సోహస్వరూపముగ నుండెడువాయువును లీనమగును. అచ్చటనే మనోమారుతములు లయమగుచున్నవి. ఒకకుండనుదెచ్చి చూచిన లోపలను వెలుపలంగూడ నాకాశము కనుపించును. లోపలనుండెడు నాకాశమున కావరణయుండెనుగదా ఆకుండను బగులఁగొట్టినపుడాలోపలి యాకాశ మావరణరహితమై వెలుపలనుండునాకాశముతోఁ గలిసి నిరావరణమై పేరులేనిది యగుచున్నది. ఆవరణయున్నంతవరకే కుండలోని యాకాశమను వేఱుపేరుగాని ఆయావరణము రహితముకాఁగానే నామభేదము నుబోవును. అప్పుడే నామరూపక్రియారహితత్వము సిద్ధించును. యోగాభ్యాసము చేయఁ దలపుగలవారలు, గుహలయందుగాని లేక జనసంచారమును దుర్వాసనయు మిట్టపల్లములునులేక నల్లులు చీమలు దోమలు యెలుకలు మొదలగువానివలని యుపద్రవములులేక విశాలమై యుండుసమభూమియందుగాని గృహమునందు ఆవుపేడతో చక్కఁగా అలికినగదియందుగాని, మిద్దెమీఁదఁగాని క్రిందఁగాని తెల్లసున్నము చక్కఁగాచేసి నల్లులు యీఁగలు చీమలు దోమలు మొదలుగాఁగల జంతువులు చేరకుండునటులను, గాలివిశేషముగా రాకుండునటులను, గాలిబొత్తిగాలేకపోతే ఆగదిపనికిరాదు గనుక కొంచెముగాలివచ్చునటులను, యేర్పరచబడినట్టియు సువాసనద్రవ్యములతో అలంకరింపఁబడినట్టియు గదియందుగాని పులిచర్మమునైనను కృష్ణాజినమునైనను వేసికొని, దానిమీఁద స్థిరచిత్తముతోఁ గూర్చుండి నడుమును మెడను తలను చక్కఁగా సరిగానుంచి భ్రూమధ్యమందలి చిద్బిందువును దిలకించుచుయోగాభ్యాసము చేయవలయును. కోపమును దూరముగ విడువవలయును. ఉప్పుకారము

మొదలగు తామసపదార్థములను దినక, పాలు నేయి చక్కెర మొదలుగాఁగల సాత్వికమధురపదార్థములనే తినవలయును. “ అతి సర్వత్రవర్జయేత్ ” అనున్యాయముచేత మితాహారమును మితనిద్రయు నుండవలయును. ప్రథమములోఁ బద్మాసనమువేసికొని యొకగంటసేపు కదలక కూర్చుండి యుండుట కభ్యాసముచేయవలయును. అట్టు లభ్యాసమయినపిమ్మటఁ బ్రాణాయామముచేయవలయును. నాగులచవితి గోకులఅష్టమి శ్రీరామనవమి ముక్కోటిఏకాదశి శివరాత్రి మొదలగువ్రతములు ఉపవాసములచేతను శరీరమును కృశింపచేయుచు ఏమియునుభక్షింపనివానికి రాజయోగానుసంధానము లభింపదు. గారెలు బూరెలు లడ్డు హల్వా ఖాజీ మొదలగు మధురపదార్థములను అన్నమును మిక్కిలియెక్కువగా చిరునాలుకవఱకు తిని ఉచ్ఛ్వాసనిశ్వాసములకయినను వీలులేక ప్రయాసపడుచునుండువానికి రాజయోగానుసంధానము లభింపదు. తెల్లవారుజామున నిద్దురలేవక పగలురాత్రియు నిద్రబోతూ ఏప్రొద్దును నిద్రమబ్బుతో పడియుండువానికిని తెలివి ముఖస్థానమందున లేనివానికిని రాజయోగానుసంధానము లభింపదు. పగలురాత్రియు నిద్దురలేకుండ యెల్లప్పుడు జాగ్రతతో నుండువానికిని నిద్దుర బొత్తిగా లేనివానికిని రాజయోగానుసంధానము లభింపదు. సద్గురువులేనియెడ వ్యాధియును మరణమును గలుగును. కావున యోగాభ్యాసము చేయువారలు యోగవిద్యబాగుగఁ దెలిసిన గురువును దగ్గఱనుంచుకొని యభ్యసింపవలయును. లేనిచో వ్యాధులకుఁ గారణమగును. కొండనాలుకకు మందుపెట్టి నున్ననాలుకయు నూడిపోయినట్లు యోగవిద్య తెలియకపోగా శరీరాయాసము దగ్గు మొదలగువ్యాధులు యేర్పడును. భోజనానంతరము యోగాభ్యాసము చేయగిట్టదు. తెల్లవారుజామున నాలుగుగంటలవేళయే దీనికిఁ బ్రశస్తమయినకాలము. హఠయోగులు పాలు పంచదార వెన్న నేయి తేనె గోధుమపిండి మొదలగుమధురపదార్థములనే తినవలయును. యోగము అభ్యాసయోగమనియు జ్ఞానయోగమనియు రెండువిధములు. ఈవిషయమును సంపూర్ణముగ దెలియకోరువారు మావద్ద విక్రయింపబడు బ్రహ్మవిద్య యనుగ్రంథమును జూడవలయును.

ఇహాముత్రార్థఫలభోగవిరాగము.—ఈలోకమందుండు స్త్రీలు వస్త్రములు, నగలు, పుష్పములు చందనము అత్తరు పన్నీరు మొదలుగాఁగలసుగంధద్రవ్యములు మేడలు మిద్దెలు యిల్లువాకిలి తోటలు ధనము ధాన్యము ఆలుబిడ్డలు మొదలగువాని భోగములయందును పరలోకమందలి ఇంద్రపదవి మొదలుగాఁగల పదవులభోగములయందును రంభాసంభోగాదులయందును స్వర్గవైకుంఠకైలాసాదులయందును కోరికలేక యుండుటయే యిహాముత్రార్థఫలభోగవిరాగము.

శ్లో॥ శరీరిణామజస్యాంతం హంసత్వంపారదర్శనం
హంసోహంసాక్షరంవిద్వాన్ జహ్యాన్మరణజన్మనీ॥ ౧౦

టీ॥ శరీరిణామ్=జీవులయొక్క, అంతమ్=జీవత్వమునకు అవధిభూతమైన, హంసత్వమ్=జీవన్ముక్తత్వము, అజస్య = బ్రహ్మముయొక్క, పారదర్శనమ్=సాక్షాత్కారము, (స్యాత్=అగును.) హంసః=జీవుఁడు. హంసాక్షరమ్=(జీవజప్యమైన) హంసమంత్రమును—అనఁగాకూటస్థహంసహంసాక్షరములరెంటికిని సాక్షియగుపరతత్త్వమును, విద్వాన్=తెలిసినవాఁడై, మరణజన్మనీ=మరణజననములను, జహ్యాత్=విడిచిపెట్టును.

తా॥ జీవులయొక్క తత్త్వావధిభూతమైన జీవన్ముక్తత్వము పరబ్రహ్మముయొక్క సాక్షాత్కారము అనఁబడును. జీవజప్యమైన హంసమంత్రమును కూటస్థహంసాక్షరములరెంటికిని సాక్షీభూతమైనవస్తువును తెలిసినట్టి జీవన్ముక్తుఁడు జననమరణములు లేనివాఁడగునని తాత్పర్యము.

శ్లో॥ కాకీముఖకకారాంత ముకారశ్చేతనాకృతిః
ఉకారస్యచలుప్తస్య కోర్థస్సంప్రతిపద్యతే॥ ౧౧

టీ॥ కాకీముఖకకారాంతమ్ = కాకిశబ్దముయొక్క అగ్రభాగమునందలి అకారము పురుషబీజము, ఉకారః = ఉకారము ప్రకృతిబీజము. (ఈరెండును చేరి) చేతనాకృతిః = ప్రకృతిపురుషాత్మకజీవుఁడు, (అభవత్ = ఆయెను.) ఉకారస్య = ఉకారము ; లుప్తస్యసతశ్చ = లోపించినదగుచునుండఁగా (అనఁగాజీవత్వమునకు నాశముకలుగుచునుండఁగా) కః=ఏ, అర్థః = అర్థము, సంప్రతిపద్యతే= పొందఁబడుచున్నది.

తా॥ కాకి అనఁగా (కంచ—అకంచ—కాకి) అనునట్టి వ్యుత్పత్తిని అవలంబించి సుఖదుఃఖములుగల జీవుఁడని కొందఱు చెప్పుచున్నారు. మఱియును, ఆకాకిశబ్దముచేతఁ జెప్పబడుచున్న జీవుఁ డెవఁడనఁగా, అవిద్యయందుఁ బ్రతిఫలించిన చైతన్యమని యెఱుఁగవలయును. దీనికి పూర్వ వ్యాఖ్యాతలు కాకీముఖకకారాంతమనఁగా కాకిశబ్దముయొక్క మొదటిదైన కవర్ణముయొక్క కడపటనున్న యకారము ప్రతిబింబమైన జీవునకు బింబభూతమైన బ్రహ్మమును ప్రతిపాదించుననియును కాకిశబ్దవాచ్యుఁడైన జీవునకును కాకాక్షిన్యాయముచేత సంబంధించుననియును చెప్పుచున్నారు. ఈపక్షమందు అకారము సృష్టియును ఉకారము స్థితియును మకారము లయమును అగును కనుక ఆకారోకార మకారములకు లయమును జెప్ప

నప్పుడు బ్రహ్మ ప్రతిపాదకమైన అకారముతో బ్రహ్మమునకును లయము చెప్పఁబడును. కనుక అకారము బ్రహ్మప్రతిపాదకమనేయర్థము విరోధించును. కాబట్టి యీ యర్థమునువిడిచి యర్థాంతరమును జెప్పుచున్నారము ఎట్లనిన:—త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనియెడు జ్ఞానేంద్రియపంచకము, వాక్పాణిపాదపాయూపస్థలనియెడు కర్మేంద్రియపంచకము, శబ్దస్పర్శరూపరసగంధములనియెడు విషయపంచకము, సమానవ్యానోదానప్రాణాపానంబులనియెడు వాయుపంచకంబు మనోబుద్ధిచిత్తాహంకారములనియెడు అంతఃకరణచతుష్టయము అనునట్టి యిరువదినాలుగుతత్త్వములు చతుర్వింశతితత్త్వములనఁబడును. ఇట్టి యిరువదినాలుగుతత్త్వములతోఁ గూడినది స్థూలశరీరము. దీనియవస్థ జాగ్రదవస్థ. ఈరెంటికిని విశ్వుఁడభిమాని. క్రియాశక్తి రజోగుణము. నేత్రస్థానము యుక్తభోగము అనువానితోఁ గూడిన యాత్మ జీవాత్మ యనఁబడును. అతఁడే వ్యావహారికజీవుఁడని చెప్పఁబడును. ఈ యర్థమంతయును అకారముచేతఁ జెప్పఁబడియె. ఈయర్థమునకు "శ్రు॥ పంచీకృతపంచమహాభూతాని తత్కార్యం సర్వంవిరాడిత్యుచ్యతే—స్థూలశరీరమాత్మనః—ఇంద్రియైరర్థోపలబ్ధిర్జాగరి తస్తదుభయాభిమాన్యాత్మావిశ్వః—ఏతత్త్రయ మకారస్యార్థః" అనుశ్రుతిని ప్రమాణముగా గ్రహింపవలయును.—ఇఁకను ఉకారార్థము—ఇప్పుడుచెప్పఁబడిన యుకారమకారములకు మూలశ్లోకమందు కంఠస్థముగఁ బ్రయోగింపఁబడినప్పటికిని మునుపటివ్యాఖ్యాతలు మూలశ్లోకమునందు ఉకారమకారములకు అర్థము వ్రాసి మునుపు గ్రహించిన యుకారమకారప్రణవములకు విశేషార్థమును వ్రాయలేదు. కనుక ఆకాకిముఖశబ్దమందలి యకారగ్రహణము వ్యర్థము. కాఁబట్టి మూలగ్రంథమందును ఉకారమకారములకే అర్థము చెప్పుచున్నారు. అదియెట్లన్న జ్ఞానేంద్రియములయిదును కర్మేంద్రియములైదును పంచప్రాణములును మనోబుద్ధులురెండును ఈపదునేడుతత్త్వములతోఁగూడిన అంతరాత్మయనఁబడు లింగమే హిరణ్యగర్భుఁడు. అదే సూక్ష్మశరీరము. ఈసూక్ష్మశరీరాభిమాని తైజసుఁడనఁబడును. దీనికి ఆనందము స్వప్నము. ఇచ్ఛాశక్తిసాత్త్వికాహంకారము స్వేచ్ఛాభోగము అనువానితోఁ గూడి వ్యాప్తమైన యాత్మ యంతరాత్మ యనఁబడును. అతఁడే ప్రాతిభాసికజీవుఁడు. ఇదియంతయును ఉకారప్రణవార్థము చేతనాకృతి యనఁబడును. అనఁగా అకారముచేతనమైహిరణ్యగర్భాత్మకుఁడనే తేజస్సు అనఁబడును. దీనికంతకును " శ్రు॥ అపంచీకృతపంచమహాభూతాని తత్కార్యంహిరణ్యగర్భ ఇత్యుచ్యతే—ఏతత్సూక్ష్మశరీరమాత్మనః కరణేషూపసంహృతేషు జాగర్తిసంస్కారజప్రత్యయస్సవిషయస్స్వప్నః— తదుభయాభిమాన్యాత్మైవతైజసః—ఏత

త్రియ మకారస్యార్థః" అను శ్రుతిని ప్రమాణమునుగా గ్రహింపవలయును.—మకారప్రణవమున కర్థము పూర్వము చెప్పఁబడిన స్థూలసూక్ష్మశరీరములకు రెంటికిని కారణము కాఁబట్టి కారణమనునట్టి యవ్యాకృతము. అవ్యాకృతమనఁగా, మహదహంకారములు. అదే త్రిగుణగర్భము. దీని కభిమాని ప్రాజ్ఞుఁడను జీవుఁడు. దీనికవస్థ సుషుప్తి. ద్రవ్యశక్తి తామసాహంకారము హృదయస్థానము ఆనందభోగము వీనితో వ్యాప్తమైనయాత్మ పరయాత్మయనఁబడును. అతఁడే పారమార్థికజీవుఁ డనఁబడుచున్నాఁడు. ఇదియంతయును మకారప్రణవమున కర్థము. దీనికి "శ్రు॥ శరీరద్వయకారణమాత్మజ్ఞానసమవ్యాకృత మిత్యుచ్యతే—తచ్చసత్—నాసత్—నాసదసత్—నాభిన్నం—నభిన్నంవిచ్ఛిన్నం కుతశ్చేత్—నసావయవం—ననిరవయవంమనోమయంకేవలం బ్రహ్మాత్మైకత్వజ్ఞానోపనోద్యం—సర్వప్రకారజ్ఞానోపనోద్యం—సర్వప్రకాశిజ్ఞానోపసంహారి—బుద్ధేః కారణం సుషుప్తి స్తదుభయాభిమాన్యాత్మా ప్రాజ్ఞః ఏతత్త్రియంమకారస్యార్థః" అను నట్టిశ్రుతిని ప్రమాణముగా గ్రహింపవలయును. ఈవిధముగా లుప్తమైనందున "కోర్థః" అనుదాని కర్థమేమనఁగా అఖండాద్వైతసచ్చిదానందరూపమును లక్ష్యార్థమును అయిన బ్రహ్మమేయని తాత్పర్యమునుగా గ్రహింపవలయును. మఱియును. "తంప్రతిపద్యతే" అనఁగా ఇప్పుడు చెప్పఁబడిన విధములచేత ఐక్యానుసంధానమును ఎవ్వఁడుచేయునో వాఁడు ఆబ్రహ్మమును పొందునని శ్లోకార్థము. ఈయర్థమునకు "శ్రు॥ అయమాత్మా బ్రహ్మ స్వయంచాయంపురుషే యశ్చాసావాదిత్యస్సఏకః—తత్త్వమసి—అహంబ్రహ్మాస్మి—అనునట్టిశ్రుతులను ప్రమాణములుగా గ్రహింపవలయును. ఈశ్లోకమునకు పాఠాంతరము—"శ్లో॥ కాకీముఖకకారాంతం మకారశ్చేతనాకృతిః అకారస్యచలుప్తస్య కోర్థస్సం ప్రతిపద్యతే॥" కాకీముఖకకారాంత మనఁగా బ్రహ్మాండ పిండాండ స్వరూపుఁడైన జీవుఁడనుట. కాకిశబ్దమందలి ప్రథమ కకారముయొక్క అగ్రమందలి అకారము పురుషబీజము. ఉకారము ప్రకృతిబీజము. కాఁబట్టి అకార ఉకారములు రెండునుకూడఁగా ప్రకృతిపురుషాత్మకమైన జీవుఁడు అనఁబడును; కాఁబట్టి కాకియనఁగా జీవుఁడనుట. దీనికి "శ్రు॥ స్వవిద్యయాసంసరతిస్వవిద్యయావిముచ్యతే" అనుశ్రుతిని ప్రమాణముగా గ్రహింపవలయును. మఱియును "అకారస్య" అనఁగా ఆజీవునియొక్క అకారమునకనుట, అనఁగా జీవత్వాకారమున కనుట. "లుప్తస్య" అనఁగా ఆజీవత్వ నాశనమున కనుట. "కోర్థ" అనఁగా ఆజీవత్వ నాశమున కర్థమేమనుట. అనఁగా అఖండానందాద్వితీయ సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మమని యెఱుఁగవలయును. "తం ప్రతిపద్యతే" అనఁగా ఆబ్రహ్మమును అయుక్తానుసంధానమును ఎవఁడు చేయునో వాఁడు ఆబ్రహ్మమును బొందుననుట. దీనికి "శ్రు॥ అప్లవస్వప్లప్లవస్వ—అండీభవచ

మాముహుః—"సుఖాదిందుఃఖనిధనాంప్రతిముంచస్వస్వాం పురం" అప్లవస్వయనఁగా ఓజీవుఁడా! జననమరణహేతువైన సంసారము విడువుమనుట. ప్లప్లవస్వ యనఁగా ఆసంసారహేతువైన మనోవ్యాపారములను విడువుమనుట. అండీభవచమాముహుః అనఁగా బ్రహ్మాండము కలవాఁడవు కావద్దు. తిరుగా విడిచిన పిండాండ బ్రహ్మాండ వ్యాపారము గలవాఁడవు గాకుండు మనుట ఆవ్యాపారము కలవాఁడవైతివేని దాని వలనఁ గలిగెడు కొఱత యేమనఁగా ఐహికసుఖహేతువై తుదకు దుఃఖమును కలుగఁ జేయును. స్వస్వాంపురంప్రతిముంచ అనఁగా స్వకీయమైన స్థూలకారణదేహమును విడువుమనుట. దీనికిఁ దాత్పర్య మేమనఁగా జీవన్ముక్తుఁడవగు మనుట.

ప్రణవము.—ప్రణవము అక్షరత్రయంబై మంత్రత్రయంబై నాదబిందుకళాత్మకంబై సృష్టిస్థితిలయకారణభూతంబై విరాట్స్వరాత్మ అంతర్యామిభావంబై శక్తిత్రయంబై యుండు. ఓం = అ + ఉ + మ్. శ్లో॥ ప్రథమంతారకంచైవ ద్వితీయం దండముచ్యతే తృతీయంకుండలాకారం చతుర్థంచార్థచంద్రకమ్ పంచమంబిందుసంయుక్తం ఓమితిజ్యోతిరూపకమ్॥ అకారము—పీతవర్ణము, రజోగుణము, స్థూలదేహము, ఋగ్వేదము, నాదము, బ్రహ్మ, జాగ్రదవస్థ. ఉకారము—శుక్లవర్ణము, సత్వగుణము, సూక్ష్మదేహము, యజుర్వేదము, బిందువు, విష్ణు, స్వప్నావస్థ. మకారము—కృష్ణవర్ణము, తమోగుణము, కారణదేహము, సామవేదము, కళ, మహేశ్వరుఁడు, సుషుప్త్యవస్థ. ఈస్థితియందు యోగిబ్రహ్మస్వరూపమును తనయందేకను గొనును ఓంకారము—శుద్ధసాత్వికగుణము, మహాకారణదేహము, అథర్వణవేదము, సర్వసాక్షీ, తుర్యావస్థ, దీనికే అర్థమాత్రకయనియు చెప్పుదురు. ప్రణవము-అవాఙ్మానసగోచరము, అవాచ్యము, తుర్యాతీతము, ఉచ్చారణలేదు. శ్లో॥ అకారార్థో విష్ణుర్జగదుదయరక్షాప్రలయకృత్ మకారార్థోజీవస్తదుపకరణం వైష్ణవమిదమ్ ఉకారోనన్యార్హంనియమ యతిసమ్బన్ధమనయోః త్రయీసారస్త్రాత్మాప్రణవ ఇమమర్థంసమదిశత్॥ ప్రణవమందలి మూఁడు అక్షరములే మూఁడు వేదములనియు మూఁడు సంధ్యలు అనియు, మూఁడు గుణములనియు చెప్పుదురు.

శ్లో॥ యావత్పశ్యేత్ఖగాకారం తదాకారంవిచింతయేత్॥ ౧౨

టీ॥ ఖగాకారమ్ = హంసరూపమైనజీవాకారమును—అనఁగా చిదాకాశస్వరూపమును, యావత్ = ఎంతపర్యంతము, పశ్యేత్ = చూచునో, (తావత్ = అంతపర్యంతమును) తదాకారమ్ = ఆజీవాకారమునే—అనఁగా ఆచిదాకాశస్వరూపమునే, విచింతయేత్ = చింతనచేయవలయును.

తా॥ హంసరూపమైన జీవాకారమును ఎంతపర్యంతము చూచునో అంతవఱకును ఆజీవాకారమునే చింతనచేయవలయును—అనఁగా శివస్వరూపము తెలియువఱకును ఆశివస్వరూపమును లెస్సగా విచారింపవలయుననుట.

☞ ఈప్రకారము జీవస్వరూపమును విచారించి తెలియఁగా మిథ్యయగుటంబట్టి తాను శూన్యముందు నిలిచి యాత్మసాక్షాత్కారము గలుగఁజేసికొనుట దుర్లభము కనుకను "శ్రు॥ శతాయుః పురుషశ్శతేంద్రియః" అనునట్టి న్యాయానుసారముగ మనుజులు పరిమితాయుష్కులు కాఁబట్టి వాయుధారణమువలన నాయుర్వృద్ధియని చెప్పియుండబడినది కనుక నాయువు నధికముగా సంపాదించి యేవిధముగనైనను శ్రుతిగురుస్వానుభవములచేత బ్రహ్మసాక్షాత్కారమునుకలుగఁజేసికొనవలయును.

ధారణము.—మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, అజ్ఞేయము, సహస్రారము, ననెడుకమలములయందు అనఁగాచక్రములయందు వానికి నధిదేవతలైనగణపతి, సరస్వతితోఁడిబ్రహ్మ, లక్ష్మితోఁడివిష్ణువు, గౌరితోఁడిరుద్రుఁడు, ఈశ్వరుఁడు, సదాశివుఁడు, పరమాత్మయనువాని నాయాస్థలములయందు ధ్యానించునపు డాయాచక్రములయందు మనస్సును నిలుపుటయే ధారణము. ఈప్రకారముగ నిత్యము నభ్యసించినచో శరీరమెట్లునిలిపిన నట్లు నిలుచును. అభ్యాసమందు చెమటపట్టును. మనస్సణఁగియుండును. వృత్తిరహితమగును. వాయువుయొక్క రాకపోక లనుదిన మొకజాము నిలిపిన సమర్థుఁడగును. ఈధారణాయోగమువలన నాయుర్వృద్ధియగును.

శ్లో॥ గచ్ఛన్తిష్ఠన్యథాకాలం వాయుస్వీకరణంపరం
సర్వకాలం ప్రయోగేన సహస్రాయు ర్భవేన్నరః॥ ౧౩

టీ॥ గచ్ఛన్ = పోవుచునడుచుచున్నప్పుడును, తిష్ఠన్ = కూర్చున్నప్పుడును నిలుచున్నప్పుడును, యథాకాలం=కాలమును అతిక్రమింపక, సర్వకాలమ్=స్నానభోజనశయనాదిసమస్తకాల సర్వావస్థలయందును, వాయుస్వీకరణమ్ = వాయుధారణమును, పరమ్ = అధికముగా, ప్రయోగేన = చేయుటచేత, నరః=మానవుఁడు, సహస్రాయుః=వేయిసంవత్సరములాయుస్సుకలవాఁడు, భవేత్=అగును.

తా॥ నడుచుచున్నను తిరుగుచున్నను నిలుచున్నను కూర్చున్నను పగలుగాని రాత్రిగాని అన్నికాలములయందును నియమముచేతనున్న అనియమము చేతనున్న అధికముగా వాయుధారణమును చేయుమానవుఁడు వేయిసంవత్సరము లాయుర్దాయముకలవాఁడగును అనితాత్పర్యము.

☞ "శతాయుః పురుషశ్శతేంద్రియః" అనునట్టి న్యాయానుసారముగ పురుషునికి నూరేండ్లు ఆయుర్దాయము అని చెప్పినప్పటికి వాయుధారణముచేత ప్రాణాయామపరులైనవారికి వేయిసంవత్సరములాయుర్దాయమును అపరోక్షజ్ఞానమును బ్రహ్మప్రాప్తియును కలుగును. వాయుధారణమువలన ఆయుష్యమును విశేషముగా సంపాదించినప్పటికిని తనకు జీవస్వరూప మెంతవఱకుగనఁబడునో యంతవఱకును "అధ్యారోపాపవాదాభ్యాంనిష్ప్రపంచం ప్రపంచ్యతే" అను న్యాయముచేతను "నేహా!" అను వాక్యము మొదలుగాఁగల వాక్యములచేతను విచారించి ఆజీవత్వము తనకులేకయుండుటను దెలిసికొని సదానిర్వికల్ప సమాధియుక్తుఁడై అపరోక్షజ్ఞానముచేతను బ్రహ్మసాక్షాత్కారమును జేసికొనవలయును.

<u>ప్రాణాయామము</u> — ప్రాణాయామము ప్రాకృతప్రాణాయామమని వైకృతప్రాణాయామమని కుంభకప్రాణాయామమని మూఁడువిధములు. ప్రాకృతప్రాణాయామము = సూర్యోదయము మొదలు తిరుగ సూర్యోదయమువఱకు మూలాధారము మొదలుగాఁగల కమలములకు అధిదేవతలైన గణపతి మొదలగువారికి 21600 హంస అజపాగాయత్రీమంత్ర జపమును సమర్పించుట. వైకృతప్రాణాయామము = ఎడమముక్కునవాయువునుబూరించి సగభాగము కుంభకమందునిలిపి కడమసగమును గుడిముక్కున రేచింపవలయును. మఱల గుడిముక్కునఁబూరించి సగముకుంభకమందు నిలిపి కడమసగము నెడమముక్కున రేచింపవలయును. ఈతీరున యథాశక్తిగఁ బ్రాణాయామముచేయుచుండవలయును. కుంభకప్రాణాయామము = మూలబంధ ఉడ్యాణబంధ జాలంధరబంధములఁగావించి వాయువును పూరింపక రేచింపక యేకరీతిని నిలుపుటయే కుంభకప్రాణాయామమనిచెప్పఁబడును. పూరకము = ఉత్పత్తి; రేచకము = సంహారము; కుంభకము = స్థితి, పూరించుట = ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నానాళద్వారముగ నుత్థాపనము చేయుట. దీనినే కుండలిని పెకళించుటయనియు చెప్పుదురు, రేచించుట = బ్రహ్మరంధ్రపర్యంతము పూరించినవాయువును మఱల సుషుమ్నానాళద్వారముగ మూలాధారమునకుఁ జేర్చుట, కుంభించుట = పూరించినవాయువును గొన్నినిముషములు రెండుముక్కులుమూసి రేచించకుండ బ్రహ్మరంధ్రమందు అనఁగాకపాలకుహరమందు నిలుపుటయే ఊర్ధ్వకుంభకము, రేచించినవాయువును గొన్నినిముషములు రెండుముక్కులుమూసి పూరించకుండ మూలాధారమందు నిలుపుటయే అధోకుంభకము అనిచెప్పఁబడును.

☞ ప్రాణాయామము రెండుభాగములు.—కుడిముక్కునుమూసి యెడమముక్కుగుండవాయువును లోపలికిఁబీల్చి, ఎడమముక్కుమూసి కుడిముక్కుగుండ

వాయువును లోపలినుండి విడుచుట పూర్వభాగము. ఎడమముక్కుమూసి కుడి ముక్కుగుండ వాయువును లోపలికిఁబీల్చి కుడిముక్కుమూసి యెడమముక్కుగుండ వాయువును లోపలినుండి విడుచుట ఉత్తరభాగము. మూలబంధము=ఎడమకాలి మడమచేత గుదస్థానమును మూయుట; ఉడ్యాణబంధము = కుడికాలిమడమచేత నాభిస్థానమును మూయుట; జాలంధరబంధము = తలవంచి, గడ్డముఱొమ్మునందుంచుట; యోనిబంధము=కాలిమడమచేత గుదస్థానమునుమూయుచు అపానవాయువును ఊర్ధ్వముఖముగా పయికి పీల్చియుండునది యోనిబంధము. ఈవిధముగ ప్రాణాయామము నిత్యము నభ్యాసముచేయుటవలన శరీరము తేలికయగును. అభ్యాసము కానుకాను కేవలకుంభకమగును. చెమటపట్టును. ప్రాణాయామముచేయుటవలన పైత్యము దగ్గు మొదలగువ్యాధులు నెమ్మదించును. ఏవ్యాధియునుండదు. భోజనానంతర మీయభ్యాసము చేయఁగిట్టదు. తెల్లవారుజామునఁ జేయుటయుక్తము.

[illegible] యమనియమాసనంబులు అభ్యసించినపిమ్మటనే ప్రాణాయామ మభ్యసించవలయును, అట్లుగాక ముస్ముందుగాఁ బ్రాణాయామ మభ్యసించినచో హృదయవ్యాధులకుఁ గారణమగును, కావున జాగరూకతగలవారై యమనియమాసనంబులు ముందు అభ్యసించునది.

శ్లో॥ ఖమధ్యేకురుచాత్మాన మాత్మమధ్యేచఖంకురు
ఆత్మానంఖంమయంకృత్వా నకించిదపిచింతయేత్॥ ౧౪

టీ॥ ఖమధ్యే = చిదాకాశమధ్యమందు, ఆత్మానమ్ = జీవాత్మను, కురు= చేయుము—అనఁగా నిలుపుము, ఆత్మమధ్యేచ=ఆజీవాత్మయందు, ఖమ్=చిదాకాశమును, కురు = చేయుము, ఆత్మానమ్ = జీవాత్మను, ఖంమయమ్ = చిదాకాశమయమునుగా, కృత్వా=చేసి, కించిదపి=(ఇతరమును) కొంచెముగానైనను, నచింతయేత్=ఆలోచింపఁగూడదు—అనఁగా చిత్తైకాగ్రతచేసి మనస్సును దహరాకాశమందే నిలుపవలయుననుట.

తా॥ చిదాకాశమధ్యమందు జీవాత్మను, ఆత్మమధ్యమందు చిదాకాశమును చేయవలయును. అనఁగా జీవబ్రహ్మలకు అభిన్నసత్తాకమును భావింపవలయుననుట. మఱియును జీవాత్మను చిదాకాశమయమునుగాఁజేసి యితరమును కొంచెముగానైనను ఆలోచింపఁగూడదని తాత్పర్యము.

చిదాకాశము.—ఇంద్రియగోచరంబులగు వస్తువులు విషయంబులనంబడు అట్టివిషయంబులం దొక్కొక్కటి తెలివిచే గ్రహింపంబడియుండ నాతెలివి యావిష

యంబును విడిచి మఱియొకవిషయమునకు పోవునపుడు పూర్వము పొందియున్న విషయంబును వదలుటచేతను యితరవిషయంబును గ్రహింపకుండుటచేతనుయీమధ్య కాలంబున విషయంబునంటకుండు నాతెలివికి నేరూపంబో అదియ చిదాకాశంబు. స్థూలంబునకు చూచువాఁడు సాక్షియనియు, చూచువానికి మనస్సు సాక్షియనియు, మనసున కగ్రముగ బుద్ధియనియు, బుద్ధికగ్రముగ ఆత్మయనియు, ఆత్మకగ్రముగ పరమాత్మయనియు, పరమాత్మకగ్రముగ పరబ్రహ్మమనియు పెద్దల అభిప్రాయమని తెలియవలయును.

☞ శ్రు॥ వృక్ష ఇవస్తబ్ధోదివితిష్ఠత్యేకస్తేనేదం పూర్ణంపురుషేణసర్వమ్ ఆకాశశరీరంబ్రహ్మ, ఖంబ్రహ్మ" అనునట్టి శ్రుతిప్రమాణములననుసరించి ఖశబ్దముచేత బ్రహ్మము చెప్పఁబడియెననియును, ఆత్మశబ్దముచేత జీవుఁడు చెప్పఁబడెననియును, ఈ జీవబ్రహ్మలను నొకటిగాఁజేసి బాహ్యవిషయములను దలఁపక బ్రహ్మతాదాత్మ్య భావనయందే నిశ్చయమైనబుద్ధికలవాఁడై యుండవలయుననియును, ఈశ్లోకముచేత బ్రహ్మసాక్షాత్కారమును దెలుపుటకు సమాధిలక్షణము చెప్పఁబడెననియును, ఈ విధముగా యోగియైనవానికి బ్రహ్మనిష్ఠకలుగుననియును తెలియవలయును.

శ్లో॥ స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః
బహిర్వ్యోమస్థితంనిత్యం నాసాగ్రేచవ్యవస్థితమ్
నిష్కళంతద్విజానీయా చ్ఛ్వాసోయత్రలయంగతః॥ ౧౫

టీ॥ స్థిరబుద్ధిః=స్థిరమైనబుద్ధికలవాఁడును, అసమ్మూఢః = అజ్ఞానరహితుఁడును. బ్రహ్మవిత్ = పరబ్రహ్మజ్ఞానముఁగలవాఁడును—అనఁగా బ్రహ్మమును తెలిసినవాఁడును, బ్రహ్మణి = బ్రహ్మయందు, స్థితః = ఉన్నవాఁడునునై. నిత్యమ్ = సర్వకాలములయందును, శ్వాసః=శ్వాసము, యత్ర=ఎక్కడ, లయమ్=లయమును, గతః=పొందినదాయెనో, తత్ర = అక్కడ, నాసాగ్రేచ = నాసాగ్రమందు, వ్యవస్థితమ్ = ఉన్నదియును, బహిర్వ్యోమస్థితమ్ = బాహ్యాకాశమునందున్నదియును, నిష్కళమ్=కళారహితమును—అనఁగా అవయవసంబంధములేనిదియును, (అయిన) తత్=ఆపరబ్రహ్మస్వరూపమును, విజానీయాత్=తెలిసికొనవలయును.

తా॥ నిశ్చలమైనబుద్ధిగలవాఁడును, అజ్ఞానరహితుఁడును, బ్రహ్మజ్ఞానముఁగలవాఁడును, బ్రహ్మమునందేయున్నవాఁడునునై యెల్లప్పుడును ఎక్కడెక్కడ ప్రాణవాయువు లయమునుపొందునో అట్టి నాసాగ్రమునందున్నదియును, బాహ్యాకాశమందున్నదియును, కళారహితమును, అవయవసంబంధశూన్యమైనదియును,

అయినపరబ్రహ్మమును దెలిసికొనవలయును.—అనఁగా బ్రహ్మజ్ఞాననిష్ఠుఁడు శృంగాటకమందు ధ్యానముచేయవలయునని తాత్పర్యము.

బ్రహ్మవిత్.—బ్రహ్మవేత్త, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు; బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అని బ్రహ్మవేత్తలు నాలుగు విధములు. అందు:—

1. బ్రహ్మవేత్త.—కర్మఫలత్యాగియై నిత్యనైమిత్తికకర్మలను విధిగ జరుపుచు యదృచ్ఛాలాభసంతుష్టియును, నిరహంకారమును, సర్వభూతదయాళుత్వమును, గలిగి ఆత్మారాముండునుఆత్మతృప్తుండునై కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులనెడు అరిషడ్వర్గంబులులేక ప్రియాప్రియములు నిందాస్తుతులు మానావమానంబులు శత్రుమిత్రులనెడు భేదములు లేక సంచరించువాఁడును, గుణాతీతుండును, దర్పణమును రూపమంటనిరీతిని నాలుకకు నేతిజిడ్డంటనిరీతిని కుమ్మరపురుగువలె అంటియంటక యుండువాఁడును, బ్రహ్మవేత్తయని జెప్పఁబడును. అగ్నిచే గాలినపత్రము పత్రమువలెనే గనుపడునట్లు అజ్ఞానదృష్టిచేత శరీరసహితముగాఁ గనుపడును. నిజముగా చూచినచో అశరీరుఁడనియే చెప్పవలయును, ఆతండే సుందరస్త్రీని సూకరముగ జూచును.

2. బ్రహ్మవిద్వరుఁడు—కర్మలనువదిలి సంప్రాప్తసుఖదుఃఖములనుభవించుచు సమాధినిష్ఠాగరిష్ఠుండై యుండువాఁడు బ్రహ్మవిద్వరుఁడు అనిచెప్పఁబడును.

3. బ్రహ్మవిద్వరీయుఁడు — సర్వకాలములయందు సహజామనస్క-రాజయోగనిష్ఠాగరిష్ఠుండై బరులవలన మేలుకొలుపంబడి కించిదాహారంబుగొనుచు నిద్రబోవువానివలె విశ్వమునుమఱచియుండువాఁడు బ్రహ్మవిద్వరీయుఁడు.

4. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు—బాహ్యాంతరములు మఱచి నిరంతరనిర్వికల్పసమాధినిష్ఠుండై ప్రకాశించువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

☞ బ్రహ్మవేత్తనియమములు —"అన్నంననిన్ద్యాత్"=అన్నమును నిందించగూడదు. "అన్నంనపరిచక్షీత"=అన్నమును పరిహరించగూడదు, "అన్నం బహుకుర్వీత"=అన్నమును మర్యాదచేయవలెను. తైత్తిరీయోపనిషత్.

శ్లో॥ పుటద్వయవినిర్ముక్తో వాయుర్యత్రవిలీయతే
తత్రసంస్థంమనఃకృత్వా ధ్యాయేత్పార్థతమీశ్వరమ్॥ ౧౬

టీ॥ పుటద్వయవినిర్ముక్తః = నానాపుటములజంటనుండి విడువఁబడిన, వాయుః=వాయువు, యత్ర=ఎక్కడ, విలీయతే = లీనమగుచున్నదో, తత్ర=అక్కడ,

మనః=మనస్సును, సంస్థమ్ = ఉన్నదానినిగా, కృత్వా=చేసి, హేపార్థ!=ఓఅర్జునుఁడా!తమ్=ఆ, ఈశ్వరమ్ = పరమాత్మను, ధ్యాయేత్ = ధ్యానముచేయవలయును.

తా॥ ఓ అర్జునుఁడా నాసారంధ్రములనుండి బయలువెడలినవాయువు ఎక్కడ లీనమగుచున్నదో అక్కడ మనస్సునునిలిపి ఆపరమేశ్వరుని ధ్యానముచేయవలయునని తాత్పర్యము.

☞ పంచభూతాత్మికమైన బహిరాకాశమందు మనస్సునిలుపకూడదు చిదాకాశమందేనిలుపవలయును. తద్వారా అపరోక్ష సాక్షాత్కారస్వానుభవముకలుగును.

ధ్యానము.—ధ్యానము సగుణధ్యానమనియు నిర్గుణధ్యానమనియు రెండు విధములు: అందు:—హృదయపద్మమందు విరాట్పురుషుని నిలిపి మనస్సుచేత సమస్త వస్తువులను గల్పించి షోడశోపచారములనుజేసి ధ్యానింపవలయును. ఇది సగుణధ్యానము. ఇంక నిర్గుణధ్యానమనఁగా వీరాసనమునసుండి చేతులను తొడలమీఁద నుంచుకొని నేత్రంబులుమూసి "అహంబ్రహ్మాస్మి" యను న్యాయముచొప్పునఁ బరబ్రహ్మస్వరూపమే తానని సదా నిర్వికల్పనిష్ఠఁగలిగియుండుట. స్థూలసూక్ష్మ కారణశరీరములు తానుగాననియుఁ బంచప్రాణములు ఉపవాయువులు తానుగాననియుఁ బదునాలుగింద్రియములు తానుగాననియు, శరీరప్రాణేంద్రియములకుఁ దాను సాక్షిననియు, నట్టిసాక్షిత్వమును వృత్తియే గనుక పరబ్రహ్మస్వరూపమే దాననియు సర్వదా బ్రహ్మనిష్ఠయందే యుండుట. ఇట్లు ధ్యానముచేయుట నిత్యము నభ్యాసముచేయఁగ నాత్మజ్యోతి దరిశనమిచ్చును. సత్యజ్ఞానానంద నిత్య నిర్మలాఖండ స్వరూపమగు పరబ్రహ్మమే తాననెడి నిశ్చయము స్వానుభవవేద్య మగుదాఁక సర్వకాల సర్వావస్థలయందు ప్రారబ్ధనాశనపర్యంతము నిర్వికల్ప బ్రహ్మనిష్ఠఁ గలిగియుండుటయే నిర్గుణధ్యానము.

శ్లో॥ నిర్మలంతంవిజానీయాత్ షడూర్మిరహితంశివం
శివగుప్తతనూపేత మానందంపరమవ్యయమ్॥ ౧౭

టీ॥ నిర్మలమ్=ఆణవమలము, కార్మికమలము మాయికమలము మాయేయమలము తిరోధానమలము లనెడి పంచవిధములగు మలములులేనివాఁడును, షడూర్మిరహితమ్=క్షుత్తృష్ణాశోకమోహ జరామరణములనియెడు నాఱువిధములగు నూర్ములులేనివాఁడును, శివమ్ = మంగళకరుఁడును. శివగుప్తతనూపేతమ్ = శుభములచేతవ్యాప్తమైన శరీరముతోఁ గూడుకొన్నవాఁడును, ఆనందమ్=బ్రహ్మానందమే స్వరూపముగాఁ గలవాఁడును. పరమ్=సర్వోత్తముఁడును, అవ్యయమ్=నాశము లేనివాఁడును (అయిన) తమ్=ఆపరమేశ్వరుని, విజానీయాత్ =తెలిసికొనవలయును.

తా॥ పూర్వోక్తములగు పంచమలములు లేనివాఁడును, ఆఁకలి దప్పిశోకము మోహము ముది మరణములనియెడు నాలువిధములయిన యూర్ములు లేనివాఁడును, మంగళకరుఁడును, శుభకరమైన దేహముతోఁగూడినవాఁడును, ఆనందరూపుఁడును, సర్వోత్తముఁడును, నాశములేనివాఁడును, అయిన పరమేశ్వరుని ధ్యానముచేయవలసినదని తాత్పర్యము.

☞ షడూర్ములు.—క్షుత్తృష్ణలు రెండును ప్రాణధర్మములనియు, శోకమోహములు రెండును మనోధర్మములనియు, జరామరణములు రెండును దేహధర్మములనియు, ఈ యాఱింటిలో నేదియును ఆత్మధర్మము కాదనియు, అందువలన పరమాత్మ షడూర్ములు లేనివాఁడనియు గ్రహింపవలయును.

శ్లో॥ స్వయముచ్చలితే దేహే దేహీత్యక్త్వాసమాధినా
నిశ్చలంతంవిజానీయా త్సంసారరహితంశివమ్॥ ౧౮

టీ॥ దేహే = దేహము, ఉచ్చలితే సతి = (అనాదిప్రారబ్ధవశముచేత) చలింపఁజేయఁబడినదగుచుండఁగా, దేహీ=జీవుఁడు, స్వయమ్=తాను, తమ్=ఆ దేహాభిమానమును, సమాధినా = బ్రహ్మనిష్ఠచేత, త్యక్త్వా = విడిచి, నిశ్చలం =చలనరహితమును, సంసారరహితమ్=జననమరణాద్యాత్మకమైన సంసారములేనిదియును, శివమ్=మంగళకరమును (అయిన) పరమాత్మను, విజానీయాత్ =తెలియవలయును.

తా॥ దేహము అనాది ప్రారబ్ధవశముచేత చలింపఁజేయఁబడిన దగుచునుండఁగా తాను దేహాభిమానమును విడిచిపెట్టి జీవబ్రహ్మైక్య భావనాయోగముచేత అవయవ రహితమును జనన మరణాద్యాత్మక సంసారరహితమును అయిన పరబ్రహ్మమును తెలియవలసినదని తాత్పర్యము. మఱియును. కొందఱు ఈశ్లోకమును—శ్లో॥ స్వయముచ్చలితేదేహే దేహీన్యస్తసమాధినా నిశ్చలంతంవిజానీయా త్సమాధిస్తస్యలక్షణమ్. టీ॥ దేహే = దేహము, ఉచ్చలితేసతి = అనాదిప్రారబ్ధవశముచేత చలింపఁజేయఁబడినదగుచుండఁగా, దేహీ=దేహాభిమానియగుజీవుఁడు, న్యస్తసమాధినా =ఉంచఁబడినసమాధిచేత, నిశ్చలమ్ = చలనరహితమైన, తమ్ = ఆపరమాత్మను, స్వయమ్=తాను, విజానీయాత్ = తెలిసికొనునో, తత్ = ఆ తెలిసికొనుటయే, తస్య =వానియొక్క, సమాధిః=సమాధియొక్క, లక్షణమ్ = లక్షణము. తాత్పర్యము.—చిరకాల కర్మవాసనవలన దేహము చలించినప్పటికిని, ధైర్యముచేత చలింపని ధ్యానయోగముచేత నిశ్చలమైనయాత్మను దెలిసికొనుట యేదికలదో అదియే సమాధిలక్షణమనఁబడునని తాత్పర్యము.

శ్లో॥ ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయం
సర్వశూన్యం నిరాభాసం సమాధిస్తస్యలక్షణమ్
త్రిశూన్యం యోవిజానీయా త్సద్యోముచ్యేత బంధనాత్॥ ౧౯

టీ॥ ప్రభాశూన్యమ్=కళారహితమును కాంతిలేనిదియును, (అనఁగాకనుబడుచున్న దేహాదిప్రపంచరహితమైనదనుట) మనశ్శూన్యమ్ = మనస్సులేనిదియును (దేహాదిప్రపంచమునకు హితమైనమనస్సులేదనుట) బుద్ధిశూన్యమ్ = ఘటపటాది నిశ్చయాత్మకమైనబుద్ధిలేనిదియును, నిరామయమ్ = రోగాదులులేనిదియును (అనఁగా నిర్వ్యాజమనుట) సర్వశూన్యమ్ = సర్వమునులేనిదియును (తనకువ్యతిరిక్తమైన ప్రపంచవస్తువులు మిథ్యయైనందున ఆనందైకరసమైన బ్రహ్మమేదికలదో యట్టిబ్రహ్మముగుతానొక్కఁడుమాత్రమే మిగిలియుండుననుట) నిరాభాసమ్ = భ్రమమూలమైనతలంపులేనిదియునుఅయినస్థితి, సమాధిస్తస్య=సమాధియందున్న వానియొక్క, లక్షణమ్=లక్షణమైయున్నది, యః=ఎవ్వఁడు, త్రిశూన్యమ్ = పైనజెప్పఁబడిన మూఁడు విధములయినశూన్యములను అనఁగా ప్రభాశూన్య మనశ్శూన్య బుద్ధిశూన్యములను, విజానీయాత్ = తెలిసికొనునో, సః = వాఁడు, బంధనాత్ = సంసారబంధములనుండి, సద్యః=తక్షణమే, ముచ్యేత=విడువబడును.

తా॥ కనఁబడుచున్న దేహాదిప్రపంచమునకు హితమైనమనస్సులేనిదియును, ఘటపటాదినిశ్చయాత్మకమగు బుద్ధిలేనిదియును, నిర్వ్యాజమును, నిరామయమును, తనకువ్యతిరిక్తమైనప్రపంచమంతయును మిథ్యయైనందున ఆనందైకరసమైన బ్రహ్మమేదికలదో అట్టిబ్రహ్మముగుతానొక్కఁడే నిలిచియుండుటయును, భ్రమమూలమైన తలఁపులేనిదియును, అనియెడుస్థితి సమాధియందున్నవానిలక్షణమనఁబడును.

☞ ప్రభాదిత్రివిధశూన్యము నెవ్వఁడుచూచుచున్నాఁడో యనుటచేత జాగ్రదాద్యవస్థాత్రయశూన్యత చెప్పఁబడెననియును, సర్వశూన్యమనుటచేత బ్రహ్మరూపుఁడైయుండుట సమాధి యని సూచింపఁబడెననియును, "సద్యోముచ్యేతబంధనాత్" అనుటవలన జీవన్ముక్తత చెప్పఁబడెననియును తెలియవలయును. జీవన్ముక్తుఁడగువాఁడు దేహాభిమానశూన్యుఁడు కావలసినదని యెఱుఁగవలయును.

శ్లో॥ అమాత్రంశబ్దరహితం స్వరవ్యంజనవర్జితం
బిందునాదకళాతీతం యస్తంవేదసవేదవిత్॥ ౨౦

టీ॥ అమాత్రమ్ = హ్రస్వదీర్ఘప్లుతములులేనిదియును, శబ్దరహితమ్ =శబ్దాతీతమును, స్వరవ్యంజనవర్జితమ్ = అక్షరసమూహాత్మకములైన పదములులేనిదియును,

బిందునాదకళాతీతమ్ = బిందునాదకళలకవ్వలనుండునట్టిదియును, (అయిన) తమ్= ఆ పరబ్రహ్మమును, యః=ఎవ్వఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, వేదవిత్ = వేదమునుదెలిసినవాఁడు.

తా॥ హ్రస్వదీర్ఘ ప్లుతములులేనిదియును, శబ్దాతీతమును అక్షరసమూహాత్మకములైన పదములులేనిదియును, బిందునాదకళల కవ్వలనుండునట్టిదియును అయిన బ్రహ్మము నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు వేదములను దెలిసినవాఁడనబడుచున్నాఁడని తాత్పర్యము.

☞ మనోబుద్ధిచిత్తాహంకారంబుల కుత్పత్తిస్థానమైన మహదహంకారంబునకు బీజభూతమైన మూలప్రకృతి యనియెడు పరాశక్తి బిందువనంబడుననియును, ఆపరాశక్తియనియెడు బిందువును భేదించుకొని పుట్టిన పరాపశ్యంతీమధ్యమావైఖరీ రూపములయిన చతుర్విధవాక్కులయొక్క ధ్వనియొక్క సమూహమునాదమనఁబడుననియును, క్షేత్రజ్ఞచైతన్యజీవులనియెడు నామధేయముల సముదాయము కళయనఁబడుననియును, వీనికన్నిటికిని అతీతమైన బ్రహ్మమునుదెలిసినవాఁడె సర్వవేదాంతతత్త్వజ్ఞుఁ డనఁబడుననియును తెలియవలయును. "మనోగ్రేవసతేబిందుః ప్రాణాగ్రేవసతేకళా ఉభయోర్లీయతేనాదం లయయిత్యుచ్యతేబుధైః" మనస్సునకు అగ్రముగానుండు బిందువగు బుద్ధియును ప్రాణమునకు అగ్రముగానుండు కళయును లీనముయినప్పుడే నాదమునులయమగును. అట్టినిష్కళయే పరబ్రహ్మస్వరూపమని తెలియునది.

<u>పరాపశ్యంతిమధ్యమవైఖరీవాక్కులు.</u>—వాక్కులు నాలుగువిధములు. పరావాక్కు=సంకల్పముపుట్టుట; పశ్యంతివాక్కు = సంకల్పమును వెలువరించుట; మధ్యమవాక్కు = దంతతాల్వోష్ఠవ్యాపారములతోఁగూడినది; వైఖరీవాక్కు =బిగ్గఱగా మాటలాడుట. ఈవాక్కులు దిగువనుండి యొకటొకటి యడఁగిపోఁగాఁ జివఱకునిలిచెడు పరావాక్కుగూడ లేనప్పుడు బ్రహ్మానందము కలుగును. "పరాప్రాణమయీప్రోక్తా పశ్యంతీచమనోమయీ మధ్యమాయింద్రియాఖ్యాహుః వైఖరీవాగితిస్మృతాః" అను ప్రమాణములను దెలియునది.

☞ ఈవిధముగ ప్రాప్తమైన తత్త్వజ్ఞానమునకు అనుభవ విపరీతభావనలు కారణము కనుక బ్రహ్మనిష్ఠునకుఁ జేయఁదగిన కార్యమును యీక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ ప్రాప్తేజ్ఞానేనవిజ్ఞానే జ్ఞేయేచహృదిసంస్థితే
లబ్ధశాంతిపదేజీవే నయోగోనైవధారణా॥ —౨౧

టీ॥ జ్ఞానేన = శాస్త్రాచార్యోపదేశజన్యమైన జ్ఞానముచేత, విజ్ఞానే = జ్ఞానవిశేషమగు భగవజ్జ్ఞానము, ప్రాప్తేసతి = పొందఁబడినదగుచునుండఁగా, జ్ఞేయేచ = సర్వవేదాంత తాత్పర్యగోచరమైన బ్రహ్మము, హృది = హృదయమునందు, సంస్థితే సతి = ఉన్నదగుచునుండఁగా, జీవే = జీవుఁడు, లబ్ధశాంతిపదే = పొందఁబడినయుపశాంతికలవాఁడగుచునుండఁగా, యోగః = యోగము, న = లేదు, ధారణా = ధారణ, నైవ = లేదు.

తా॥ శాస్త్రాచార్యోపదేశజన్యమైన జ్ఞానముచేత జ్ఞానవిశేషమగు పరమాత్మతత్త్వజ్ఞానము పొందఁబడినదగుచు నుండగను, సర్వ వేదాంత తాత్పర్యగోచరమైన బ్రహ్మము హృదయమునందు ప్రత్యక్షముగా ప్రకాశించుచుండఁగను దేహోపాధికల జీవుఁడు సంప్రాప్తమైన యుపశాంతికలవాఁడగుచు నుండఁగను, జీవన్ముక్తుఁడగునని యును, అట్టి జీవన్ముక్తునకు తన్నిమిత్తమైన యోగమునుగాని ధారణమునుగాని జేయ నక్కఱలేదని తాత్పర్యము. మఱియును యోగధారణలతో నిమిత్తములేకయే అనుభూతి స్వరూపమైన ఫలముసంబంధించును కనుక యోగసాధనమువలన ప్రయోజనము లేదనియును, బ్రహ్మాపరోక్షజ్ఞానముకల జీవన్ముక్తుఁడు ఈశ్వరుఁడగుననియును, తెలియవలయును.

శ్లో॥ యోవేదాదౌస్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్యప్రకృతిలీనస్య యఃపరస్సమహేశ్వరః॥ ౨౨

టీ॥ వేదాదౌ = సకలవేదముల యొక్కయును మొదటియందు, యః = ఏ, స్వరః = ప్రణవవ్యవహారము, ప్రోక్తః = చెప్పఁబడెనో, వేదాంతేచ = సకలవేదముల యొక్కయంతమందు, ప్రతిష్ఠితః = ఉంచఁబడెనో, ప్రకృతిలీనస్య = ప్రకృతియందణఁగి యున్న, తస్య = ఆస్వరమునకు, యః = ఎవ్వఁడు, పరః = సర్వోత్తముఁడో, సః = వాఁడు, మహేశ్వరః = మహేశ్వరుఁడు.

తా॥ సకలవేదములయొక్కయును మొదటియందు యేప్రణవవ్యవహారము చెప్పఁబడినదో, యేప్రణవవ్యవహారము సకలవేదములయొక్కయును అంతమందుంచఁబడినదో ప్రకృతియందణఁగియున్న యాప్రణవమున కవ్వలనుండువాఁడు మహేశ్వరుఁ డనఁబడునని తాత్పర్యము.

☞ సర్వవేదములను రక్షించుటకొఱకుగా నుంచఁబడినస్వరము ప్రణవమనఁబడును. ప్రణవరూపియైన ప్రకృతియొక్క పరాశక్త్యాద్యవస్థలయందలి లయమునకు పరమైయుండువాఁడు మహేశ్వరుఁడనఁబడును.

☞ బ్రహ్మసాక్షాత్కారము కలిగిన పిమ్మట ఆబ్రహ్మసాక్షాత్కారమునకు నిమిత్తమైన సాధనములతో పనిలేదనియును అనుభవజ్ఞానమువలన కృతకృత్యుఁడైన వానికిఁ గూడ సాధనములతోఁ బనిలేదనియును ఈ క్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ నావార్థీతుభవేత్తావద్యావత్పారంనగచ్ఛతి
ఉత్తీర్ణేచసరిత్పారే నౌకయాకింప్రయోజనమ్॥ ౨౩

టీ॥ యావత్=ఎంతపర్యంతము, పారమ్=నదీతీరమును, నగచ్ఛతి = పొందుచుండలేదో, తావత్=అంతపర్యంతమును, నావార్థీ=నావనుకోరువాఁడు, భవేత్=అగును. సరిత్పారే = నదీప్రవాహము, ఉత్తీర్ణేచసతి= దాటబడినదగుచునుండఁగా, నౌకయా=ఓడతో, ప్రయోజనమ్=పని, కిమ్ = ఏమికలదు.

తా॥ ఎంతకాలముదనుక నదీతీరమును జేరఁడో అంతకాలమువఱకును నదినిదాటుటకు ఓడచక్కఁగనుండవలయునని ఓడను అపేక్షించుచుండును. నదీప్రవాహమును దాటినపిమ్మట ఓడతోఁప్రయోజనములేదు. కనుక ఓడను అపేక్షింపఁడు. ఇటులనే బ్రహ్మసాక్షాత్కారముకలుగువఱకు వేదాంతశాస్త్రాచార్యోపదేశాదులతోఁ బనికలిగియుండు ననియును, బ్రహ్మ సాక్షాత్కారమైన పిమ్మట శాస్త్రాచార్యోపదేశాదులతోఁ బనిలేదు. కనుక వానిని విడిచిపెట్టవలయునని తాత్పర్యము.

☞ మఱియును దీనికనుగుణముగ "కింకరోమిక్వగచ్ఛామికింగృహ్ణామిత్యజామికిం ఆత్మనాపూరితంవిశ్వంమహాకల్పాంబునాయథా." ప్రళయకాలమునందలి జలప్రవాహముచేత లోకమంతయును వ్యాపింపఁబడినవిధముగ ఆత్మచేత సర్వమును వ్యాపింపఁబడియున్నదే. ఇఁక నేమిచేయుదును. ఎక్కడకుఁ బోదును, దేనిని గ్రహింతును అని గ్రంథాంతరమందుఁ జెప్పఁబడెనని యెఱుఁగవలయును.

శ్లో॥ గ్రంథమభ్యస్యమేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః
పలాలమివధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః॥ ౨౪

టీ॥ మేధావీ=బుద్ధిమంతుఁడగువాఁడు, గ్రంథమ్=వేదాంతశాస్త్రమును, అభ్యస్య = అభ్యసించి, జ్ఞానవిజ్ఞానతత్పరః=జ్ఞానవిజ్ఞానములను దెలిసికొనినవాఁడై, ధాన్యార్థీ=ధాన్యమునుగోరువాఁడు, పలాలమివ = తృణమునువలెనే (గడ్డినివలెనే), గ్రంథమ్ = గ్రంథమును, అశేషతః=సంపూర్ణముగా, త్యజేత్ = విడువవలయును.

తా॥ కృషీవలుఁడగువాఁడు ధాన్యమును గ్రహించినపిమ్మట కసవునువిడిచిపెట్టువిధముగ బుద్ధిమంతుఁడగువాఁడు వేదాంతశాస్త్రములను గురూపదేశపూర్వక

ముగ అభ్యసించి బ్రహ్మ సాక్షాత్కారమును పొందినపిమ్మట ఆగ్రంథములతోఁ బని లేదు కనుక విడిచిపెట్టవలసినదని తాత్పర్యము.

శ్లో॥ ఉల్కాహస్తోయథాకశ్చి ద్ద్రవ్యమాలోక్యతాంత్యజేత్
జ్ఞానేనజ్ఞేయమాలోక్య పశ్చాద్జ్ఞానంపరిత్యజేత్॥ ౨౫

టీ॥ కశ్చిత్ = ఒకానొకఁడు, ఉల్కాహస్తః=దీపము చేతియందుఁగలవాఁడై, ద్రవ్యమ్ = ద్రవ్యమును, ఆలోక్య = చూచి, తామ్=ఆ దీపమును, యథా=ఏవిధముగా, త్యజేత్=విడిచిపెట్టునో, తథా=ఆ విధముగా, జ్ఞానేన = జ్ఞానముచేత, జ్ఞేయమ్ = తెలియఁదగినయాత్మతత్త్వమును, ఆలోక్య=చూచి (తెలిసికొని) పశ్చాత్=పిమ్మట, జ్ఞానమ్=సాధనజ్ఞానమును, పరిత్యజేత్=విడిచిపెట్టవలయును.

తా॥ పురుషుఁడు చేతియందు దీపమునుంచుకొనినవాఁడై రాత్రులయందు చీకటియందున్నవియును తనకుఁగావలసినవియును అయినవస్తువులను గైకొనినపిమ్మట ఆ దీపమును విడిచిపెట్టువిధముగ శాస్త్రాచార్యోపదేశజన్యజ్ఞానముచేత ఆత్మసాక్షాత్కారమైనపిమ్మట సాధనమగు వృత్తిజ్ఞానమును విడిచిపెట్టి బ్రహ్మరూపముతో నుండవలసినదని తాత్పర్యము.

☞ ఇఁకమీఁదఁగూడ అపరోక్షానుభవము కలిగిన పిమ్మట ఆయపరోక్షజ్ఞానమునకు సాధనమగు పరోక్షజ్ఞానముతోఁ బ్రయోజనము లేదనుటయందుఁ దగిన దృష్టాంతమును జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ అమృతేనతుతృప్తస్య పయసాకింప్రయోజనం
ఏవంతత్పరమంజ్ఞాత్వా వేదైర్నాస్తిప్రయోజనమ్॥ ౨౬

టీ॥ అమృతేనతు = అమృతపానముచేత, తృప్తస్య = తృప్తినిపొందినవానికి, పయసా=ఉదకముతో, కింప్రయోజనమ్ = ఏమిపనికలదు, ఏవమ్=ఈ విధముగా, పరమమ్ = సర్వోత్తమమైన, తత్ = ఆపరమాత్మను, జ్ఞాత్వా = తెలిసికొనినయెడల, వేదైః=వేదములతో, ప్రయోజనమ్=పని, నాస్తి=లేదు.

తా॥ అమృతపానముచేత తృప్తుఁడైనవానికి ఉదకముతో పనిలేనివిధముగ బ్రహ్మ సాక్షాత్కారము కలిగినవానికి వేదములతోఁ బ్రయోజనములేదని తాత్పర్యము. ఇఁకను తత్త్వజ్ఞానికి విధినిషేధాదికర్తవ్యములులేవని యీ క్రింది శ్లోకము చేతఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ జ్ఞానమాత్రేణతృప్తస్య కృతకృత్యస్యయోగినః
నైవాస్తికించిత్కర్తవ్య మస్తిచేన్నసతత్త్వవిత్॥ ౨౭

టీ॥ జ్ఞానమాత్రేణ = బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముచేత, తృప్తస్య = తృప్తిని పొందినవాఁడును, కృతకృత్యస్య = ధన్యుఁడును, (అయిన) యోగినః=యోగికి, కర్తవ్యమ్ = చేయఁదగినపని, కించిత్=కొంచమైనను, నైవాస్తి = లేదు, అస్తిచేత్ =లోకానుగ్రహముకొఱకైనను చేయఁదగినకార్యముండెనేని, సః =వాఁడు, తత్త్వవిత్=తత్త్వమునుతెలిసినవాఁడు, న=కాడు.

తా॥ బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమనియెడు నమృతముచేత తృప్తుఁడును ధన్యుఁడును అయినయోగికి చేయఁదగిన కార్యమేదియును లేదు; ఒకవేళ లోకానుగ్రహముకొఱకైనను చేయఁదగినకార్యమేదియైన నుండెనేని అట్టివాఁడు తత్త్వవేత్త యనుటకు వీలులేదు అని తాత్పర్యము.

☞ వేదపాఠ శాస్త్రపాఠములచేత బ్రహ్మవేత్త కాఁడనియును, వేదాంతార్థగోచరమైన బ్రహ్మానుభవముకలవాఁడేవేదవేత్త యనిపించుకొనుననియును తెలియవలయును.

శ్లో॥ తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్
అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేదస వేదవిత్॥ ౨౮

టీ॥ తైలధారామివ= తైలధారవలె, అచ్ఛిన్నమ్=తెంపులేనిదియును, దీర్ఘఘంటానినాదవత్=అతిదీర్ఘమైనఘంటాధ్వనివలె, అచ్ఛిన్నమ్ = తెంపులేనిదియును, అవాచ్యమ్=వేదవాక్కులచేతఁ జెప్పనలవికానిదియును, ప్రణవస్య=ప్రణవముయొక్క, అర్థమ్=అర్థమును, (అయిన) తమ్=ఆపరమాత్మను, యః=ఎవ్వఁడు, వేద =తెలిసికొనుచున్నాఁడో, సః=వాఁడు, వేదవిత్=వేదవేదార్థములను తెలిసినవాఁడు.

తా॥ తైలధారవలె తెంపులేనిదియును, యెడతెగని ఘంటానాదమువలె తెంపులేనిదియును, వేదవాక్కులచేతఁ జెప్పనలవికానిదియును ప్రణవార్థమును అయిన బ్రహ్మమును తెలిసినవాఁడు వేదవేత్తయనఁబడునుఅని తాత్పర్యము.

☞ అకార ఉకార మకార బిందు నాద కళాత్మక మనెడి మూలప్రకృతిరూపమైన లక్ష్యార్థనిర్ణయమగు బ్రహ్మమును ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు సర్వమును తెలిసినవాఁడగుచున్నాఁడు.

శ్లో॥ ఆత్మానమరణింకృత్వా ప్రణవంచోత్తరారణిం
ధ్యాననిర్మథనాభ్యాసా ద్దేవంపశ్యేన్నిగూఢవత్॥ ౨౯

టీ॥ ఆత్మానమ్=తత్త్వధ్యానవంతుఁడైనజీవుని, అరణిమ్ = క్రిందనున్నఅరణినిగా, కృత్వా = చేసి, ప్రణవమ్ = ప్రణవస్వరూపమగుపరబ్రహ్మమును, ఉత్తరా

ణిమ్=ఊర్ధ్వభాగమునం దున్నయరణినిగా, కృత్వా=చేసి, ధ్యాననిర్మథ నాభ్యాసాత్=ధ్యానమనియెడు నిర్మథనాభ్యాసమువలన, నిగూఢవృత్ = గూఢముగావర్తించునట్టి, దేవమ్=దేవుని, పశ్యేత్=చూడవలయును.

తా॥ తత్త్వజ్ఞానముకలజీవుని క్రిందనున్నయరణినిగాఁ జేసియును, పరబ్రహ్మమును పైభాగమందున్న యరణినిగాఁ జేసియును, ధ్యానమనియెడు నిర్మథనముయొక్క యభ్యాసముచేత గూఢముగానున్న పరమాత్మను జూడవలయునని తాత్పర్యము.

శ్లో॥ విధూమాగ్నిప్రభందేవం పశ్యేదత్యంతనిర్మలం
తాదృశంపరమంరూపం స్మరేత్పార్థహ్యాననన్యధీః॥ 30

టీ॥ హేపార్థ=ఓ అర్జునుఁడా ! విధూమాగ్నిప్రభమ్=పొగలేని యగ్నిజ్వాలవలెఁ బ్రకాశించుచున్నవాఁడును, అత్యంతనిర్మలమ్=అతిస్వచ్ఛమైనవాఁడును, దేవమ్=ప్రకాశించువాఁడును,(అయిన)పరమాత్మను, పశ్యేత్ = చూడవలయును,పరమం రూపమ్=సర్వోత్తమమైనవాఁడును, (అత్యుత్కృష్టమగు బ్రహ్మస్వరూపము), తాదృశమ్=పైనచెప్పఁబడిన లక్షణములుకలవాఁడును, (అయిన) పరమాత్మను, అనన్యధీః = ఇతరమందుబుద్ధిలేనివాఁడై—అనఁగాయితరచింతలుమాని,స్మరేత్= స్మరింపవలయును.

తా॥ ఓ అర్జునుఁడా ! అపరోక్షానుభవముపఱకును స్వప్రకాశముయొక్క ధారణాస్వరూపమును చెప్పెదనువినుము. పొగలేని యగ్నిజ్వాలవలెఁ బ్రకాశించుచున్నదియును, అతిస్వచ్ఛమైనదియును అయినపరమాత్మను ఆత్మసాక్షాత్కారానుభవముకలుగువఱకును చూడవలెను, సర్వోత్తమమయిన యాబ్రహ్మమును ఇతరచింతలుమాని ధ్యానముచేయవలయు ననితాత్పర్యము.

☞ ఈ క్రిందిశ్లోకముచేత భావనాప్రకారమే బ్రహ్మస్వరూపమని ప్రకటనచేయుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ దూరస్థోపినదూరస్థః పిండస్థఃపిండవర్జితః
విమలస్సర్వదాదేహీ సర్వవ్యాపీనిరంజనః॥ 31

టీ॥ దేహీ=జీవుఁడు,దూరస్థోపి=(అజ్ఞానముచేత బ్రహ్మమునకు) దూరమునందున్నవానివలె నున్నప్పటికిని, దూరస్థః=దూరమునందున్నవాఁడు, న=కాఁడు, పిండస్థః=దేహమునందున్నవానివలెనున్నప్పటికిని, పిండవర్జితః = దేహమునందున్నవాఁడు కాఁడు, దేహీ=జీవుఁడు, సర్వదా=సర్వకాలములయందును, విమలః = స్వచ్ఛమైనవాఁడును, సర్వవ్యాపీ=అంతటనువ్యాపించినవాఁడును, నిరంజనః=పాపసంబంధములేనివాఁడును, (భవతి=అగుచున్నాఁడు.)

తా॥ జీవుఁడు సర్వకాలములయందును అజ్ఞానముచేత బ్రహ్మమునకు దూరమునందున్నవానివలెఁ గనఁబడుచున్నప్పటికిని దూరమందున్నవాఁడు కాఁడనియును, దేహమునందున్నవానివలెఁ గనుబడుచున్నప్పటికిని దేహసంబంధములేనివాఁ డగునని యును, నిర్మలుఁడనియును, సర్వమునందు వ్యాపించియున్నవాఁడనియును, జడ సంబంధములేనివాఁడనియును తెలియవలయును. మఱియును ఇట్లుచెప్పుటచేత జీవునకు వాస్తవముగ కర్తృత్వభోక్తృత్వాదులేవియునులేవని తాత్పర్యము.

శ్లో॥ కాయస్థోపినభుంజానః కాయస్థోపినబధ్యతే॥ 32

టీ॥ దేహీ=జీవుఁడు, కాయస్థోపి=శరీరధ్యానము నందున్నవానివలె నున్నప్పటికిని, భుంజానః=భోగములను అనుభవించువాఁడు, న=కాఁడు. కాయస్థోపి=బంధహేతువైన దేహమునందున్నప్పటికిని, నబధ్యతే=బంధింపఁబడఁడు.

తా॥ జీవుఁడు శరీరధ్యానముకలవాఁడైనప్పటికిని భోగరహితుఁడగుననియును, బంధహేతువగు శరీరమందున్న ప్పటికిని వాస్తవముగ బంధములేనివాఁడే యగుచున్నాఁడు. అనితాత్పర్యము.

శ్లో॥ కాయస్థోపినలిప్తస్స్యాత్ కాయస్థోపినబాధ్యతే॥ 33

టీ॥ కాయస్థోపి=సుఖదుఃఖాదిహేతువైన దేహమునందున్న వాఁడైనప్పటికిని, లిప్తః = సుఖదుఃఖాదులచేత వ్యాప్తమైనవాఁడు, నస్యాత్=కాఁడు. కాయస్థోపి=మరణాదికష్టములుగల దేహమునందున్నప్పటికిని, నబాధ్యతే = మరణాదులచేత బాధింపఁబడుచుండలేదు.

తా॥ జీవుఁడు సుఖదుఃఖాదులకు కారణమైన దేహమునందున్నవాఁ డైనప్పటికిని సుఖదుఃఖాదులచేత వ్యాప్తమైనవాఁడు కాఁడనియును, మరణాదిదుఃఖములుగల దేహమునందున్నప్పటికిని మరణాదులచేత బాధింపఁబడఁడనియును, తాత్పర్యము.

☞ ఇట్లుచెప్పుటచేత ఆత్మకు అస్తే, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతే యనఁగా పిండరూపమున నుండుట, పుట్టుట, పెరుగుట, మాఱుట, చిక్కుట, నశించుటయనునట్టి షడ్భావవికారములు లేవని సూచింపఁబడెనని యెఱుఁగవలయును.

☞ ఆత్మజ్ఞానముచేత కలిగిన సంసారసంబంధరూపమైన యపవాదము అపవాదముచేత తొలగిపోవుననియును, దేహాంతఃకరణాదులకంటె ఆత్మ విలక్షణుఁ డనియును ఈక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ తిలమధ్యేయథాతైలం క్షీరమధ్యేయథాఘృతం
పుష్పమధ్యేయథాగంధః ఫలమధ్యేయథారసః
కాష్ఠాగ్నివత్ప్రకాశేత హ్యాకాశేవాయువచ్చిరమ్॥ ౩౮

టీ॥ తిలమధ్యే = నువ్వులమధ్యయందు, తైలంయథా = నూనెవలెను, క్షీరమధ్యే = పాలమధ్యయందు, ఘృతంయథా = నేయివలెను. పుష్పమధ్యే = పుష్పమధ్యయందు, గంధోయథా = గంధమువలెను, ఫలమధ్యే = ఫలముయొక్క మధ్యయందు రసోయథా = రసమువలెను, కాష్ఠాగ్నివత్ = కట్టెలమధ్యయందు నిప్పువలెను, ఆకాశే = ఆకాశమునందు, వాయువత్ = వాయువువలెను, చిరమ్ = చిరకాలము, ప్రకాశేతహి = పరమాత్మ ప్రకాశించునుగదా!

తా॥ నువ్వులలోనున్న నూనె నువ్వులనుండి వేఱుచేయబడినట్లును పాలనుండి నేయి వేఱుచేయఁబడినట్లును పుష్పములనుండి గంధము వేఱుచేయఁబడినట్లును, ఫలమునుండి రసము వేఱుచేయఁబడినట్లును, కట్టెలనుండి నిప్పు వేఱుచేయఁబడినట్లును, ఆకాశమునందు వాయువున్నట్లును, పరమాత్మకూడ పంచకోశములనుండి వేఱుచేయఁబడినదై శాశ్వతముగ స్వయంప్రకాశముగలదై యుండునని తాత్పర్యము.

పంచకోశములు.—అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములని కోశములయిదును చేరి పంచకోశములని చెప్పఁబడియె. కోశము = కత్తిని ఒరయును, పిండమునుమావియును కప్పియున్నట్లు కప్పెడునదియె కోశము సంచియని చెప్పుదురు, అందు:—

1. అన్నమయకోశము = "అన్నవికార శుక్లశోణితజన్య షడ్భావవికారసహితం అన్నేనైవ వర్థమానం ఇదం స్థూలశరీర మన్నమయకోశః" అన్నమువలనఁబుట్టి అన్నమువలననేవృద్ధిఁబొంది శుక్లశోణితములవలనఁ గలిగిన ఉండుట పుట్టుట పెరుగుట మాఱుట చిక్కుట నశించుట యనునాఱుభావవికారములుగలదై స్తంభమువలె స్థూలమై ప్రత్యక్షముగ కరచరణాద్యవయవములతోను త్వక్చర్మమాంసరుధిరమెదోస్థిమజ్జలనెడు సప్తధాతువులతోను గూడినదై సమస్తప్రాణికోటికి కనుబడెడి స్థూలశరీరమే అన్నమయకోశము. స్థూలశరీరము జననమునకంటె పూర్వమందును మరణమునకుఁ బరమందును లేదు. ఆత్మ యెల్లప్పుడు కలదు. కనుక యిది యాత్మకాదు. మాతాపితృలయొక్క సంయోగమువలన కలిగి లయమగుచున్నది గనుక యాత్మకాదు.

2. ప్రాణమయకోశము = "ప్రాణాదిపంచకం ప్రాణమయః కర్మేంద్రియైర్యుతమ్" సమానవ్యానోదాన ప్రాణఅపానంబులనెడు పంచప్రాణంబులు వాక్పాణి

పాదపాయూపస్థలనెడు కర్మేంద్రియంబులు నాగకూర్మకృకరదేవదత్త ధనుంజయుల నెడు ఉపవాయువులును గూడి ప్రాణమయకోశమనంబడు. ఇదిఘటములవలెనే జడ స్వభావముగలిగి క్షుత్పిపాసలతోను రజోగుణ అహంకారంబులతోను గూడుకొని యున్నందున యాత్మకాదు.

3. మనోమయకోశము=హంసస్వరూపంబగు ప్రాణవాయువునందు మనసు నిల్వగాను మనోమయకోశమగును. "జ్ఞానేంద్రియైర్మనోయుక్తం మనోమయ ఇతీరితః" మనస్సు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణేంద్రియంబులు అనెడి జ్ఞానేంద్రియములైదును జేరి మనోమయకోశమగును. నేననెడి అభిమానముగల మనస్సు జడము గనుక మనోమయకోశము ఆత్మకాదు. ఇందు కామక్రోధలోభ మోహమదమాత్సర్యములను వికారములునుగలవు. కామక్రోధాదివృత్తులు ఒకప్పుడుండి యొకప్పుడు లేకపోతున్నవి గనుక యిది యాత్మకాదు. సుషుప్తిలో జడమై పడియుండి అహంకారముతో గూడుకొనియున్నది గనుక యాత్మ కాదు.

4. విజ్ఞానమయకోశము=ఆ మనస్సుచేత జ్ఞానమెఱిగి ధ్యానమననాదివృత్తి కలిగినప్పుడే విజ్ఞానమయకోశము అని చెప్పఁబడును. "బుద్ధిజ్ఞానేంద్రియైర్యుక్తం విజ్ఞానమయకోశమ్" బుద్ధియును, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియంబులైదును గూడి విజ్ఞానమయకోశము. ఈకోశమందు విద్యామదమును, తద్వారా మహదహంకారమును గలదు గనుక యిది యాత్మకాదు. చిచ్ఛక్తితోఁ గూడుకొనియుండే బుద్ధివృత్తి జాగ్రత్స్వప్నములయందుఁ బరిణమిస్తున్నందున యిది యాత్మకాదు.

5 ఆనందమయకోశము=అజ్ఞానమందు పరమానందమును పొందినాను అనెడిదియె ఆనందమయకోశము. మలినసత్వరజస్తమోగుణాత్మికమైన యవిద్యయే ఆనందమయకోశము. "ప్రియమోద ప్రమోదవృత్తిమదజ్ఞానప్రధాన మంతఃకరణం ఆనందమయకోశ ఇత్యుచ్యతే." ప్రియము మోదము ప్రమోదము అనెడువృత్తులతోఁ గూడిన యజ్ఞానమే ప్రధానముగాఁగల యంతఃకరణమే ఆనందమయకోశము. ప్రియము=పదార్థమునుజూచినమాత్రమున కలుగుసంతోషము; మోదము = తనకు లభించిన పిమ్మట గలిగినసంతోషము; ప్రమోదము = అనుభవించినపిమ్మట కలిగిన సంతోషము. ఈ కోశము ఘటమువలె జడమయినది గనుకయాత్మకాదు. త్రాటిని చూచి పామనిభయమును బొందినవానికి విచారణచేత భయముదీరి సంశయము రహితమైనటుల శ్రవణమనననిదిధ్యాసలచేతను నిత్యానిత్యవస్తువివేక విచారణచేతను పంచకోశములు రహితమై సర్వసాక్షియగు ఆత్మ హిరణ్మయకోశమందున్నట్లు

తోఁచఁబడును. ఆహిరణ్మయకోశమును దాఁటి అమనస్కంబయినచో సాక్షిత్వము గూడఁబోయి పరబ్రహ్మమం దైక్యముగును. అప్పుడు నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మస్వ రూపముదప్ప అన్యమేమియు లేదు. చెప్పేవారును లేరు. చూచునది చూడఁబడునది యును లేక సమస్తము పరబ్రహ్మస్వరూపముగును. ఈ కోశములు యొకటొకటిగా యంతరముగా నుండును. అన్నమయకోశంబునకంతరముగా ప్రాణమయకోశంబు ను, ప్రాణమయకోశంబున కంతరముగా మనోమయకోశంబును, మనోమయకో శంబున కంతరముగా విజ్ఞానమయకోశంబును, విజ్ఞానమయకోశంబున కంతరముగా ఆనందమయకోశంబును, ఆనందమయకోశంబున కంతరముగా హిరణ్మయకోశంబును గలవు. హిరణ్మయకోశముయొక్క నాశనమప్పుడు రూపనామక్రియా రహితమును ఆవరణరహితమును అగు అచలపరిపూర్ణమే నిలిచియుండును.

☞ ఈ క్రిందిశ్లోకముచేత ఆత్మ సర్వవ్యాపియని తెలియఁజేయుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ తథాసర్వగతోదేహీ దేహమధ్యేవ్యవస్థితః
మనస్థోదేహినాందేవో మనోమధ్యేవ్యవస్థితః॥ 37

టీ॥ తథా=ఆ విధముగా, (అనఁగా పూర్వమునందుఁజెప్పఁబడిన తైలధా రాదికమువలె) సర్వగతః = అంతటనువ్యాపించిన, దేహీ =జీవుఁడు, దేహమధ్యే= నానావిధములును భిన్నభిన్నములును అయిన దేవమనుష్యతిర్యగాదిదేహములయందు, వ్యవస్థితః=ఉన్నవాఁడై, (భాతి=ప్రకాశించుచున్నాఁడు.) దేవః = యీశ్వరుఁడు, దేహినామ్=అట్టి దేహములయందు భిన్నభిన్నులవలె నున్నజీవులయొక్క, మనస్థః =మనస్సులయందున్నవాఁడై, మనోమధ్యే = అట్టియంతః కరణములమధ్యమందు, వ్యవస్థితః=సాక్షీరూపముతోనున్నవాఁడై, (భాతి=ప్రకాశించుచున్నాఁడు.)

తా॥ పూర్వశ్లోకమునందుఁజెప్పఁబడిన తైలధారాదికమువలె జీవుఁడు నానా విధములును భిన్నభిన్నములును అయినదేవమనుష్య తిర్యగాదిదేహములయందు నూ నెమొదలగువానివలె నేకాకారముతోనున్నవాఁడని యెఱుఁగవలయును. అట్టిదే హములయందు భిన్నభిన్నములుగనున్న యంతఃకరణములయందు యీశ్వరుఁడు సాక్షీరూపముతోనుండి యజ్ఞానముకలవారి కనేకులవలెఁ గనఁబడుచున్నాఁడని యును, అట్లుఅనేకులవలె గనపడుచున్నను తానొక్కఁడెయై యంతటను ప్రకాశించు చున్నాఁడనియును తాత్పర్యము.

శ్లో॥ మనస్థంమనమధ్యస్థం మధ్యస్థంమనవర్జితమ్
మనసామనఆలోక్య స్వయంసిద్ధ్యంతియోగినః॥ 38

టీ॥ మనస్థమ్ = మనస్సునందున్నదై, మనమధ్యస్థమ్=సాక్షీభూతమై మనస్సునకుమధ్యయందున్నదియును, మధ్యస్థం = ఆప్రకారము మనస్సుయొక్క మధ్యయందుండియును, మనవర్జితమ్ = సంకల్పవికల్పములులేనిదియును, అయిన, మనః= అవబోధాత్మకమైనపరమాత్మను, మనసా = పరిశుద్ధమైన అంతః కరణముచేత, ఆలోక్య = చూచి, యోగినః=యోగులు, స్వయమ్ = స్వయముగా, తమంతటతామే, సిద్ధ్యంతి=సిద్ధినిపొందుచున్నారు.

తా॥ మనస్సునందుండియును, సాక్షీభూతమై మనస్సునకు మధ్యయందున్నదియును, ఆప్రకారము మనస్సుయొక్క మధ్యయందుండియును, సంకల్పవికల్పములు లేనిదియును అయిన యవబోధాత్మకమైనపరమాత్మను పరిశుద్ధమైన మనస్సుచేతఁ జూచి యోగులు తమయొక్క సదాచారాదులవలననే ముక్తిని పొందుచున్నారని తాత్పర్యము.

ఇప్పుడు చెప్పినవిషయమునకు యీ క్రిందిశ్లోకముచేత లక్ష్యమును చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆకాశంమానసంకృత్వా మనఃకృత్వానిరాస్పదం
నిశ్చలంతంవిజానీయా త్సమాధి స్తస్యలక్షణమ్॥ 32

టీ॥ మానసమ్ = మనస్సును, ఆకాశమ్=ఆకాశమునుగా, కృత్వా = చేసి, (అనఁగా నిర్విషయమైనదానినిగాఁజేసి) మనః = మనస్సును, నిరాస్పదమ్ = నిరాధారమైనదానినిగా, కృత్వా = చేసి, నిశ్చలమ్=నిష్క్రియుఁడైన, తమ్ = ఆపరమాత్మను, విజానీయాత్ = తెలియవలయును, (ఏతత్ = ఇది) సమాధిః = సమాధియందున్న, తస్య=ఆయోగియొక్క, లక్షణమ్=లక్షణము.

తా॥ మనస్సును ఆకాశమునుగాఁ జేసి అనఁగా సంకల్పవికల్పాత్మకమైన మనస్సును సంకల్పవికల్పములు లేనిదానినిగాఁ జేసి ఆమనస్సును ఏవిషయములమీదికిని బోకుండునట్లుచేసి నిశ్చలుఁడైనపరమాత్మను ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు సమాధియం దున్నవాఁడగును; మఱియును మనస్సును విషయములమీదికిఁ బోనీయక పరమాత్మను దెలిసికొనుటయే సమాధిలక్షణమని తెలియవలయునని తాత్పర్యము.

ఇదివఱకు ఆరూఢునిలక్షణము చెప్పఁబడెననియును, ఇఁకమీదట ఆరురుక్షునిలక్షణము చెప్పఁబడుచున్నదనియును తెలియవలయును.

శ్లో॥ యోగామృతరసంపీత్వా వాయుభక్షస్సదాసుఖీ
యమమభ్యసతేనిత్యం సమాధిమమృతాశనమ్॥ 33

టీ॥ యోగామృతరసమ్=యోగమనియెడునమృతరసమును, పీత్వా = పానముచేసి, వాయుభక్షః = ప్రాణాయామముచేత నిరోధింపఁబడిన కేవలకుంభకాహారము కలవాఁడై, సదా=సర్వకాలములయందును, సుఖీ = రోగాభావముచేతనైన దృఢగాత్రతచేత సుఖముకలవాఁడై, అమృతాశనమ్ = అమృతాహారస్వరూపమైనదియును, యమమ్ = యమమనుపేరుకలదియును, (అయిన) సమాధిమ్ = సమాధిని, నిత్యమ్ =సర్వకాలములయందును, అభ్యసతే = అభ్యసించుచున్నాఁడు.

తా॥ యమనియమాద్యష్టాంగాభ్యాసామృతపానమునుచేసి ప్రాణాయామముచేత నిరోధింపఁబడిన కేవలకుంభకాహారము కలవాఁడై సర్వకాలములయందును యోగాభ్యాసముచేతనైన రోగాభావముచేత మిగులదృఢమైన శరీరముగలవాఁడై అనఁగా సర్వకాలములయందును సుఖముకలవాఁడై సర్వకాలములయందును అమృతాహారరూపమును యమమనియెడుపేరుకలదియును అయినసమాధిని (బ్రహ్మనిష్ఠను) అభ్యసింపవలసినదని తాత్పర్యము.

అష్టాంగములు.—యోగాంగములు, పూర్వాంగములనియు యుత్తరాంగములనియు రెండువిధములు. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, యివిపూర్వాంగములు. ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి యివి యుత్తరాంగములు. మంత్రలయహఠరాజయోగములలో నేయోగమభ్యసించినను బూర్వాంగములు ముందుగనభ్యసించి పిమ్మట ఉత్తరాంగముల నభ్యసించవలయును.

1. యమము ;—అహింస, అస్తేయము, సత్యము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము అనియైదువిధములు. అందు :—

(1) అహింస—యజ్ఞములయందును, దుర్గాశక్తి నివేదనలయందునుతప్ప తక్కినకాలములయందును జంతువులను జంపకుండుట. ఈరు పేను నల్లి ఢీము యీఁగ మొదలగు స్వల్పజంతువులను క్రూరములగు పాములు తేళ్లు మండ్రగబ్బలు మొదలగువిషజంతువులను భయంకరములయిన సింహములు పెద్దపులులు చిరుతపులులు యేనుఁగులు అడవిపందులు యెలుగుబంట్లు మొదలుగాఁగల అడవిమృగములను చంపకయుండుట అహింస యనిచెప్పఁబడును. ఏ ప్రాణికిని నొప్పికలుగఁజేయకుండుట. ఎవనిమనస్సునకు నాయాసము గలిగింపకుండుట.

(2) అస్తేయము=స్వప్నమందయిన నితరులసొత్తు నాశింపక తనకెంతటి కష్టముసంభవించిన నెరులయాస్తిని దొంగిలింపక తానెంతటివిపత్తున మునిఁగియున్న నెట్టిపేదఱికము ననుభవించుచున్నఁ బెఱవారిసొమ్ము తనకురాఁగోరక అపహరింపుమని నోటఁజెప్పక చేతముట్టక యుండుట అస్తేయము.

(3) సత్యము=చూచినసంగతిచూచినట్లుగను, దెలిసినసంగతి తెలిసినట్లుగను విన్నసంగతి విన్నట్లుగను చెప్పుట. తనయొక్కగాని యితరులయొక్కగాని ప్రాణమానములను రక్షించుటకుఁ జెప్పిన యబద్ధము సత్యముగనే యెన్నఁబడఁ దగును. వీలుగలయప్పు డబద్ధముచెప్పియైనఁ బ్రాణమానములు రక్షింపనియెడ మహాపాపము గలుగునని పెద్దల యభిప్రాయము.

(4) అపరిగ్రహము=శిష్యులుతప్ప తక్కినయెవరేమియిచ్చినను దానములను బట్టకుండుట.

(5) బ్రహ్మచర్యము=స్త్రీసంభోగములేకయుండుట. మనస్సునందైనను స్త్రీలమీఁదఁ గోరికలేక యుండవలయును. భార్యకలవాఁడయ్యేనేని ఋతుకాలములయందుమాత్ర మామెతోఁ గ్రీడించి తృప్తిఁబొందువాఁడుబ్రహ్మచారిగానే యెన్నఁబడును. దోషములు కాయికదోషమనియు వాచకదోషమనియు మానసికదోషమనియు మూఁడువిధములు అందు కాయికము=అన్యస్త్రీని బ్రత్యక్షముగఁ బొందుట కాయికదోషము; వాచకము=అన్యస్త్రీనిగోరుచు నన్యస్త్రీలతోడి సంభాషణమునకు సంతోషించుచు, వారిపొందులభింపకపోయెనే యెట్లుసమకూడునని మిత్రులతో నాలోచించుచుండుట వాచకదోషము; మానసికము=అన్యస్త్రీలనువలచి వారికొఱకై మనసునఁ బరితపించుచు నెవ్వరికిందెలియనీయక లోలోనన కృశించుచుండుట మానసికదోషము. తనభార్యకాక తక్కిన స్త్రీలందఱు దల్లులనియుఁ దాను వారికుమారుఁడనియుఁ దలఁచుచు స్త్రీలమీఁదికోరిక తప్పించుకొనవలయును. ఋతుకాలము = బహిష్ఠైనదిమొదలు పదునాఱుదినములు. అందు మొదటి నాలుగుదినములు పదునొకండవదినమును బదుమూఁడవదినమును నిందితములు. అష్టమి, ఏకాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి, వ్రతదినములు, సూతకదినములును నిందితములు. కావున నీదినములయందు స్త్రీసంపర్కముకూడదు. మనదీపమని ముద్దుఁబెట్టుకున్నచో మూతి కాలును. అట్లే స్వభార్యయైనను ఋతుకాలములయందుదప్ప తక్కిన కాలములయందు సంభోగముకూడదు. శ్రాద్ధమందుభుజించినబ్రాహ్మణుఁడు తనభార్య కోరినను నాఁడు సంపర్కముచేయఁ గూడదు. ఋతుస్నానముచేసిన మూఁడుదినములకులోపలఁ గామాతురుఁడైయుండినను రమింపఁగూడదు. ఒకపడకయందుఁ బవళించుటయును గూడదు. ప్రాతఃకాలము పగలు అర్ధరాత్రముల యందును సంధ్యాకాలములయందును రమింపఁగూడదు. దితి సంధ్యాకాలమున కశ్యపునితో బలాత్కారముగ రమింప హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షులుబుట్టి సంధ్యాకాలదోషముచే అతిక్రూరులయిరి కనుక సంధ్యాకాలమందు సంగమము కూడదు. రాత్రికాలమందే

స్త్రీసంభోగము కూడునుగాని పగటఁ గూడదు. "ప్రాణంవా ఏతేప్రస్కందన్తి యే దివారత్యా సంయుజ్యన్తే బ్రహ్మచర్యమేవ తద్యద్రాత్రౌ రత్యాసంయుజ్యన్తే" ప్రశ్నోపనిషత్. అట్లుకానియెడ నాలుగవదినమున ననఁగా స్నానదినమున రమింపఁగా నిల్చినగర్భమందలి శిశువల్పాయువును దరిద్రమును బొందును. పదునొకండవ దినమున నిల్చినగర్భ మధర్మమందిచ్ఛగల యాడుశిశువును బొందును. పదుమూడవ దినమున నిల్చినగర్భమున వర్ణసంకరురాలగు కూతురు కలుగును, ఇది నిశ్చయము. ఉపరతివలన నిల్చినగర్భము స్త్రీయొక్క యాకారచేష్టలుగల నపుంసకుని బొందును; లేకున్నఁ బురుషచేష్టలుగల స్త్రీయైన నిలుచును. ఆఱుమాసములు మిగిలిన గర్భిణి స్త్రీని రమింపఁగూడదు. ఈబ్రహ్మచర్యనియమమును సమస్తమైనవారును జరుపవలయును.

2. నియమము:—స్వాధ్యాయము, సంతోషము, శౌచము, త్రివిధతపస్సులు, యీశ్వరప్రణిధానము, అనియైదువిధములు. అందు :—

(1) స్వాధ్యాయము=వేదమూలమంత్రములను పఠించుట. స్వాధ్యాయము వాచకమనియు ఉపాంశువనియు మానసికమనియు మూఁడువిధములు. వాచకము=నోట బిగ్గరగా యితరులకు వినఁబడునట్లు చెప్పుట; ఉపాంశువు=యితరులకు వినబడకుండ ధ్వనిగలుగకుండ మనస్సుననే పఠించుట; మానసికము=ధ్వనిలేకుండఁ బ్రత్యక్షరమును విరళించి నెమ్మదిగా మనసున జపముచేయుట, అన్నిటిలోనను మానసికము ముఖ్యము.

(2) సంతోషము = సుఖమునకు సంతోషింపక దుఃఖమునకు వ్యసనపడక ప్రారబ్ధమువలన నేవేళ కేది ప్రాప్తించినను యదృచ్ఛాలాభసంతుష్టితోనుండి నిత్యతృప్తినొంది యుండుట.

(3) శౌచము=మలినములేకుండుట. శౌచము, బాహ్యశౌచమని అంతరశౌచమని రెండువిధములు. అందు:—బాహ్యశౌచము = స్నానము మొదలగువానివలన శరీరముయొక్క వెలుపలి మలమును బోఁగొట్టుటయే బాహ్యశౌచము; అంతరశౌచము=అరిషడ్వర్గమును బంచమలములను విడనాడి మనస్సును బరిశుద్ధముగా నుంచుకొనుట.

(4) త్రివిధతపస్సులు = శరీరతపస్సు, వాక్తతపస్సు, మనోతపస్సు అని తపస్సులు మూఁడువిధముల. అందు:—యమమునందలి అహింస అస్తేయము సత్యము అపరిగ్రహము బ్రహ్మచర్యము అనునవియును, శౌచమునందలి బాహ్యపరిశుద్ధము అంతరపరిశుద్ధము అనునవియును అణకువయును విధేయతయును గలిగి దేవతలను పెద్దలను బ్రాహ్మణులను గురువులను పండితులను సన్యాసులను హంసలను పరమ

హంసలను అవధూతలను సాధులను బూజించుట శరీరతపస్సు; సత్యములై మనోహరములగు మాటలాడుటయును వేదమూలమంత్రములను బఠించుటయును వాక్తపస్సు; మనోనిగ్రహమును మనశ్శుద్ధియును మంచినడతయును గలిగియుండుట మనోతపస్సు అనిచెప్పఁబడును.

(5) యీశ్వరప్రణిధానము = జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములు నంతరింద్రియములును బూజాపాత్రములుగను దశవిధప్రాణములు పనిబాగులవాండ్రుగను గంగాయమునాసరస్వత్యాది నామములుగల యిడాపింగళాసుషుమ్నాదులగు నాడు లభిషేకాదిజలములుగను మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయములను షట్కమలములు పుష్పములుగను జఠరాగ్ని ధూపముగను జిత్కళలు దీపములుగను బ్రహ్మానందము నైవేద్యముగను సూర్యచంద్రులమండల జ్యోతు లారతులుగను జేసి శరీరమనెడు దేవాలయమందు సహస్రారకమలమనెడి సింహాసనముపైన శాంతి యనెడు సీతతోఁ యుండు పరబ్రహ్మస్వరూపుఁడగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించుచుండుటయే యీశ్వరప్రణిధానమని తెలియనది.

3. ఆసనములు:—ఆసనము లెనుబదినాలుగు లక్షలు. అందుముఖ్యములగునవి వివరింపఁబడును.

(1) పద్మాసనము = కుడితొడమీఁద నెడమపాదము నెడమతొడమీఁద గుడిపాదము నుంచి వెనుకప్రక్కగఁ గుడిచేతితోఁ గుడికాలిబొటనవ్రేలు, నెడమచేతితో నెడమకాలిబొటనవ్రేలునుబట్టికొని గడ్డము వక్షస్థలమునకు దగులునట్టుగఁ దలవంచి భ్రూమధ్యమందు దృష్టి నిలిపియుంచునది. ఇది గృహస్థులకు ముఖ్యము.

(2) సిద్ధాసనము = ఆసనమందు (మలద్వారమున) నెడమకాలిమడిమెయు లింగస్థానమందుఁ (మూత్రద్వారమున) గుడికాలిమడిమెయు నునిచి, శరీరము వంకరలేకుండ నిలిపి కొంచముగా తలవంచి సగముకన్నులుమూసి నిమీలితనేత్రుఁడై భ్రూమధ్యమందు దృష్టినినిలిపి ఆత్మావలోకనచేయునది. గృహస్థులకుఁ బద్మాసనము ముఖ్యము. తక్కినయాశ్రమస్థులకు సిద్ధాసనము ముఖ్యము. ఈ ఆసనమువలన మనస్సు నిర్మలమగును. ఇంద్రియనిగ్రహముగలిగి తద్వారా దేహదారుఢ్యమున్ను ముఖవర్చస్సున్ను కలుగును. ముఖము షోడశకళాపరిపూర్తియై యుండును.

(3) భద్రాసనము = కాలిచీలమండలను అండములక్రిందనునిచి రెండుమడిమలను రెండుచేతులఁ బట్టుకొని కదలక భ్రూమధ్యమున దృష్టిని నిలుపునది.

(4) సింహాసనము = ఎడమపిఱ్ఱక్రిందఁ గుడికాలిమడిమెయు కుడిపిఱ్ఱక్రింద నెడమకాలిమడిమెయు నునిచి తనరెండుచేతులవ్రేళ్లను రెండుమోకాళ్లమీఁద సవ్య

ముగ వెడల్పుగ నునిచి నిక్కసరిగాకూర్చుండి నోరుదెరిచికొని భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి ఆత్మావలోకన చేయునది.

(5) వీరాసనము=ఒకతొడమీఁద నొకపాదమును మఱియొక తొడక్రింద రెండవపాదమును జేర్చి శరీరమును వంకరలేకుండ నిలిపి భ్రూమధ్యమందు దృష్టినిలిపి యుండునది.

(6) కూర్మాసనము=కాలిమడిమలమీఁదఁ గూర్చుండి భ్రూమధ్యమందు దృష్టిని నిలుపునది.

(7) ముక్తాసనము=ఎడమకాలిమడిమచే గుదస్థానమునుగప్పి కుడిపాదము నెడమతొడమీఁదనునిచి భ్రూమధ్యమందు దృష్టినిలిపియుండునది.

(8) సుఖాసనము = అంతరబాహ్యదృశ్యములన్నియుఁ బరబ్రహ్మస్వరూపమనియు నాపరబ్రహ్మస్వరూపమే తాననియుఁదలఁచి యేసంకల్పమునులేక, నిస్సంకల్పుఁడై బడలిక జాడ్యము నిద్ర ఆయాసము మున్నగునవి యేపరబ్రహ్మస్వరూపముననుండుటచేతఁ గలుగవో యట్టియునికియే సుఖాసనము. [ద్రష్టృదర్శనదృశ్యములు అనఁగా చూచువాఁడు చూపు చూడఁబడునది యేపరబ్రహ్మమందు లయమగుచున్నవో యట్టిపరబ్రహ్మమునందే దృష్టినిలుపవలెంగాని యభ్యాసకులవలె భ్రూమధ్యమున లక్ష్యములు నిలుపరాదు. ఇదియ యమనస్కరాజయోగలక్షణము.]

4. ప్రాణాయామము:—చూడుము పుట 20.

5. ప్రత్యాహారము = జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను అంతరింద్రియములను వానివానివిషయములకుఁ బోనీయక మఱలించుట ప్రత్యాహారము. ఈ ప్రకారము నిత్యము నభ్యసించిన నింద్రియములు స్వాధీనములగును. ప్రాణాయామమువలన వాయువునిలిచినపు డింద్రియవ్యాపారములును నిలుచును. మనసునైతము నిలుచును. ఏసంగతినైన నాలోచించునప్పుడు మనస్సు ఆపనియందే నిలుచును. అట్టిసమయమున నెదుటనున్నవస్తువు కన్నులకుఁగనుపడదు. ఇతరులుచెప్పు మాటలు వినఁబడవు. ఇది సర్వత్రయనుభవమువలనఁ దెలియువిషయమే. అదే ప్రకారము మనస్సు పరబ్రహ్మస్వరూపమందు లయమైనఁ బదునాలుగింద్రియములును వ్యాపారశూన్యములైనిలుచును.

6. ధారణము :—చూడుము పుట 19.

7. ధ్యానము :—చూడుము పుట 24.

8. సమాధి :—శ్లో॥ సవికల్పోనిర్వికల్ప స్సమాధిర్ద్వివిధాభవేత్ దృశ్యశబ్దానువిద్ధోయం సవికల్పః పునర్ద్విధా॥ సమాధి సవికల్పమని నిర్వికల్పమని రెండువిధ

ములు. అందుసవికల్పము దృశ్యానువిద్ధ సవికల్పమని శబ్దానువిద్ధసవికల్పమని రెండు విధములు. ఈమూఁడును బాహ్యాంతరభేదములచేత నాఱువిధములయ్యెను. సమాధి ముక్తికిమార్గము. ముముక్షువులకు సహజనిర్వికల్పసమాధియు సుఖాసనమును ముఖ్యములు. బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పసమాధి అంతరదృశ్యానువిద్ధసవికల్పసమాధి బాహ్యశబ్దానువిద్ధ సవికల్పసమాధి అంతరశబ్దానువిద్ధసవికల్పసమాధి బాహ్యనిర్వికల్ప సమాధి అంతరనిర్వికల్పసమాధి యని యాఱువిధములు. అందు:—

(1) బాహ్యదృశ్యానువిద్ధసవికల్ప సమాధి :—బ్రహ్మవిష్ణు మహేశ్వరులనెడి త్రిమూర్తులు యింద్రాదిదేవతలు మనుష్యులు పశువులు పక్షులు క్రిమికీటకాదులు మొదలగుచేతనములును, కొండలు గుహలు పర్వతములు మొదలుగాఁగల అచేతనములును, నేత్రములకుగోచరములగు బాహ్యదృశ్యములనెడు సమస్తచేతనాచేతనములును దనతెలివియందేపుట్టి నశించును గనుక నట్టిదృశ్యములకుఁ దాను విలక్షణుఁడ ననియుఁ బరబ్రహ్మస్వరూపమే తాననియుఁ దలంచుట బాహ్యదృశ్యానువిద్ధసవికల్ప సమాధి యనఁబడును.

(2) అంతరదృశ్యానువిద్ధసవికల్పసమాధి=తనయందు స్వభావముచేతఁ బుట్టు నంతరదృశ్యములకు ననఁగా వృత్తులకుఁ దాను విలక్షణుఁడననియుఁ పరబ్రహ్మస్వరూపమే తాననియుఁ దలంచుట అంతరదృశ్యానువిద్ధసవికల్పసమాధి యని చెప్పుదురు.

(3) బాహ్యశబ్దానువిద్ధసవికల్ప సమాధి = బాహ్యశబ్దములనెడు సమస్తనామములకుఁ దాను విలక్షణుఁడననియు నామరూపక్రియారహితమగు పరబ్రహ్మస్వరూపమే తాననియుఁ దలంచుచు ఆనందముననే దేలుచుండుట బాహ్యశబ్దానువిద్ధసవికల్పసమాధియని తెలియునది.

(4) అంతరశబ్దానువిద్ధసవికల్పసమాధి = అంతరశబ్దములనెడు కామక్రోధలోభమోహమదమాత్సర్యములు మొదలగువానికి ప్రణవనాదమందలి చిణీనాదము, చిణిచిణీనాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళనాదము, వేణునాదము, భేరీనాదము, మృదంగనాదము, మేఘనాదము అనుదశవిధనాదంబులకుఁదాను విలక్షణుఁడననియుఁ బరబ్రహ్మస్వరూపమే తాననియుఁ దలంచుట అంతరశబ్దానువిద్ధసమికల్పసమాధి యని చెప్పఁబడును.

(5) బాహ్యనిర్వికల్పసమాధి=పైనాలుగువిధములగు సవికల్ప సమాధులయందును స్థిరమై అంతరబాహ్యములయందుఁ దనకంటె భిన్నమయినదేదియుఁ దోఁచక పరబ్రహ్మస్వరూపముగనె కనుపించుట బాహ్యనిర్వికల్పసమాధి యనఁబడును.

(6) అంతరనిర్వికల్పసమాధి=తానువిలక్షణుఁడననెడు వృత్తియులేక, తానే పరబ్రహ్మస్వరూపమనెడు వృత్తియులేక, యఖండపరిపూర్ణసచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమై తానుతానై యుండుట అంతర నిర్వికల్పసమాధి యని ప్రసిద్ధము. అనుభవమువలననే తెలిసికొనవలయును.

☞ ఈసమాధులయందు వాయువు పూర్తిగా నిలుచును. నిద్రకంటె నధికమయినసుఖము కలుగును. సమాధినిష్ఠాగరిష్ఠునకు నన్నపానాదులయందుఁ గోరికయుండదు. బంగారమును మట్టియు సమముగనే తోఁచును. అతనికి శీతోష్ణములు, సుఖదుఃఖములు, జాతిమతములు, శాస్త్రములు, కర్మలు, నుండవు. భూషింపడు. కొట్టఁడు, కొట్టఁబడఁడు, తిట్టఁడు, తిట్టువడఁడు.

☞ మఱియు సమాధి సంప్రజ్ఞాతసమాధియని అసంప్రజ్ఞాత సమాధియని రెండువిధములు. అందు—మనస్సు పూర్తిగా అయిక్యముకాకుండా వుండేస్థితి గలసమాధి సంప్రజ్ఞాతసమాధియనియు; మనస్సు పునరావృత్తిరహితముగా అయిక్యమయి బ్రహ్మానందమున మునిగియుండే స్థితిగలసమాధి అసంప్రజ్ఞాతసమాధి యనియుఁ జెప్పుదురు. సంప్రజ్ఞాతసమాధియందు ప్రజ్ఞయుండును; అసంప్రజ్ఞాత సమాధియందు ప్రజ్ఞలేదు. ఈ యసంప్రజ్ఞాతసమాధియే అంతరనిర్వికల్పసమాధి యని తెలియునది. యీ రెంటికిని భేదమేమియులేదు.

☞ శ్రమలేక నిర్వాణప్రాప్తికానేరదు. సకలప్రాణులు మరణించుటయందు ఆత్మ నేత్రములగుండానో లేక అధోముఖముగా మూలాధారముగుండానో లేక మరియేద్వారముననో బయలువెడలును. ఇట్టిసమాధులయందు అభ్యసించిన సమాధినిష్ఠాగరిష్ఠునకు కపాలకుహరము అనఁగా బ్రహ్మరంధ్రముగుండ ఆత్మ అంతరాత్మ పరమాత్మబయలు వెడలును. సమాధినిష్ఠుని శరీరము మంచికళలు గలిగియుండును. ఏ స్త్రీచూచినను మోహించునట్లు ప్రకాశమానముగ నుండును. స్వప్రకాశము దానంతట అదే బయలువెడలును. చిత్తము ప్రాణవాయువుతోకూడా సుషుమ్నతోకలియఁగను చిత్తనిరోధమగును. అప్పుడు మనస్సు నిలుచును.

☞ ప్రాణాయామముగాని సమాధులుగాని అభ్యాసకులు జామునకుమించి చేయగిట్టదు. స్త్రీసంపర్కమువలన బలహీనము యింద్రియనష్టము అగును. స్త్రీసంపర్కములేకుండ యోగాభ్యాసము చేయువానికి శరీరమంతా సుగంధము వ్యాపించును. విశేషముగా స్త్రీసంపర్కముగలవానికి శరీరమంతయు దుర్వాసనయగును.

☞ సమాధికివిఘ్నములు :—రోగము, బడలిక, సందేహము, అజాగ్రత, సోమరితనము, విషయలోలత్వము, తప్పుఅభిప్రాయము, స్థిరములేమి, బాధ, హీన

త్వము, జాడ్యము, ఆయాసము, దగ్గు మొదలుగాఁగలవి. ఇవియున్నప్పుడు సమాధు లుచేయగిట్టదు. మున్ముందుగా ప్రతిబంధములను నివర్తిఁజేసికొని సమాధినిష్ఠలకుఁ బోవలయును.

☞ మఱియును ఇప్పుడు ఆరురుక్షునకు సవికల్పక సమాధ్యుపాయము చెప్పఁబడినదనియును, ఇఁకమీఁదట ముముక్షువునకు నిర్వికల్పసమాధిని చెప్పుచు న్నాఁడనియును తెలియవలయును.

శ్లో॥ ఊర్ధ్వశూన్యమధశ్శూన్యం మధ్యశూన్యంయదాత్మనః
సర్వశూన్యంతదాత్మేతి సమాధిస్థస్యలక్షణమ్॥ 39

టీ॥ ఊర్ధ్వశూన్యమ్=భూర్భువస్సువరాద్యూర్ధ్వదేశపరిచ్ఛేదశూన్యమును, అధశ్శూన్యమ్ = అతలవితలాద్యధోదేశపరిచ్ఛేద శూన్యమును, మధ్యశూన్యమ్ = ఊర్ధ్వాధోదేశమధ్యవర్తిస్థావర జంగమాత్మకమైన ప్రపంచశూన్యమును, సర్వశూన్యమ్=దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమును, ఆత్మనః = పరమాత్మయొక్క, (రూపమ్=రూపము) యత్=ఏది, (అస్తి=కలదో) తత్ = అదియే, ఆత్మేతి = ఆత్మయనియెడు భావన, సమాధిస్థస్య=సమాధియందున్నవానియొక్క,లక్షణమ్ = లక్షణము,స్యాత్ = అగును.

తా॥ భూర్భువస్సువర్లోకాద్యూర్ధ్వదేశపరిచ్ఛేదశూన్యమును,అతలవితలాద్యధోదేశపరిచ్ఛేదశూన్యమును, ఊర్ధ్వాధోదేశమధ్యవర్తియగు స్థావరజంగమాత్మకమైనవస్తుపరిచ్ఛేదశూన్యమును అనఁగా దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమును, అయిన యాత్మయొక్క రూపమేదికలదో అదియె యాత్మ (తాను) అనియెడుభావనయే సమాధియందున్న వానిలక్షణము అనితాత్పర్యము.

☞ మఱియును ఇఁకమీఁదట సర్వశూన్యభావనకలవానికి విధినిషేధాదులులేవని చెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ శూన్యభావితభావాత్మా పుణ్యపాపైఃప్రముచ్యతే॥ 40

టీ॥ శూన్యభావితభావాత్మా = శూన్యమునుగా ఆలోచింపఁబడిన భావనతోఁ గూడిన యంతఃకరణము కలవాఁడు, పుణ్యపాపైః=పుణ్యపాపములచేత, ప్రముచ్యతే=విడువఁబడుచున్నాఁడు.

తా॥ తనకంటెన్యాతిరిక్తమగునది యేదియునులేదని తలఁచి సర్వమును తనను పరబ్రహ్మమునుగాఁ జూచుచున్న బ్రహ్మజ్ఞాని, "శ్రు॥ నైనంకృతాకృతేతపతః"= ఈ బ్రహ్మవిదుని పుణ్యపాపములు గసింపఁజేయలేవు అనియెడు శ్రుతిప్రమాణానుసారముగ పుణ్యపాపములచేత విడువఁబడుచున్నాఁడని తాత్పర్యము.

ఈ విధముగా భగవంతుఁడగు కృష్ణుఁడు చెప్పఁగావిని అర్జునుఁడు సమాధియందలి విరోధమునుగురించియును అసంభవమునుగురించియును ఇఁకమీఁదట అడుగుచున్నాఁడని యెఱుఁగవలయును.

## అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ అదృశ్యేభావనానాస్తి దృశ్యమేతద్వినశ్యతి
అవర్ణమస్వరంబ్రహ్మ కథంధ్యాయంతియోగినః ॥ ౪౧

టీ॥ అదృశ్యే=కనఁబడనివస్తువునందు, భావనా = ధ్యానము, నాస్తి= లేదు; దృశ్యమ్ =కనఁబడుచున్న, ఏతత్=ఈ ప్రపంచమంతయును, వినశ్యతి = నశించుచున్నది, అవర్ణమ్ = రూపరహితమును, అస్వరమ్ = శబ్దాదులకు గోచరముగానిదియును (అయిన) బ్రహ్మ=బ్రహ్మమును, యోగినః = యోగులు, కథమ్ = ఎట్లు, ధ్యాయంతి=ధ్యానముచేయుచున్నారు?

తా॥ ఓ కృష్ణుఁడా! కనఁబడనివస్తువునందు భావన అనఁగా ధ్యానము లేదు; మఱియును కనఁబడుచున్న యీ ప్రపంచమంతయును శుక్తియందలిరజితమువలె నాశమునుపొందుచున్నది, బ్రహ్మమన్ననో "శ్రు॥ యత్తదదృశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణ మచక్షుశ్శ్రోత్రంతదపాణిపాదమ్ అశబ్దమస్పర్శ మరూపమవ్యయమ్" అందఱియొక్కయును బుద్ధీంద్రియాదులకగమ్యము, కర్మేంద్రియములకు అవిషయము, మూలరహితము, శుక్లత్వాదిరహితము, చక్షుశ్శ్రోత్రాదులులేనిది, కర్మేంద్రియములులేనిది శబ్దస్పర్శరూపాదులులేనిది, నాశములేనిది అనియెడు శ్రుతిప్రమాణానుసారముగ రూపరహితమును శబ్దాదులకగోచరమును అయియున్నది. అట్టిబ్రహ్మమును యోగులు యెట్లు ధ్యానముచేయుదురని తాత్పర్యము.

తలచుటకు అననుభూతమైనది కనుక అదియోగమే కాదని యెఱుఁగవలయును. మఱియును బ్రహ్మము సావయవమూర్త్యాత్మకమయ్యేనేని ధ్యానముచేయుటకుఁ దగినదే కనుక ధ్యానమునెట్లుచేయుదునని యడుగనక్కరలేదనియును, కావున పూర్వముచెప్పఁబడిన భావము ఘటింపనేరదనియును, నిర్విశేషపరబ్రహ్మమే నిర్మలమని చెప్పఁబడిన వేదాంతములచేత ఆబ్రహ్మము లభించుననియును తెలియవలయును.

శ్రీభగవానువాచ.

భగవంతుఁడగుకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఊర్ధ్వపూర్ణమధఃపూర్ణం మధ్యపూర్ణంయదాత్మకం
సర్వపూర్ణంతదాత్మేతి సమాధిస్థస్యలక్షణమ్॥ ౪౨

టీ॥ఊర్ధ్వపూర్ణమ్=భూర్భువస్సువరాదిలోకములయందునిండియున్నదియును, అధఃపూర్ణమ్=అతలవితలాద్యధో లోకములయందు నిండియున్నదియును, మధ్యపూర్ణమ్=మధ్యమలోకము గు స్థావరజంగమాత్మక ప్రపంచమునందు వ్యాప్తమైనదియును, సర్వపూర్ణమ్=అంతటను నిండియున్నదియును, ఆత్మకం = పరమాత్మ యొక్క (రూపమ్=రూపము) యత్ = ఏది, (అస్తి=కలదో) తత్ = అదియేఅనఁగా ఆపరబ్రహ్మమే, ఆత్మేతి=ఆత్మయనియెడుభావన (తాననియెడుతలంపు) సమాధిస్థస్య=సమాధియందున్న వానియొక్క, లక్షణమ్=లక్షణము.

తా॥ ఊర్ధ్వాధోమధ్యలోకములయందంతటను నిండియున్నదియును అనఁగా దేశకాలవస్తుపరిచ్ఛేదంబును, సర్వమునందును నిండియున్నదియును అయిన బ్రహ్మమే తాననియెడు తలంపు సమాధియందున్న వానిలక్షణమని అనఁగా అఖండానందైకరసపరిపూర్ణమైనవస్తువు తానని యెవ్వఁడు ధ్యానముచేయునో వాఁడు సమాధిస్థుఁడని యెఱుఁగవలయునని తాత్పర్యము.

☞ మఱియును సాలంబనయోగమనియును నిరాలంబనయోగమనియును ద్వైవిధ్యమునుకల్పించి యీరెంటికిని దోషకల్పననుశంకించి అర్జునుఁడు అడుగుచున్నాఁడని యెఱుఁగవలయును.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ సాలంబస్యాప్యనిత్యత్వం నిరాలంబస్యశూన్యతా
ఉభయోరపిదోషత్వా త్కథంధ్యాయంతియోగినః॥ ౪౩

టీ॥ సాలంబస్య=ఆధారముతోఁగూడిన (అనఁగా మూర్తివంతమగువస్తువు యొక్క) యోగస్య=ధ్యానయోగమునకు, అనిత్యత్వమపి=అనిత్యత్వము, (స్యాత్=అగును,) నిరాలంబస్య=నిరాధారమైన (అనఁగా మూర్తివంతముగాని వస్తువు యొక్క) యోగస్య=యోగమునకు, శూన్యతా=అభావము, (స్యాత్=అగును.) ఉభయోరపి=సాలంబనిరాలంబధ్యానయోగములురెండును, దోషత్వాత్ = దోషముకలవగుటవలన, యోగినః=యోగులు, కథమ్=ఎట్లు, ధ్యాయంతి=ధ్యానమును చేయుచున్నారు.

తా॥ మూర్తిధ్యానముతోఁగూడిన యోగమునకు నాశముకలుగుచున్నది. మూర్తిధ్యానములేని యోగమునకు శశవిషాణాదులవలె అభావము కలుగుచున్నది. మఱియును యీసాలంబ నిరాలంబ యోగములు రెండును దోషయుతములయిన వగుటవలన యోగులు యేవిధముగా ధ్యానమును చేయుచున్నారని తాత్పర్యము.

☞ మఱియును కాలపరిపాకమువలన శుద్ధాంతఃకరణుఁడైనవానికి వేదాంతజన్యజ్ఞానమువలన ప్రపంచాతీతమైన బ్రహ్మముయొక్క సాక్షాత్కారముకలుగుచున్నదికనుక శూన్యముకాదను యభిప్రాయమును శ్రీకృష్ణుఁడు యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్రీభగవానువాచ.

సంపత్కరుఁడైన భగవంతుఁడుచెప్పుచున్నాఁడు.

శ్లో॥ హృదయం నిర్మలంకృత్వా చిత్తం శూన్యమనామయం
అహమేకస్సర్వమితి నైతత్పశ్యేత్పరంసుఖీ॥ ౮౮

టీ॥ హృదయమ్=మనస్సును, నిర్మలమ్ = అయిదువిధములయినమలములులేనిదానినిగా, కృత్వా=చేసి, చిత్తమ్=మనస్సును, శూన్యమ్ = ఇతరవిషయములులేనిదానినిగాను, నిరామయమ్ = కలుషరహితమైనదానినిగాను, కృత్వా=చేసి, సుఖీ=పరమసుఖముకలవాఁడై సర్వమ్=సమస్తమును, అహమ్ = నేను, ఏకః=ఒక్కఁడనే, ఇతి = ఇట్లని, పశ్యేత్ = చూడవలయును, పరమ్ = ఆత్మవ్యతిరిక్తమైన, ఏతత్=ఈసర్వమును, నపశ్యేత్=చూడఁగూడదు.

తా॥ హృదయమును ఇదివఱకుఁజెప్పఁబడిన యైదువిధములయిన మలములు లేనిదానినిగాఁ జేసి మఱియును మనస్సునందు ఏవిషయములను ప్రవేశింపనీయక కలుషరహితమైన దానినిగాఁ జేసి పరమసుఖముకలవాఁడై యీ కనుబడుచున్న ప్రపంచమంతయును నేనేకాని నాకంటె వ్యతిరిక్తమైనది యేదియును లేదని తలఁచి బ్రహ్మసాక్షాత్కారము కలవాఁడు కావలసినదని తాత్పర్యము.

☞ మిథ్యాప్రపంచమునకు శబ్దాత్మకత్వముచేతను, శబ్దమునకు వర్ణాత్మకత్వముచేతను, సకలవర్ణములకును అకారముత్పత్తిస్థానమని యెఱుఁగవలయును. మఱియును ఆయకారము ప్రణవాత్మకమైనది కనుక అక్షరములకు ప్రణవాత్మకత్వముచేతను, ప్రణవమునకు బింబాత్మకత్వముచేతను బ్రహ్మమందు వివర్తనరూపముచేత నాశ్రయించియున్నది. కాఁబట్టి బిందునాదకళాతీతమైన బ్రహ్మమును ధ్యానముచేయవలయునని భగవంతుఁడానతిచ్చెను గాన నీయర్థము లెస్సగాఁ దెలియుటకొఱకు యీక్రిందిశ్లోకముచేత అర్జునుఁడు అడుగుచున్నాఁడని యెఱుఁగవలయును.

## అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ అక్షరాణిసమాత్రాణి సర్వేబిందుసమాశ్రితాః
బిందుర్నాదేనభిద్యేత సనాదఃకేనభిద్యతే॥ ౪౫

టీ॥ సమాత్రాణి=హ్రస్వదీర్ఘప్లుతములతోఁగూడిన, అక్షరాణి—అక్షరములు, సర్వే=అన్నియును, బిందుసమాశ్రితాః = బిందువునాశ్రయించినవి, (భవంతి = అగుచున్నవి.) బిందుః=బిందువు, నాదేన=నాదముచేత, భిద్యతే= భేదింపఁబడుచున్నది, సః=అటువంటి, నాదః=నాదము, కేన = దేనిచేత, భిద్యతే=భేదింపఁబడుచున్నది.

తా॥ హ్రస్వదీర్ఘప్లుతములతోఁగూడిన యక్షరములన్నియునుబిందువును ఆశ్రయించియున్నవనియును, ఆబిందువు నాదముచేత భేదింపఁబడుచున్నదనియును, చెప్పఁబడుచున్నదికదా ! ఓ కృష్ణుఁడా ! ఆనాదము దేనిచేత భేదింపఁబడుచున్నదని అర్జునుఁడు ప్రశ్నమునుచేసెనని తాత్పర్యము.

☞ ఈవిధముగా అర్జునుఁడు అడుగఁగా నీవడిగినది బ్రహ్మమునందుఁగూడునని శ్రీకృష్ణుఁడు ఈక్రిందిశ్లోకముచేత సమాధానమును చెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

## శ్రీభగవానువాచ.

భగవంతుఁడగు కృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అనాహతస్యశబ్దస్య తస్యశబ్దస్యయోధ్వనిః
ధ్వనిరంతర్గతంజ్యోతి ర్జ్యోతిరంతర్గతంమనః
తన్మనోవిలయంయాతి తద్విష్ణోఃపరమంపదమ్॥ ౪౬

టీ॥ అనాహతస్య = షట్చక్రములలో నొకటియగు అనాహతచక్రముయొక్క—మధ్యను, శబ్దస్య=శబ్దము, (అస్తి = కలదు.) తస్య=ఆ, శబ్దస్య= శబ్దముయొక్క అంతరమందు, ధ్వనిః= ధ్వని, యః=ఏది, (అస్తి= కలదో), (తస్య=అటువంటి), ధ్వనిః=ధ్వనియొక్క, అంతః=లోపల, జ్యోతిః=తేజస్సు, గతమ్ = పొందినది అయివున్నది. జ్యోతిరంతః=తేజస్సుయొక్కలోపల, మనః=మనస్సు, గతమ్ =పొందినది అయివున్నది, తన్మనః=ఆశబ్దాదిప్రపంచకారణమైనమనస్సు, (యత్ర =ఎక్కడ), విలయమ్=నాశమును, యాతి=పొందుచున్నదో, తత్=అది, విష్ణోః =విష్ణువుయొక్క, పరమమ్=శ్రేష్ఠమైన; పదమ్=స్థానము.

తా॥ యోగసంబంధములైన షట్చక్రములలో అనాహతచక్రముయొక్క ధ్వనిలోపల జ్యోతిస్సు ఇమిడియున్నదనియును, ఆమనస్సు జ్యోతిస్వరూపమైన దగుటచేత ఆమనస్సు జ్యోతిస్సులోపల నున్నదనియును, తెలియవలయును. మఱియును ఇట్టిమనస్సు ఎక్కడలయమును బొందుచున్నదో అదియె విష్ణువుయొక్క పరమపదమని యెఱుఁగవలయును. అనఁగా ఎడతెగనినాదమునందు జ్యోతిస్సు ఉన్న దనియును, జ్యోతియందు మనస్సు అంతర్గతమై యున్నదనియును అట్టిమనస్సు దేనియందు లయమగునో అదియే విష్ణువుయొక్క పరమపదమనఁబడును. అనఁగా మనస్సు వృత్తిశూన్యము కాఁగా అట్టిస్థితి బ్రహ్మమందు లయమనఁబడును. మఱియు నదియే పరమపదమనఁబడునని తాత్పర్యము.

షట్చక్రములు.—మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞాచక్రము అని యాఱుచక్రములు; అందు:—

1. మూలాధారము=స్థూలశరీరంబునందు గుదస్థానముకంటె రెండంగుళంబులు మీఁదను లింగస్థానమునకంటె రెండంగుళంబులుక్రిందను అగ్రకోణము అధోముఖముగాఁగల మూఁడుకోణంబులతో శరీరమునకు మధ్యను మూలాధారచక్రమున్నది. అందు నాలుగుదళములుగల కమలముండును. వ శ ష స అనెడునాలుగును బీజములు. ఈకమలమున కధిపతియగు గణపతికి అజపాగాయత్రీమంత్రజపమున 600 హంసలు సమర్పింపఁబడును. ఇది పృథివికిస్థానము గాన దీనికిని ముక్కునకును సంబంధము. ఇది మలవిసర్జనకుఁ గారణము.

2. స్వాధిష్ఠానము=మూత్రద్వారమందు ఆఱుదళములుగల కమలముండును. బ భ మ య ర ల అనెడునాఱును బీజములు; ఈకమలమున కధిపతియగుసరస్వతితోఁ గూడియుండు బ్రహ్మకు అజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది జలమునకు స్థానముగాన దీనికిని నాలుకకును సంబంధము. ఇది మూత్రవిసర్జనకు శుక్లశోణితమలవిసర్జనకును గారణము.

3. మణిపూరకము=నాభియందుఁ బదిదళములుగలకమలముండును. డ ఢ ణ త థ ద ధ న ప ఫ అనెడుపదియును బీజములు. ఈకమలమున కధిపతియగులక్ష్మితోఁ గూడియుండు విష్ణువునకు నజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది అగ్నికి స్థానముగాన దీనికిని గన్నులకును సంబంధము. ఇందలి యగ్ని భుజించిన సమస్తపదార్థములను జీర్ణముచేయును. ఇదియె చిత్తమునకుస్థానము.

4. అనాహతము=వక్షస్థలమందు ఆమ్మొముకకును వీణాదండమునకును మధ్యనుండెడి హృత్పద్మము. ఇదిపండ్రెండుదళములుగల కమలము. క ఖ గ ఘ ఙ చ ఛ జ

ఝ ఞ ట ఠ అనెడుపండ్రెండును బీజములు. ఈకమలమున కధిపతియగు పార్వతితోఁ గూడియుండురుద్రునకు అజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁ బడును. ఇది వాయువునకుస్థానముగాన దీనికిని త్వగింద్రియమునకును సంబంధము. ఇదియె ప్రాణవాయుసంచారమునకును అహంకారమునకును స్థానము.

5. విశుద్ధము = కంఠస్థానమందుఁ బదియాఱుదళములుగల కమలముండును. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః అనెడిపదునాఱును బీజములు. ఈకమలమున కధిపతియగు నీశ్వరునకు నజపాగాయత్రీమంత్రజపమున 1000హంసలు సమర్పింపఁబడును. ఇది యాకాశహంశముగానఁ జెవులతో సంబంధము గలిగి యుండును. ఇదియె మనస్సునకు స్థానము. సమస్తభూతములయందుండెడియాత్మ స్వరూపమే కృష్ణుఁడనియు నాకృష్ణుఁడు సహస్రారమం దుండుననియు విశుద్ధచక్రంబు నందలి పదియాఱుదళంబులను వీక్షించుచుండుననియు నీపదియాఱుదళంబులే పదియాఱువేలగోపికలనియు నీవీక్షణవలననే కృష్ణుఁడు గోపికలతోఁ బొందెననియు నా కృష్ణుఁ డస్ఖలితబ్రహ్మచారియనియు సదోపవాసియనియుఁ జెప్పుదురు.

6. ఆజ్ఞాచక్రము=భ్రూమధ్యమందు రెండుదళములుగల కమలముండును. హం క్షం యనునవిబీజములు. ఈకమలమున కధిపతియగు సదాశివునకు నజపాగాయత్రీ మంత్రజపమున 1000హంసలుసమర్పింపఁబడును. ఇది బుద్ధికి స్థానము. మనస్సునకు గంఠముస్థానమైనను సకలేంద్రియవ్యాపారములు చేయుటయందు ఆజ్ఞాచక్రమునకు వచ్చును గనుక మనసునకు విషయమగుసంకల్పవికల్పములేయాచక్రమునకు రెండు దళములని చెప్పఁబడెను. మొదటయైదుచక్రములయందు హఠయోగులు క్రమక్రమముగ మనసునిలిపి వాయునిరోధముచేసి అభ్యసించెదరు. రాజయోగులు ఆజ్ఞాసహస్రారచక్రములయందే అభ్యాసము చేసెదరు. ఇదియేముక్తికాంతకుస్థానము. ఇచ్చటి ముక్తికాంత లేక జ్ఞానకాంతతో సంయోగమే జీవన్ముక్తి. ఇదియె జీవేశ్వరైక్యము దీనినే త్రినేత్రమనియుఁ జెప్పుదురు.

శ్లో॥ ఓంకారధ్వనినాదేన వాయుసంహరణాత్మకమ్
నిరాలంబంసముద్దిశ్య తత్రనాదోలయంగతః॥ ౮౭

టీ॥ వాయుసంహరణాత్మకమ్ = వాయువుయొక్క యుపసంహారమేస్వరూపముగాఁగలదియును, నిరాలంబమ్ = నిరాధారమును అయినబ్రహ్మమును, ఓంకారధ్వనినాదేన=ఓంకారధ్వనియొక్క నాదముచేతను, సముద్దిశ్య=ఉద్దేశించి అనఁగా లక్ష్యముంచి, (యత్ర=ఎక్కడ, విద్వాన్ = విద్వాంసుఁడు, నివసతి = నివసించు

చున్నాఁడో) తత్ర=అక్కడ, నాదః=నాదము, లయమ్=నాశమును, గతః=పొంది నది, (భవతి=అగుచున్నది.)

తా॥ వాయువుయొక్క యుపసంహారణమే స్వరూపమునుగాఁగలదియును, నిరాధారమును అయినబ్రహ్మమును ఓంకారధ్వనియొక్క నాదముచేత లక్ష్యమునం దుంచి. విద్వాంసుఁడు ఎక్కడలయమునుపొందుచున్నాఁడో అక్కడ నాదము లయ మునుపొందుచున్నదని యెఱుఁగవలయును. అనఁగా ఓంకారధ్వన్యాత్మకమైన నాదము తోడ మారుతోపసంహారణాత్మకమైన నిరాలయనిర్విశేషబ్రహ్మమును లక్ష్యమునుం చుటచేత ఆబ్రహ్మమునందే నాదము లయమునుపొందును ఆనాద మేదికలదో అదియే యావిష్ణుదేవుని పరమపదమగునని తాత్పర్యము.

☞ నాదమనఁగాఁ బ్రణవమందు పుట్టినధ్వని; రేచక పూరక కుంభకా దులవలనం బుట్టినవాయువు లయమగుపర్యంతమును ఆ నాదముండును. ఆ వాయు వు లయమైనయెడల నిరాలంబమైన బ్రహ్మమందు నాదము లయమగును. రేచక పూరక కుంభకాదులవలనఁ బుట్టినవాయువు మనసుతో సంబంధించియున్నది. చిత్తైకాగ్రతఁజేసి మనస్సును వృత్తిరహితమునుగాఁజేసినచో ఆ వాయువు వెంటనే లయమగును. "దృశ్యంకృత్స్నం లీయతేయత్ర మనస్తత్రైవలీయతే దృష్ట్యమనోలీయతే యత్ర మారుతం తత్రలీయతే" అనుప్రమాణానుసారముగ మనోమారుతములు లయమగుచున్నవి. (చూడుము యోగము.—పుట 13) మఱియును "మనో గ్రేవసతేబిందుః ప్రాణాగ్రేవసతేకళా ఉభయోర్లీయతేనాదం లయయిత్యుచ్యతే బుధైః" మనసునకగ్రముగానుండు బిందువగుబుద్ధియును ప్రాణమునకగ్రముగానుం డుకళయును లీనమయినప్పుడే నాదమును లయమగును. అట్టినిష్కళయే పరబ్రహ్మ స్వరూపము. అదియే బ్రహ్మస్థానమనియెఱుఁగవలయును.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ భిన్నేపంచాత్మకేదేహే స్థితేపంచసుపంచధా
ప్రాణైర్విముక్తేదేహేతు ధర్మాధర్మౌక్వగచ్ఛతః॥ ౨౮

టీ॥ పంచాత్మకే = పంచభూతాత్మకమైన, దేహే = దేహమునందలి, పంచ సు=పంచభూతములు, పంచధా = అయిదువిధములుగా, భిన్నే = భిన్నములై, స్థితే సతి=ఉన్నవగుచుండఁగా, ప్రాణైః = ప్రాణములచేత, దేహే = దేహము, విముక్తే సతి = విడువఁబడినదగుచునుండఁగా, ధర్మాధర్మౌ = ధర్మాధర్మములు, క్వ = ఎక్క డకు, గచ్ఛతః=పోవుచున్నవి.

తా॥ ఓ కృష్ణుఁడా ! పంచభూతాత్మకమైన దేహమునందలి పంచభూతములును అయిదువిధములుగా భిన్నములగుచునుండఁగను దేహము ప్రాణములచేత విడువఁబడినదగుచునుండఁగను ఆ జీవుఁడు చేసినధర్మాధర్మములు ఎక్కడకుఁ బోవుచున్నవో చెప్పుమని తాత్పర్యము.

☞ ఈ విధముగా అర్జునుఁడు అడిగినప్రశ్నమునువిని చేయఁబడిన పుణ్య పాపములు లింగశరీరముతోఁ గూడియుండునని శ్రీకృష్ణుఁడు ఈ క్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు.

శ్రీభగవానువాచ.

భగవంతుఁ డగుకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ధర్మాధర్మౌమనశ్చైవ పంచభూతానియానితు
ఇంద్రియాణిచపంచైవ యాశ్చాన్యాఃపంచదేవతాః॥ ౪౯

శ్లో॥ జీవేనసహగచ్ఛంతి యావత్తత్త్వంనవిందతి
మనసాసర్వథాతావ న్నిత్యమేవాభిమానినః॥ ౫౦

టీ॥ ధర్మాధర్మౌ = పుణ్యపాపములు, మనశ్చైవ = మనస్సును, యాని = ఏ, పంచభూతానితు = పంచభూతములును, పంచ = అయిదైన, ఇంద్రియాణిచైవ= ఇంద్రియములును, యాశ్చ = ఏ, అన్యాః = ఇతరములయిన, దేవతాః=దిగ్వాతార్కప్రచేతోశ్వినులనియెడు దేవతలు, పంచ = అయిదుగురును, మనసా = మనస్సుతో, సర్వథా = సర్వవిధములచేతను, నిత్యమేవ = ఎల్లప్పుడును, యావత్ = ఎంతపర్యంతము, అభిమానినః = మమతాహంకార విషయాభిమానముకలవై, తత్త్వమ్= వాస్తవమును, నవిందతి=తెలియకుండునో, తావత్ = అంతవఱకును, జీవేనసహ= జీవోపాధియగులింగదేహముతోఁగూడ, గచ్ఛంతి=పోవుచున్నవి.

తా॥ సర్వవిధములచేతను మమతాహంకారవిషయాభిమానులై, బ్రహ్మసాక్షాత్కారముకలవారు ఎంతవఱకుకారో అంతవఱకును పుణ్యపాపములును మనోబుద్ధిచిత్తాహంకారములనియెడు నంతఃకరణచతుష్టయమును, పృథివ్యప్తేజోవాయ్వాకాశములనియెడు పంచభూతములును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనియెడు పంచేంద్రియములును, అనఁగా జ్ఞానేంద్రియపంచకమును, దిక్కులు వాయువు సూర్యుఁడు ప్రచేతసుఁడు (వరుణుఁడు) అశ్వినీదేవతలు అనునట్టి యింద్రియాభిమానిదేవతలును, జీవోపాధిగల లింగదేహముతోఁగూడ పోవుచున్నవికాని నశించిపోవని యెఱుఁగవలయును. అనఁగా ధర్మాధర్మములు లింగదేహమున్నంతవఱకును లింగదేహముతోఁగూడ పోవుచువచ్చుచుండునని తెలియునది.

☞ శ్రు॥ చక్షుషోవా మూర్ధ్నోవా అన్యేభ్యోవా శరీరదేశేభ్యస్తము త్క్రామంతం ప్రాణోనూత్క్రామతిప్రాణమనూత్క్రామంతం సర్వేప్రాణాఅనూత్క్రామంతిసవిజ్ఞానోభవతి సవిజ్ఞానమేవాన్వవక్రామతి తంవిద్యాకర్మణీ సమన్వారభేతేపూర్వప్రజ్ఞాచ ॥ = ఆదిత్యలోకప్రాప్తిహేతువులయిన నేత్రములచేతఁగాని బ్రహ్మలోకప్రాప్తినిమిత్తమైన శిరస్సుచేతఁగాని అయ్యేకర్మములకుఁదగినట్లు శరీరావయవములనుండిగాని పరలోకముకొఱకు ప్రయాణమై బయలువెడలిన విజ్ఞానాత్మను అనుసరించి ప్రాణము బయలువెడలుచున్నది. ఆ ప్రాణమును అనుసరించి సమస్తములైన వాగాదిప్రాణములు బయలువెడలుచున్నవి. అప్పుడు యీ యాత్మ కర్మవశముచేత స్వప్నమునందువలె విశేషజ్ఞానము కలవాఁడగుచున్నాఁడు. అంతట విశేషజ్ఞానముతోఁగూడిన గంతవ్యస్థానము ననుసరించిపోవుచున్నాడు. అట్లు పరలోకముకొఱకు పోవుచున్న ఆత్మను అనుసరించి సర్వప్రకారములును గలదియును విహితమును ప్రతిషిద్ధమును అవిహితమును అప్రతిషిద్ధమును అయిన విద్యయును, విహితమును ప్రతిషిద్ధమును అవిహితమును అప్రతిషిద్ధమును అయినకర్మమును, లెస్సగా అనుసరించి పోవుచున్నవి. మఱియును పూర్వానుభూతవిషయమైన ప్రజ్ఞయును (అతీతకర్మఫలానుభవవాసనయును) అనుసరించిపోవుచున్నది. అనుశ్రుతి ప్రమాణానుసారముగ తెలియవలయును.

☞ ఆ లింగశరీరభంగము ఏలాగున అగునని అర్జునుఁడు ఈ క్రిందిశ్లోకముచేత అడుగుచున్నాఁడు.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ స్థావరంజంగమంచైవ యత్కించిత్సచరాచరం
జీవాజీవేనసిద్ధ్యంతి సజీవఃకేనసిద్ధ్యతి॥ ౫౧

టీ॥ స్థావరమ్ = స్థావరము, జంగమంచైవ = జంగమమును, యత్కించిత్ = ఇంకననితరమగు, సచరాచరమ్ = చరాచరములతోఁగూడిన ప్రపంచమునుగుఱించి, జీవాః=అభిమానవంతులైన విశ్వప్రాజ్ఞతైజసులనుజీవులు, జీవేన = లింగశరీరాభిమానము కలతేజస్సుచేత, సిద్ధ్యంతి=సిద్ధించుచున్నారు. సః=ఆ, జీవః=జీవుఁడు, కేన= ఏ హేతువుచేత, సిధ్యతి=సిద్ధించుచున్నాఁడు.

తా॥ స్థావరజంగమాత్మకమగు జగజ్జాలమునందు అభిమానముగల విశ్వాదిజీవులు లింగశరీరాభిమానముగల తేజస్సుచేత సిద్ధించుచున్నారు. అనఁగా విశ్వాద్యభిమానమును త్యజింతురనుదురుగదా! అట్లగుటచేత అజీవుఁ డేవిధముగ సిద్ధిని పొందును. ఆ లింగశరీరమునకు భంగమెటులఁ గలుగునని అర్జునుఁడు అడిగెనని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.

భగవంతుఁడగుకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ముఖనాసికయోర్మధ్యే ప్రాణస్సంచరతేసదా
ఆకాశఃపిబతేప్రాణం సజీవఃకేనజీవతి॥ ౫౨

టీ॥ ముఖనాసికయోః=ముఖముయొక్కయు నాసికయొక్కయును, మధ్యే=మధ్యమందు, ప్రాణః=ప్రాణవాయువు, సదా = సర్వకాలములయందును, సంచరతే=సంచరించుచున్నది, ఆకాశః=ఆకాశము, ప్రాణమ్ = ప్రాణమును, పిబతే=త్రాగుచున్నది, సః=ఆ, జీవః=జీవుఁడు, కేన=దేనిచేత, జీవతి=జీవించుచున్నాఁడు.

తా॥ ముఖనాసికములయొక్క మధ్యమందు ఎల్లప్పుడును ప్రాణవాయువు అదృష్టమువలనను అజపామంత్రాత్మకత్వముచేత ఒకదినమునకు ఇరువదియొక్క వేలును ఆరునూరుసంఖ్యగల యుచ్ఛ్వాసనిశ్వాసములచేత సంచరించుచుండును. మఱియును ఎప్పుడైనను యోగమహిమచేత బ్రహ్మసాక్షాత్కారానంతరమందు జీవునకు అదృష్టనివృత్తియగునో ఎప్పుడు ఆకాశము జీవునినిమిత్తముకొఱకు ప్రాణవాయువును గ్రసించునో అప్పుడు ఆజీవుఁడు దేనిచేత జీవించునని తాత్పర్యము.

[illegible] బ్రహ్మాండాద్యుపాధి విశిష్టమైన యాపరబ్రహ్మమునకు నిరంజనత్వ మేలాగునఁగలుగునని అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మాండవ్యాపితంవ్యోమ వ్యోమ్నాచావేష్టితంజగత్
అంతర్బహిశ్చతద్వ్యోమ కథందేవోనిరంజనః॥ ౫౩

టీ॥ వ్యోమ = ఆకాశము, బ్రహ్మాండవ్యాపితమ్ = బ్రహ్మాండావచ్ఛిన్నమైయున్నది, వ్యోమ్నాచ=ఆకాశముచేత, జగత్=ప్రపంచము, ఆవేష్టితమ్=అంతటను వ్యాప్తమైనది, తద్వ్యోమ=ఆయాకాశము, అంతర్బహిశ్చ = లోపలను వెలుపలను, వర్తతే=ఉన్నది, దేవః=దేవుఁడు, కథమ్=ఎట్లు, నిరంజనః=నిరంజనుఁడు, స్యాత్=అగును.

తా॥ ఆకాశము బ్రహ్మాండావచ్ఛిన్నమైయున్నది. అట్టియాకాశముచేత లోకమంతయును వ్యాపింపజేయఁబడియున్నది మఱియును, ఆయాకాశములోపలను వెలుపలను నిండియున్నది. ఇట్లుండగా ఈశ్వరుఁడు నిరంజనుఁడెట్లయ్యెను. అనఁగా, అన్యప్రకాశనిరపేక్షితుఁడుగావున యెట్లునిరంజనుఁడాయెనని తాత్పర్యము.

☞ ఈప్రకారము అర్జునుఁడు అడుగఁగా సంపత్కరుఁడైన భగవంతుఁడు ఆకాశాదిసర్వప్రపంచమును కల్పితము కాఁబట్టి సర్వమును అసత్యమనియెడు నభిప్రాయముచేత ప్రత్యుత్తరమును జెప్పుచున్నాఁడు.

శ్రీభగవానువాచ.

భగవంతుఁడు అగుకృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆకాశోహ్యవకాశశ్చ ఆకాశవ్యాపితంచయత్
ఆకాశస్యగుణశ్శబ్దో నిశ్శబ్దోబ్రహ్మఉచ్యతే॥ ౫౪

టీ॥ ఆకాశః=ఆకాశము, అవకాశశ్చహి=పరిచ్ఛిన్నాకాశము (అనురెండును) యత్=ఏహేతువువలన, ఆకాశవ్యాపితమ్=ఆకాశతన్మాత్రభూతమైనశబ్దముచేత వ్యాప్తమైయున్నది. శబ్దః=శబ్దము, ఆకాశస్య = ఆకాశముయొక్క, గుణః= గుణము; బ్రహ్మ = బ్రహ్మము, నిశ్శబ్దః = శబ్దరహితమైనది. ఇతి=ఇట్లని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

తా॥ మహాకాశము పరిచ్ఛిన్నాకాశము అనునట్టియీరెండును ఆకాశముచేతను, ఆకాశతన్మాత్రభూతమైన శబ్దముచేతను వ్యాప్తమైయుండును. కాఁబట్టి తదుపపాదకత్వముచేత తద్వ్యతిరిక్తముకాదు. మఱియును, "ఆకాశస్యగుణశ్శబ్దః" అనుప్రమాణానుసారముగ శబ్దము మిథ్యాభూతాకాశమునకు గుణమును పరిణామ్యుపాదానమును కనుక సర్వమును మిథ్యాభూతమేయగును. మఱియును బ్రహ్మము నిశ్శబ్దము నిష్ప్రపంచమును సత్యమును అక్షరమును కావున నట్టిబ్రహ్మకు అసత్యప్రపంచముతో సంబంధములేదు కనుక నిరంజనత్వము ప్రతిపాదింపఁబడినది. అని తాత్పర్యము.

☞ ఈవిధముగా భగవంతుఁడగుకృష్ణుఁడు చెప్పినవాక్యమును విని అక్షరశబ్దమునకు భగవదభిప్రేతమగునర్థమునుదెలియక లోకప్రసిద్ధమైన వర్ణాత్మకాక్షరములని తలఁచి వర్ణములకు అక్షరత్వము సంభవింపదు అను యభిప్రాయము కలవాఁడై అర్జునుఁడు యీక్రింది శ్లోకముచేత అడుగుచున్నాఁడని తెలియునది.

అర్జునఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ దంతోష్ఠతాలుజిహ్వానా మాస్పదంతత్రదృశ్యతే
అక్షరత్వంకుతస్తేషాం క్షరత్వంవర్తతేసదా॥ ౫౫

టీ॥ తత్ర=అయకారాది పంచాశద్వర్ణాత్మకాక్షరములయందు, దంతోష్ఠతాలుజిహ్వానామ్=దంతములయొక్కయును పెదవులయొక్కయును దవుడలయొక్కయును జిహ్వయొక్కయును, ఆస్పదమ్=ఆధారము, దృశ్యతే=కనఁబడుచున్నది. తేషామ్=ఆవర్ణములకు, అక్షరత్వమ్=నాశరాహిత్యము, సదా=ఎల్లప్పుడును, కుతః=ఎట్లు? క్షరత్వమ్=నాశము, వర్తతే=కలుగుచున్నది.

తా॥ ఓకృష్ణుఁడా! అయకారాది పంచాశద్వర్ణాత్మకాక్షరములయందు దంతములయొక్కయును ఓష్ఠములయొక్కయును దవుడలయొక్కయును, జిహ్వయొక్కయును, ఆధారము. "అకుహవిసర్జనీయానాంకంఠః ఇచుయశానాంతాలు, ఋటురషాణాంమూర్ధా, ౡతులసానాందంతాః, ఉపూపధ్మానీయానామోష్ఠౌ, ఏదైతోఃకంఠతాలు, ఓదౌతోఃకంఠోష్ఠమ్, వకారస్యదంతోష్ఠమ్" అనుప్రమాణమునను సరించి కనఁబడుచున్నది. కావున ఆవర్ణములకు నాశరాహిత్యము ఎట్లుకలుగును? నాశమేకనఁబడుచున్నదని తాత్పర్యము.

☞ ఈవిధముగా అధికసంశయముకలిగి యడుగుచున్న యర్జునునికి బోధించుటకై అక్షరశబ్దార్థమును జక్కఁగాదెలుపుచున్నాఁడు.

శ్రీభగవానువాచ.

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అఘోషమవ్యంజనమస్వరంచా ప్యతాలుదంతోష్ఠమనాసికంచ
అరేఫజాతంపరమూష్మవర్జితం తదక్షరంనక్షరతేకథంచిత్ ॥ ౫౬

టీ॥ అఘోషమ్=ఘోషసంజ్ఞకలవర్ణములలో నొకటికానిదియును, అవ్యంజనమ్=కకారాదివ్యంజనములు కానిదియును, అస్వరమ్=అకారాది షోడశ స్వరములుకానిదియును, అతాలుదంతోష్ఠమ్=తాలువులు దంతములు ఓష్ఠములు అనునవియాస్పదములు కానిదియును, అనాసికంచ=నాసికయందుఁబుట్టనిదియును, అరేఫజాతమ్=రేఫవర్ణములలోఁ బుట్టనిదియును, ఊష్మవర్జితమ్=శ ష స హ లలో నొకటియునుగానిదియును, పరమ్=సర్వోత్తమమైనదియును, అక్షరమ్=నాశము లేనిదియును, తత్=సర్వలోకప్రసిద్ధమును, (అయిన) పరమాత్మ=పరబ్రహ్మము, కథంచిత్=ఏవిధముగను, నక్షరతే=నశింపదు.

తా॥ నాశములేనిపరబ్రహ్మము అనఁగా అక్షరపరబ్రహ్మము ఘోషసంజ్ఞకలదికాదనియును, కకారాదులలో నొకటియునుకాదనియును, అకారాదిషోడశ స్వరములలో నొకటియునుకాదనియును, తాలుదంతోష్ఠనాసికములు ఆధారము

గాఁగలవర్ణములలో నొకటియును కాదనియును, రేఫవలనఁబుట్టలేదనియును, ఊష్మములగు శ ష స హ లలోనొకటియును కాదనియును మఱియేమనిన సర్వోత్తమమైనదనియును, సర్వలోకప్రసిద్ధమైనదనియును, ఏవిధముచేతనునశించునది కాదనియును, తెలియవలెనని తాత్పర్యము.

☞ ఇప్పుడు భగవంతుఁడగు కృష్ణునిచేతఁ జెప్పఁబడినబ్రహ్మజ్ఞానమును అనుభవజ్ఞానదార్ఢ్యముకొఱకు అర్జునుఁడు మరలనడుగుచున్నాఁడని తెలియునది.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ జ్ఞాత్వాసర్వగతంబ్రహ్మ సర్వభూతనివాసితం
ఇంద్రియాణాంనిరోధేన కథంసిద్ధ్యంతియోగినః॥ ౫౭

టీ॥ యోగినః = యోగులు, బ్రహ్మ = బ్రహ్మమును, సర్వభూతనివాసితమ్= సర్వభూతములయందు అంతర్యామిరూపముతోనున్నదానినిగాను, సర్వగతమ్=సర్వమునువ్యాపించినదానినిగాను, జ్ఞాత్వా=తెలిసి, ఇంద్రియాణామ్=ఇంద్రియములయొక్క, నిరోధేన=నిరోధముచేత, కథమ్=ఎట్లు, సిద్ధ్యంతి = జ్ఞానానుభవసిద్ధికలవారగుచున్నారు.

తా॥ ఓ కృష్ణుఁడా ! యోగులు బ్రహ్మమును సర్వభూతములయందును నివసించియున్నదానినిగాను, సర్వమును, పొందినదానినిగాను తెలిసికొని యెట్లు సిద్ధిని బొందుచున్నారు అనితాత్పర్యము.

శ్రీభగవానువాచ.

సంపత్కరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అయిన శ్రీకృష్ణుఁడు ఏయుపాయముచేత యోగులు ముక్తులగుదురని యర్జునుఁడడిగిన ప్రశ్నమునకు సమాధానమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇంద్రియాణాంనిరోధేన దేహేపశ్యంతిమానవాః
దేహేనష్టేకుతోబుద్ధి ర్బుద్ధినాశేకుతోజ్ఞతా॥ ౫౮

టీ॥ మానవాః=మనుష్యులు, ఇంద్రియాణామ్= ఇంద్రియములయొక్క, నిరోధేన=నిగ్రహముచేత, దేహే = దేహమునందు, (దేవమ్=దేవుని) పశ్యంతి = చూచుచున్నారు, దేహే=దేహము, నష్టేసతి=నష్టమైనదగుచునుండఁగా, బుద్ధిః = బుద్ధి, కుతః=ఎట్లు ; బుద్ధినాశేసతి=బుద్ధినశించినదగుచునుండఁగా, జ్ఞాతా=జ్ఞానానుభవము, కుతః=ఎట్లు ?

తా॥ మానవులు అనఁగా యోగులు ఇంద్రియములయొక్క నిరోధముచేత దేహమందు ఈశ్వరుని చూచుచున్నారు. అనఁగా ఇంద్రియనిరోధదార్ఢ్యముచేత సాక్షాదపరోక్షజ్ఞానము లేకపోయినను ఆయింద్రియనిరోధము అపరోక్షజ్ఞానమునకు సాధనమగునని యెఱుఁగవలయును. మఱియును, దేహమునష్టమైనపుడు దృఢములేదు కనుక బుద్ధియును నష్టమగుననియును, దానివలన తత్త్వజ్ఞానము సిద్ధింపదు కనుక జ్ఞాతయగువానికి అపరోక్షజ్ఞానమెక్కడిదనఁగా ఇంద్రియనిగ్రహముచేత శ్రవణమనన నిధిధ్యాసములు కలుగును. కనుక దానికి కారణమగును. కాఁబట్టి అజ్ఞానము ఎంతవఱకు అనుష్ఠేయమని యడిగితివి కనుక దానికి అవధిని యీక్రింది శ్లోకముచేత చెప్పుచున్నాఁడు.

శ్లో॥ తావదేవనిరోధస్స్యా ద్యావత్తత్త్వంనవిందతి
విదితేతుపరేతత్త్వే ఏకమేవానుపశ్యతి॥ ౫౯

టీ॥ యావత్ = ఎంతపర్యంతము, తత్త్వమ్=అపరోక్షజ్ఞానమును, నవిందతి=ఎఱుఁగఁడో, తావదేవ=అంతవఱకే, నిరోధః=సమాధిస్థుఁడై యింద్రియనిరోధము కలవాఁడు, స్యాత్=అగును, పరే=సర్వోత్తమమైన, తత్త్వే=తత్త్వము, విదితేసతి=తెలియఁబడినదగుచునుండఁగా, ఏకమేవ=ఒక్కబ్రహ్మమునే, అనుపశ్యతి=చూచుచున్నాఁడు.

తా॥ ఎంతదనుక ఆత్మతత్త్వజ్ఞానమును తెలిసికొనఁడో అంతవఱకును సమాధిస్థుఁడై యింద్రియనిరోధముకలవాఁడు కావలయును. మఱియును, అఖండానందైకబ్రహ్మము తెలియఁబడినదగుచునుండఁగా ఒక్కటియును దేహేంద్రియాదిసాధనరహితమును అయినబ్రహ్మము నొక్కదానినే చూచుచున్నాఁడు. అనఁగా, ఆత్మవ్యతిరిక్తము నేమియును లేదనియును, బ్రహ్మాపరోక్షజ్ఞానము కలిగినపిమ్మట సాధనానుష్ఠానముతోఁ బనిలేదనియును, తెలియవలసినదని తాత్పర్యము మఱియును ఎంతదనుక అపరోక్షజ్ఞానముకలుగదో అంతవఱకును గురుశాస్త్రయుక్తులచేత ఇంద్రియనిగ్రహముకలవాడై సమాధిసాధనములను జేయవలసినదనియును, అట్లుచేయనివానికి అపరోక్షబ్రహ్మజ్ఞానము సిద్ధింపదనియును ఈక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ నవచ్ఛిద్రగతాదేహా స్స్రవంతిగళికాఇవ
నైవంబహ్మావిశుద్ధంస్యా త్పుమాన్బ్రహ్మనవిందతి॥ ౬౦

టీ॥ దేహాః=దేహములు,నవచ్ఛిద్రగతాః=నవరంధ్రములనుపొందినవి, తస్మాత్=అందువలన, గళికాఇవ=చిల్లులుపడినకుండలవలె, స్రవంతి=జ్ఞానమునుస్రవింపఁ

జేయుచున్నవి, ఏవంస్థితే=ఈలాగున, అగుచుండఁగా, బ్రహ్మ=బ్రహ్మమును, విశుద్ధమ్=పరిశుద్ధమైనదానినిగా, (నానుపశ్యతి = చూచుచుండలేదు.) తస్మాత్=అందువలన, బ్రహ్మ=బ్రహ్మమును, పుమాన్=పురుషుఁడు, నవిందతి=తెలిసికొనఁడు.

తా॥ నవరంధ్రములతోఁ గూడిన దేహములు చిల్లులుపడినకుండలవలె జ్ఞానమును స్రవింపఁజేయుచున్నవి కావున బ్రహ్మము పరిశుద్ధమైనదిగాఁ గనఁబడదు. మఱియును పురుషుఁడు బ్రహ్మమును దెలిసికొనుటలేదు. మఱియును అజ్ఞానకార్యము శరీరమనియును శరీరము నవచ్ఛిద్రములుగలదనియును అట్టిశరీరమునుండి విషయేచ్ఛలు బయలువెడలుచుండుననియును, అట్టిశరీరమునందు జ్ఞానము నిలిచియుండదనియును వృత్తులు విషయఘటితములనియును తెలియవలయును నవచ్ఛిద్రములుగల దేహమునందు జ్ఞానము నిలిచియుండదుకనుక విషయయుక్తమైన చిత్తమునకు బ్రహ్మము శుద్ధముగాఁ దెలియదు. తెలియశక్యముగాని యీశ్వరతత్త్వబింబత్వాదిఘటనలు కలుగనేరవు. ఆలాగున బ్రహ్మమందు బింబత్వాదిఘటనలుకలిగిన సుఖదుఃఖాభిమానులైనజీవులు బ్రహ్మమును దెలియఁజాలరు. అనఁగా ఆనందానుభవమును పొందరనుట.

☞ తత్త్వాపరోక్షపర్యంతమును గురూక్తప్రకారము సమాధిసాధనము కర్తవ్యము. శ్రవణమనననిధిధ్యాసములచేత బ్రహ్మాపరోక్షము కలుగుచుండఁగా నపుడు విధినిషేధాతీతమగుటచేత కర్మానుష్ఠానముతోఁ బనిలేదనియెడు నభిప్రాయముతో శ్రీకృష్ణుఁడు ఈక్రిందిశ్లోకమును జెప్పుచున్నాఁడు అని యెఱుఁగవలయును.

శ్లో॥ అత్యంతమలినో దేహో దేహీచాత్యంతనిర్మలః
ఉభయోరంతరంజ్ఞాత్వా కస్యశౌచంవిధీయతే॥ ౬౧

టీ॥ దేహః=దేహము, అత్యంతమలినః=మిగులమలినమైనది, దేహీచ=జీవుఁడు, అత్యంతనిర్మలః=అధికముగామలినరహితుఁడు, ఉభయోః = ఆరెంటియొక్కయును, అంతరమ్=తారతమ్యమును, జ్ఞాత్వా=తెలిసి, కస్య = దేనికి, శౌచమ్=పరిశుద్ధత, విధీయతే=విధింపఁబడుచున్నది.

తా॥ దేహము మిగులమలినమైనది అనఁగా దేహము పాంచభౌతికమైనది కనుక జడత్వముకలది. జీవుఁడు అత్యంతమును నిర్మలుఁడు, అనఁగా అహంకారోపపాదకమైన సంసారరహితుఁడు. దేహజీవులయొక్క తారతమ్యమును దెలిసికొని అనఁగా దేహజీవులనిలుకడ కల్పితమని నిజమును దెలిసినపిమ్మట ఆరెంటిలో దేనికి శుచిత్వము విధింపఁబడుచున్నది? అనఁగా శుచిత్వము దేహమునకా లేక ఆత్మకా? అని వికల్పించి దేహము మలభాండమగుటచేత జలములు శుద్ధిపఱుపఁజాలవనియును, జీవాత్మ యెల్లప్పుడును పరిశుద్ధుఁడగుటచేత శౌచాదికర్మలు అనావశ్యకములనియును తెలియవలసినదని తాత్పర్యము.

శ్లో॥ పరావృక్షేషుసంజాతా పశ్యంతీభూజలేషుచ
మధ్యమాపశువక్త్రేషు మనుష్యేషుచవైఖరీ॥ ౬౨

టీ॥ వృక్షేషు=వృక్షములయందు, పరా = పరాయనుపేరుగలవాక్కు, సంజాతా=పుట్టినది, (అభూత్=ఆయెను.) భూజలేషుచ=భూమియందును జలములయందును, పశ్యంతీ=పశ్యంతియను పేరుకలది, (అభూత్=ఆయెను.) పశువక్త్రేషు=పశువులవక్త్రములయందును, మధ్యమా = మధ్యమమను పేరుకలది, (అభూత్=ఆయెను.) మనుష్యేషుచ=మనుష్యులయందు, వైఖరీ=శబ్దరూపమైనవాక్కు, (అభూత్=ఆయెను.)

తా॥ వృక్షములయందు పరయనువాక్కు ఉండుననియును, భూమియందును జలములయందును పశ్యంతియనువాక్కు కలిగియున్నదనియును, పశువులవక్త్రములయందు మధ్యమయనువాక్కు కలిగియుండుననియును, మనుష్యులయందు శబ్దరూపమగు వైఖరీవాక్కు కలిగియుండుననియును తెలియవలసినదని తాత్పర్యము.

గద్య॥ ఇతి శ్రీమన్మహాభారతే శాతసాహస్రసంహితాయాం వైయాసిక్యాం శ్రీమదశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే బ్రహ్మప్రతిపాదక యోగోనామ ప్రథమోధ్యాయః.

టీ॥ శాతసాహస్రసంహితాయామ్ = నూరువేలశ్లోకములచేత కూర్పఁబడినదియును, వైయాసిక్యామ్=వ్యాసప్రోక్తమును (అయిన), శ్రీమన్మహాభారతే=సంపత్కరమైనమహాభారతమను గ్రంథమునందు, శ్రీమదశ్వమేధపర్వణి = సంపత్కరమైనయశ్వమేధపర్వమునందలి, శ్రీభగవదుత్తరగీతానూపనిషత్సు = శ్రీభగవంతునిచేతఁజెప్పఁబడినయుత్తరగీత లనువేదాంతములయందు, బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానబోధకమైన, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, శ్రీకృష్ణార్జునసంవాదే = సంపత్కరుఁడైనకృష్ణార్జునులసంవాదమందు, బ్రహ్మప్రతిపాదకయోగోనామ=బ్రహ్మమును ప్రతిపాదించునట్టి యోగమనియెడు, ప్రథమః = మొదటిదైన, అధ్యాయః =అధ్యాయము, ఇతి=ముగిసెను.

తా॥ నూరువేలశ్లోకములుగలదియును, వేదవ్యాసమునివరునిచేతరచింపఁబడినదియును అయిన శ్రీమహాభారతమునందలి యశ్వమేధపర్వమునందు శ్రీకృష్ణునిచేతఁజెప్పఁబడిన వేదాంతములయందు బ్రహ్మప్రతిపాదకయోగమనియెడు మొదటియధ్యాయము ముగిసెను.

——:0:——

# ఓం

శ్రీకృష్ణాయ పరబ్రహ్మణేనమః.

## శ్రీభగవదుత్తరగీత—యోగశాస్త్రము.

### ద్వితీయోఽధ్యాయః.

### అర్జునఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ ఆరూఢస్యముముక్షోశ్చ స్వరూపంపరికీర్త్యతే
తత్రారూఢస్యబిందైక్యం కథంస్యాదితిపృచ్ఛతి॥ ౧

టీ॥ ఆరూఢస్య = ఆరూఢునియొక్క-యును, ముముక్షోశ్చ = మోక్షమునందిచ్ఛగలవానియొక్క-యును, స్వరూపమ్=స్వరూపము, (అనఁగాలక్షణము) పరికీర్త్యతే=చెప్పఁబడుచున్నదిగదా. తత్ర = ఆయిరువురిలో, ఆరూఢస్య = ఆరూఢునకు, బిందైక్యమ్=బిందువుతోనేకత్వము, కథమ్ = ఎట్లు, స్యాత్=అగును. ఇతి=ఇట్లని, పృచ్ఛతి=అడుగుచున్నాఁడు.

తా॥ ఓకృష్ణుఁడా! ఆరూఢునియొక్క-యును, మోక్షమునందిచ్ఛ కలవానియొక్క-యును లక్షణము చెప్పఁబడుచున్నదికదా! ఆ యిరువురిలోపల ఆరూఢునకు బిందువుతో నైక్యమెట్లుకలుగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ జ్ఞాత్వాసర్వగతంబ్రహ్మ సర్వజ్ఞంపరమేశ్వరమ్
అహంబ్రహ్మేతినిర్దేష్టుం ప్రమాణంతత్రకింభవేత్॥

టీ॥ (జీవః=జీవుఁడు) బ్రహ్మ=బ్రహ్మముగాను, సర్వగతమ్=సర్వమునుపొందినవానినిగాను, సర్వజ్ఞమ్=సర్వమును దెలిసినవానినిగాను, పరమేశ్వరమ్ = సర్వోత్తముఁడును సర్వనియామకుఁడును అయినవానినిగాను, జ్ఞాత్వా = తెలిసికొని, అహమ్=నేను, బ్రహ్మేతి = బ్రహ్మమని, నిర్దేష్టుమ్ = నిర్దేశించుటకు, తత్ర= ఆవిషయమునందు, ప్రమాణమ్ = ప్రమాణము, కిమ్=ఏది, భవేత్ = అగును.

తా॥ జీవుఁడు బ్రహ్మముగాను, సర్వమును పొందినవానినిగాను సర్వమును దెలిసినవానినిగాను పరమేశ్వరునిగాను తెలిసికొని నేనుబ్రహ్మమని నిర్దేశించుటకు ఆవిషయమునందు ప్రమాణమేది? అనఁగా నేనేబ్రహ్మమని నిర్దేశించుటకును ఆబ్రహ్మమునందైక్యముగుటకును ప్రమాణమేది యని మఱల అడిగెనని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.

సంపత్కరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అయిన శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యథాజలంజలేక్షిప్తం క్షీరేక్షీరంఘృతేఘృతం
అవిశేషోభవేత్తద్వ జ్జీవాత్మపరమాత్మనోః ॥ 3

టీ॥ జలే=ఉదకమునందు, క్షిప్తమ్=ఉంచఁబడిన, జలంయథా = జలమువలెను, క్షీరే =క్షీరమునందు, క్షిప్తమ్ = ఉంచఁబడిన, క్షీరంయథా = పాలవలెను, ఘృతే=ఘృతమునందు, క్షిప్తమ్ =ఉంచఁబడిన, ఘృతంయథా =నేతివలెను, తద్వత్ =అలాగుననే, జీవాత్మపరమాత్మనోః = జీవాత్మపరమాత్మలకు, అవిశేషః = సమానము, భవేత్ =అగును.

తా॥ జలమునందుంచఁబడిన జలము భేదపడనివిధముగను, క్షీరమునందుంచఁబడిన క్షీరమునకు భేదములేనివిధముగను, ఘృతమునందుంచఁబడిన ఘృతమునకు భేదములేనివిధముగను, జీవాత్మపరమాత్మలకుఁ గొంచెమైనను భేదములేదని యెఱుఁగవలయును. మఱియును అవిద్యచేత జీవాత్మపరమాత్మలకు భేదమున్నట్లు కనబడినను అవిద్యానివృత్తియైనపిమ్మట ఆ జీవాత్మపరమాత్మలకు ఏకత్వమేకాని భేదములేదని తాత్పర్యము. మఱియును ఈ విధముగా ఐక్యజ్ఞానము గురుముఖమువలననే లభించును గాని తక్కినస్వతంత్రయుక్తివిచారమువలనను శాస్త్రపాండిత్యమువలనను అవిద్యానివర్తియై బ్రహ్మాపరోక్షజ్ఞానము సంభవింపదు. కాఁబట్టి సద్గురువులనాశ్రయించి కృతార్థుఁడుకావలయునని యీక్రిందిశ్లోకముచేతఁ దెలియఁజేయుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ జీవేపరేణతాదాత్మ్యం సర్వగంజ్యోతిరీశ్వరం
ప్రమాణలక్షణంజ్ఞేయం స్వయమేకాగ్రవేదినా॥ 4

టీ॥ స్వయమ్=అధికారియైనతాను, ఏకాగ్రవేదినా = వృత్తిరహితుఁడైయేకాగ్రచిత్తుఁడై బ్రహ్మనిష్ఠుఁడైనగురువుచేత, ప్రమాణలక్షణమ్= ప్రమాణస్వరూపము, జ్ఞేయమ్=తెలియఁదగినది, జీవే=జీవునియందు, పరేణ=పరమాత్మతో, తాదాత్మ్యమ్=ఐక్యమును (గురౌ=గురువు, బోధయతిసతి = బోధించుచుండఁగా, స్వయమ్=తాను) సర్వగమ్=సర్వవ్యాపియును, జ్యోతిః=జ్యోతిస్స్వరూపుఁడును, ఈశ్వరమ్=సర్వలోకనియామకుఁడును (అయిన బ్రహ్మమును, సేవితుమ్= ఐక్యభావముతో సేవించుటకు, అర్హః=తగినవాఁడు, భవతి=అగుచున్నాఁడు.)

తా॥ తానువృత్తిశూన్యుఁడై, ఏకాగ్రచిత్తుండైన బ్రహ్మనిష్ఠకలగురువుచేతఁ బ్రమాణలక్షణములను దెలియవలయును. మఱియును ఉపదిష్టమైన ప్రమాణలక్షణాదులచేతను, తత్త్వమస్యాదిమహావాక్యములచేతను, జీవునియందు పరమాత్మతో తాదాత్మ్యమును గురువుబోధించుచుండఁగా ఆబోధను ఆలకించి యాప్రకారము గురూపదేశమందు నిలిచియుండువాఁడు తనకుఁదానే సర్వవ్యాపియై, పరంజ్యోతిస్స్వరూపమైన యీశ్వరునితో నైక్యమగుట కర్హుఁడగునని తాత్పర్యము.

అర్జున ఉవాచ.

ఇట్లు గురూపదేశానంతరమందు భావిజ్ఞానమునకు కర్మయోగమువలనఁ బ్రయోజనమేమని యర్జునుఁడడుగుచున్నాఁడు.

శ్లో॥ జ్ఞానేనైవభవేద్జ్ఞేయం విదిత్వాతత్క్షణేనతు
జ్ఞానమాత్రేణముచ్యేత కింపునర్యోగధారణాత్॥ ౫

టీ॥ జ్ఞానేనైవ = జ్ఞానముచేతనే, జ్ఞేయమ్ = తెలిసికొనఁ దగినవస్తువును, తత్క్షణేనతు=ఆక్షణముననే, విదిత్వా = తెలిసికొని, జ్ఞానమాత్రేణ = జ్ఞానముచేత, ముచ్యేతచేత్ =బంధములనుండి విడువఁబడెనేని, అనఁగా ముక్తుఁడయ్యెనేని, యోగధారణాత్ = యోగధారణమువలన, కింపునః=మరలఁ దెలియఁదగినదియేది, భవేత్=అగును.

తా॥ ఓకృష్ణుఁడా ! జ్ఞానముచేతనే తెలిసికొనఁదగిన వస్తువును అనఁగా బ్రహ్మమును అప్పుడే తెలిసికొని యాజ్ఞానముచేతనే ముక్తుఁడైనయెడల యోగధారణముచేత ప్రయోజనమేమి ! ఏమియును ప్రయోజనముకనఁబడలేదు. కాఁబట్టి యోగధారణ వ్యర్థమగునుగదా ! అనితాత్పర్యము.

☞ ఈ విధముగా అర్జునుఁడు కర్మయోగము వ్యర్థమగునని శంకింపఁగా నెంతదనుక అపరోక్షానుభవములేదో అంతవఱకును అంతఃకరణవృత్తి శూన్యమగుటకొఱకు దానికిసాధనమైన యోగధారణను అవశ్యముగఁ జేయవలసినదనియును, అపరోక్షజ్ఞానము లభించినపిమ్మట యోగమునియెడు కర్మానుష్ఠానముతోఁ బనిలేదనియును, సంపత్కరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అయిన శ్రీకృష్ణుఁడు ఈ క్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు అని యెఱుఁగవలయును.

శ్రీభగవానువాచ.

భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జ్ఞానేనదీపితేదేహే బుద్ధిర్బ్రహ్మసమన్వితం
బ్రహ్మజ్ఞానాగ్నినావిద్వా న్నిర్దహేత్కర్మబంధనమ్॥ ౬

టీ॥ విద్వాన్=ఆత్మజ్ఞానముకల పండితుఁడు, జ్ఞానేన = ఆత్మజ్ఞానముచేత, దేహే=దేహము, దీపితేసతి = ప్రకాశింపఁబడిన దగుచుండఁగా, బుద్ధిః=నిశ్చయాత్మకమైనబుద్ధి, బ్రహ్మసమన్వితంసత్=బ్రహ్మముతోగూడినదగుచునుండఁగను (అనఁగా అసంభావనాశూన్యఁడై) బ్రహ్మజ్ఞానాగ్నినా=బ్రహ్మజ్ఞానమనియెడు నిప్పుచేత, కర్మబంధమ్=కర్మమనియెడు పాశమును, నిర్దహేత్=దహించును.

తా॥ ఓ అర్జునుఁడా ! బ్రహ్మజ్ఞానముకలపండితుఁడు, ఆ బ్రహ్మజ్ఞానముచేత దేహముప్రకాశించు చుండఁగను నిశ్చయాత్మకమైనబుద్ధి బ్రహ్మమునుగూడినదగుచునుండఁగను అసంభావన విపరీతభావన అన్యథాభావన అనునవిలేని వాఁడగును. పిమ్మట బ్రహ్మజ్ఞానమనియెడు నిప్పుచేత కర్మబంధమును కాల్చివేయును.

☞ ఈ విషయమే "యథైధాంసిసమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా—భగవద్గీత—4 అధ్యాయము 37 శ్లోకము." అని యుద్ధకాలమునందుఁ జెప్పఁబడినగీతలలోని నాల్గవయధ్యాయమునందుఁ గూడఁ జెప్పఁబడియె. ఆ నాల్గవయధ్యాయమునందలి యాశ్లోకమును భగవంతుఁడే యభిప్రాయముతో నేనిమిత్తముగఁ జెప్పినదియును వివరించెదను. ఎట్లనిన:—ఓ కృష్ణుఁడా ! సముద్రమునుదాటినట్లు జ్ఞానియగువాఁడు పుణ్యాపాపములనుతరించునని చెప్పితివికదా ! పుణ్యాపాపములు దాటిన దాటనిమ్ము. పుణ్యాపాపములను అతిక్రమించినమాత్రముచేత పుణ్యాపాపములకు నాశమెట్లుకలుగునని అర్జునుఁడు అడిగెనేమోయని తలఁచి శ్రీకృష్ణుఁడు ఆశ్లోకముచేత సమాధానమును చెప్పెను. "శ్రు॥ భిద్యతేహృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే॥ —బ్ర ౪ అ ౧ పా ౧౩ సూ॥ తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేష వినాశౌతద్వ్యపదేశాత్, ౧౪ సూ॥ ఇతరస్యాప్యేవమసంశ్లేషఃపాతేతు, ౧౫ సూ॥ అనారబ్ధకార్యేఏవతు పూర్వేతదవధేః" — శ్రు॥ అసంసారియైన యాపరబ్రహ్మము చూడఁబడినవాఁడగుచునుండఁగా అవిద్యావాసనామయమైన హృదయగ్రంథి భేదింపఁబడుచున్నది. అజ్ఞానవిషయములయిన సర్వసంశయములును ఛేదింపబడుచున్నవి. ఈ బ్రహ్మవేత్తయొక్క ఆగామిసంచితములయిన పుణ్యాపాపకర్మములు అన్నియునునశించుచున్నవి—౧౩ సూ॥ శ్రుతియందుఁజెప్పఁబడియుండుటవలన బ్రహ్మప్రాప్తికలుగుచునుండఁగా ఆగామిసంచితములగుపాపములకు అశ్లేషవినాశములు అగుచున్నవి—౧౪ సూ॥ పాపమునకువలెనే పుణ్యమునకుఁగూడ అశ్లేషవినాశములు కలుగుచున్నవి. బంధహేతువులైన ధర్మాధర్మములకు విద్యాసామర్థ్యమువలన అశ్లేషవినాశములు కలుగుచున్నవి. కనుక

బ్రహ్మవేత్తకు శరీరపాతమునందు ముక్తికలుగుచున్నది—౧౫ సూ॥ ఆగామిసంచితములగు పుణ్యపాపములుమాత్రమే బ్రహ్మజ్ఞానమువలన నశించుచున్నవి. దేహావసానమువఱకును ఉండునని శ్రుతియందుఁ జెప్పఁబడియుండుటవలన బ్రహ్మజ్ఞానికిఁ గూడ ప్రారబ్ధకర్మముమాత్రము శరీరపాతమువఱకును ఉండును.—అనుశ్రుతి సూత్రప్రమాణముల ననుసరించి విచారింపఁగా చక్కఁగాఁ బ్రజ్వలింపఁజేయఁబడిన అగ్ని హోత్రుఁడు కట్టెలను భస్మముగాఁజేయునట్లు, జ్ఞానాగ్ని, ప్రారబ్ధకర్మములకంటె ఇతరములగు ఆగామిసంచిత పుణ్యపాపములను భస్మముగాఁ జేయునని తెలియవలయును.

☞ "శ్రు॥ దస్యతావదేవచిరంయావన్నవిమోక్ష్యే, అథసంపత్స్యే"—"బ్ర॥ ౪ అ ౧ పా ౧౯ సూ॥ భోగేనత్వితరేక్షపయిత్వాథసంపద్యతే" =బ్రహ్మాత్మజ్ఞానముకలవాఁడు ఎంతవఱకు ప్రారబ్ధకర్మముచేత విడువఁబడఁడో అనఁగా బ్రహ్మజ్ఞానియొక్క శరీర మెంతవఱకుండునో అంతవఱకును ప్రారబ్ధకర్మముండును, కనుక దేహపాతానంతరమందు బ్రహ్మము పొందఁబడగలదు. అనఁగా ముక్తుఁడగుచున్నాఁడనుట. సూ॥ ధర్మాధర్మరూపములగు ప్రారబ్ధకర్మములను అనుభవముచేత నశింపఁజేసి బ్రహ్మవేత్తయగువాఁడు బ్రహ్మమును పొందుచున్నాఁడు. అనునట్టి శ్రుతిసూత్రప్రమాణానుసారముగ జ్ఞానము కలుగఁజేయుటకును కారణమైన దేహమును కలుగఁజేసిన కర్మములకు అట్టిదేహము నశించినవెంటనే నాశముకలుగునని యెఱుఁగవలయును.

☞ బ్ర॥ 3 అ 3 పా 33 సూ॥ యావదధికారమవస్థితి రాధికారికాణామ్ = అధికారికపురుషులకు అధికారమున్నంతవఱకును ఉనికికలదు. అనుప్రమాణానుసారముగ అధికారపురుషులగు వసిష్ఠుఁడు అపాంతరతముఁడు మొదలుగాఁగలవారలకు జ్ఞానమును కలుగఁజేయునట్టి దేహమునకు కారణములయిన కర్మములేవి కలవో అవియే మఱియొకదేహమును కలుగఁజేయుచున్నవని తెలియవలయును. మఱియును, అధికారము అనేకజన్మములను కలుగఁజేయునట్టిదికూడ అయియుండును. ఉపాసకులగువారలకు బలవత్ప్రారబ్ధఫలముగలకర్మము అనేకజన్మములదనుకనుండుననియును, ఇతరులకు అనఁగా జ్ఞానులకు అట్లుండదనియును, ఇదివఱకు ఆరంభింపఁబడిన ఫలముగలకర్మములు (ప్రారబ్ధకర్మములు) అనుభవించుటవఱకును ఉండుననియును, అనుభవము ఒకజన్మముతోడనే నశించుటయును, అనేకజన్మములను కలుగఁజేసి నశించుటయును కలదనియును, తెలియవలయును.

☞ మఱియును, పైనజెప్పఁబడిన విధముగఁ తత్త్వజ్ఞానమునుపొందినవానికి ఇఁకమీఁదటజేయఁదగినకార్యము లేదని యీక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ తతఃపవిత్రంపరమేశ్వరాఖ్య మద్వైతరూపంవిమలాంబరాభం
యథోదకేతోయమనుప్రవిష్టం తథాత్మరూపంనిరుపాధిసంస్థమ్॥

టీ॥ తతః=తత్త్వజ్ఞానముకలిగినపిమ్మట, ఉదకే_అపరిచ్ఛిన్నమైనయుదకమునందు, అనుప్రవిష్టమ్=ప్రవేశింపఁబడిన, తోయంయథా=ఉదకము ఏవిధముగానో, తథా=ఆవిధముగా, పవిత్రమ్= పావనమైనదియును, పరమేశ్వరాఖ్యమ్ = పరమేశ్వరుఁడను పేరుకలదియును, అద్వైతరూపమ్=సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమును, విమలాంబరాభమ్=నిర్మలమైనయాకాశముయొక్క కాంతివంటికాంతిగలదియును, నిరుపాధిసంస్థమ్ = ఉపాధిరహితమైయున్నదియును అగు, ఆత్మరూపమ్ = ఆత్మస్వరూపమును, భావయేత్=భావనచేయవలయును.

తా॥ అటుపిమ్మట మహోదకమందుప్రవేశపెట్టఁబడినయుదకమువలె జీవాత్మకూడ భేదరహితమైనదగుచున్నదని యెఱుఁగవలయును; మఱియును, ఆత్మస్వరూపమును, పరిశుద్ధమైనదియును, పరమేశ్వరసంజ్ఞకలదియును, నిర్మలమైనయాకాశమువలెదేనియొక్కయును సంబంధములేనిదియును, సజాతీయ విజాతీయస్వగతభేదశూన్యమును, ఉపాధిరహితమైనదియును, అయిన దానినిగాభావనచేయవలయును మఱియును నిర్మలాకాశమువలె పరిశుద్ధమైన యద్వయబ్రహ్మతత్త్వజ్ఞానము కలిగినపిమ్మట జలముతోజలముచేరునటుల, ఉపాధిరహితుఁడైన పరమాత్మను బొందుచున్నాఁడు. అనఁగానాజీవుఁడు సత్సంస్కారవిశేషములచేతఁ ఔపాధికకృత్యత్వాదిభేదరహితుఁడైపరమాత్మస్వరూపుఁడగుచున్నాఁడని తాత్పర్యము.

☞ ఈవిధముగా ఇప్పుడుచెప్పఁబడినయుదాహరణమువలన తత్త్వజ్ఞానము కలుగుననిచెప్పి యోగధారణములేనివానికి జీవబ్రహ్మైక్యముకలుగుట దుర్లభమని యీక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ఆకాశవత్సూక్ష్మశరీరఆత్మా నదృశ్యతేవాయువదంతరాత్మా
సబాహ్యాకాభ్యంతరనిర్మలాత్మా జ్ఞానోల్కయాపశ్యతిచాంతరాత్మా॥

టీ॥ ఆత్మా = పరమాత్మ, ఆకాశవత్ = ఆకాశమువలె, సూక్ష్మశరీరః = సూక్ష్మమైనశరీరముకలవాఁడు కనుక నే, నదృశ్యతే=చూడఁబడుచుండలేదు, అంతరాత్మా = అంతర్యామియగుపరమాత్మ, వాయువత్ = వాయువువలె, నదృశ్యతే = చూడఁబడుచుండఁలేదు, సబాహ్యాకాభ్యంతరనిర్మలాత్మా=బాహ్యాభ్యంతరములయందు నిర్మలమైనమనస్సుకలవాఁడును, అంతరాత్మాచ = అంతర్ముఖమైన చిత్తముకలవాఁడును, అయినజీవుఁడు, జ్ఞానోల్కయా=ఆత్మజ్ఞానమనియెడుదీపముచేత, (ఐక్యమ్ =ఏకత్వమును) పశ్యతి=చూచుచున్నాఁడు.

తా॥ ఓ అర్జునుఁడా! ఆత్మ ఆకాశమువలె సూక్ష్మమైన శరీరముకలవాఁడు కనుకనే అనఁగా ఆత్మ అతీంద్రియము కనుక కనఁబడఁడు. మఱియును, ఆత్మ వాయువువలెను కనఁబడఁడు. అయినప్పటికిని బాహ్యాభ్యంతరములయందు నిర్మలమైన మనస్సుకలవాఁడును, అంతర్ముఖమైన చిత్తముకలవాఁడును, అయినజీవుఁడు, జ్ఞానమనియెడుదీపముచేత జీవబ్రహ్మైక్యమునుచూచుచున్నాఁడని తాత్పర్యము. అనఁగానిర్వికల్ప సమాధిఁగలవాఁడై స్వస్వరూపానుభవము కలవాఁడగుచున్నాఁడని తెలియునది.

అవ॥ మఱియును, అర్చిరాదిమార్గముచేత లోకాంతరప్రాప్తియనియును, దానిచేతనేముక్తియనియును, చెప్పనట్టిమతమును నిరాకరించుటకొఱకు “శ్రు॥ ఆత్మా బ్రహ్మసమశ్నుతే” అనునట్టి శ్రుతిప్రమాణానుసారముగ పూర్వము చెప్పఁబడిన జ్ఞానులకుఁ గలుగు ముక్తిస్వరూపమును ఈక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడు అని తెలియవలెను

శ్లో॥ యత్రయత్రమృతోజ్ఞానీ ఏకదానేకమృత్యునా
యథాసర్వగతంవ్యోమ తత్రతత్రలయంగతః॥ ౯

టీ॥ సర్వగతమ్ = సర్వమునుపొందియున్న, వ్యోమయథా = ఆకాశమువలె యత్రయత్ర = ఎక్కడెక్కడ, ఏకదా = ఏకకాలమందు, అనేక మృత్యునా = అపమృత్యువులచేత, మృతః = మరణమును పొందినట్టి, జ్ఞానీ = బ్రహ్మజ్ఞాని, తత్రతత్ర = అక్కడక్కడ—అనఁగా బ్రహ్మమునందే, లయమ్ = లయమును, గతః = పొందినవాఁడు. భవేత్ = అగును.

తా॥ సర్వవస్తువులయందును అవిచ్ఛిన్నమైన యాకాశమువలె ఎక్కడెక్కడ తగినకాలమునందు కాలమృత్యువుచేతఁగాని ఆకాలమందు అపమృత్యువు చేతఁగాని మరణమును బొందునట్టి జ్ఞాని బ్రహ్మమునందు లయమును పొందుచున్నాఁడని యెఱుఁగవలయును. మఱియును, జ్ఞానులకు దేశకాలాద్యపేక్షమరణము అక్కఱలేదనియును, సర్పవ్యాఘ్రాది దుష్టజంతువులవలనను మూర్ఖాదిదుర్జనులవలనను సంప్రాప్తమైన యపమృత్యునిమిత్తకమైన ప్రాయశ్చిత్తము జ్ఞానాధికులకుఁ బనిలేదనియును ఎఱుఁగవలయును. మఱియును, కనఁబడుచున్న ఘటమఠంబులకు నాశము సంభవించునప్పుడు అందుండునట్టి యాకాశములు మహాకాశముతోఁ గలియువిధముగ జ్ఞానులు శరీరోపాధులతోఁ గూడి యెచ్చోట నెవ్విధంబున మృతిఁబొందినను పరిపూర్ణబ్రహ్మముతోఁ గలియుచున్నారని యెఱుఁగవలయును.

☞ మఱియును, జీవుఁడొక్కఁడేయయ్యును అనేకదేహములతో సంబంధముకలవాఁడై యుండుటవలన అనేకులవలెఁ గనఁబడుచున్నాఁడేకాని వాస్తవముగ నానాత్వములేదనియును, పరోక్షత్వము అణుమాత్రమైనను సంభవింపదని నిశ్చయించి జీవునకు వ్యాపకత్వమును ఈక్రిందిశ్లోకముచేత సాధించుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ శరీరవ్యాపకంవ్యోమ భువనానిచతుర్దశ
నిశ్చలోనిర్మలోదేహీ సర్వవ్యాపీనిరంజనః॥ ౧౦

టీ॥ వ్యోమ=ఆకాశము, (యథా=ఏవిధముగా) శరీరవ్యాపకమ్ = శరీరమునందు వ్యాపించినదియును, చతుర్దశ = పదునాలుగైన, భువనాని = లోకములను, (వ్యాపకమ్=వ్యాపించినదియును, భవతి = అగుచున్నదో, తథా = ఆవిధముగా) దేహీ=జీవుఁడు, నిశ్చలః = చలనరహితుఁడును, నిర్మలః = మలినరహితుఁడును, (అనఁగా పూర్వమునందుఁజెప్పఁబడిన యైదువిధములగుమలములు లేనివాఁడును,) సర్వవ్యాపీ=సర్వమునందును, వ్యాపించినవాఁడును, నిరంజనః = జడసంబధశూన్యుఁడును, (భవతి=అగుచున్నాఁడు.)

తా॥ ఆకాశము శరీరమందును పదునాలుగులోకములయందును వ్యాపించియుండువిధముగ జీవుఁడుకూడ చలనరహితుఁడును మలినరహితుఁడును, సర్వమునందును వ్యాపించియున్నవాఁడును, జడసంబంధశూన్యుఁడును, అయియున్నాఁడని, అనఁగా జగత్తు అవిద్యాపరిణామము కనుక ఆజగత్తున కుపాదానమైన యవిద్యయందు ప్రతిఫలించినవాఁడు విద్యాభాసకజీవుఁడే గనుక ఆజీవునకు వ్యాపకత్వమే కాని అణుత్వములేదని తాత్పర్యము.

☞ మఱియును, ఈవిధముగా బ్రహ్మజ్ఞానులయొక్క ముక్తిస్వరూపమును దెల్పి తత్త్వజ్ఞానసాధనానుష్ఠానముగలవానికి ఆయనుష్ఠానమే సర్వపాపనివర్తికమని యీక్రిందిశ్లోకముచేత చెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ ముహూర్తమపియోగశ్చే న్నాసాగ్రేమనసాసహ
సర్వంతరతిపాప్మానం తస్యజన్మశతార్జితమ్॥ ౧౧

టీ॥ యోగః = జ్ఞానసాధనానుష్ఠానమైనయోగము, నాసాగ్రే = నాసికముయొక్కయగ్రభాగమునందు, మనసాసహ = మనస్సుతోఁగూడ, ముహూర్తమపి = క్షణమునేనైనను (స్యాచ్చేత్=అయ్యెనేని, సః = ఆయోగము) తస్య = అట్టివానియొక్క, జన్మశతార్జితమ్ = నూరుజన్మములనుండి యార్జింపఁబడిన, పాప్మానమ్= పాపమును, సర్వమ్=సమస్తమును, తరతి=నశింపఁజేయుచున్నది.

తా॥ జ్ఞానసాధనానుష్ఠానమైనయోగము క్షణమునేపైనను నాసాగ్రమునందు నిశ్చలమనస్సుతో నుండెనేని ఆయోగము, అట్లుఖేచరీముద్ర యనుయోగము కలవానియొక్క నూరుజన్మములనుండి యార్జింపఁబడిన పాపమును సర్వమును నశింపఁజేయుచున్నదని తాత్పర్యము.

☞ మఱియును సద్యోముక్తియనియును క్రమముక్తియనియును ముక్తి రెండువిధములైయున్నది. అరెంటిలో సద్యోముక్తి "యత్రయత్ర మృతోజ్ఞానీ, నతస్యప్రాణాఉత్క్రామంతి, తత్త్రైవసర్వంవిలీయతే," అనియెడు శ్రుతిస్మృతి ప్రమాణములచేత ఇదివరకే ప్రతిపాదింపఁబడియె. ఇప్పుడు "శ్లో॥ బ్రహ్మణాసహతే సర్వే సంప్రాప్తేప్రతిసంచరే అజస్యాంతేకృతాత్మానః ప్రవిశంతిపరంపదమ్."— బ్రహ్మలోకమునకు అర్చిరాదిమార్గముచేత పోయినవారందఱును మహాప్రళయము సంభవించుచుండఁగా బ్రహ్మతోఁగూడ ధన్యులై పరమపదమును పొందుచున్నారు అనియెడు స్మృతిప్రమాణమును అనుసరించి క్రమముక్తిని నిరూపించుటకొఱకు అర్చిరాదిమార్గమునఁ బోయినవారికి పునరావృత్తిలేదనియును, ధూమాదిమార్గముచేతఁ బోయినవారికి పునరావృత్తియనియును, నిరూపించుటకై యోగధారణముచేతనే యీరెండుమార్గముల స్వరూపమును చెప్పఁదలచి యర్చిరాదిమార్గ స్వరూపమును యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

☞ ఖేచరిముద్ర:—పర్వతగుహాప్రదేశంబున ఆసనంబున సమాసీనుండై పద్మాసనమునందుకూర్చొని అర్ధోన్మీలితలోచనుండై నవద్వారంబులఁ జిత్తంబుచే నిరోధించి విషయములతోఁగూడ యింద్రియములను ప్రత్యాహారము గావించి కుండలీశక్తిని మేలుకొలిపి ప్రాణవాయునిరోధముచేసి తాలువులమధ్యప్రదేశంబున జిహ్వామూలంబులగ్నంబగుటఁగావించి బహిరంతరములయందును ఊర్ధ్వాధోభాగంబులయందును భావాభావరూపంబులయందును సంయోగింపని మనోదృష్టినవ్వహించి దంతంబులచేతం దంతంబులస్పృశింపక మనస్సును ఊర్ధ్వముఖముగ మూర్ధ్నియందుంచి వృత్తిరహితముచేయవలయును. ఇదియ ఖేచరిముద్ర. ఈముద్ర తెలియువఱకు అతికష్టమనియు తెలిసినపిమ్మట అతిసులభమనియు అనుభవజ్ఞులు చెప్పుదురు.

శ్లో॥ దక్షిణేపింగళానాడీ వహ్నిమండలగోచరా
దేవయానమితిజ్ఞేయా పుణ్యకర్మానుసారిణీ॥ ౧౨

టీ॥ దక్షిణే = దక్షిణభాగమునందు, వహ్నిమండలగోచరా = అగ్నిమండలగోచరమైనదియును, పుణ్యకర్మానుసారిణీ = పుణ్యకర్మములను అనుసరించినదియును, పింగళా = పింగళయను నామధేయముకలదియును, (అయిన) నాడీ = నాడి, దేవయానమితి = దేవయానమని, జ్ఞేయా = తెలియఁదగినది.

తా॥ దేహముయొక్క దక్షిణభాగమందు అగ్నిమండల గోచరమైనదియును పుణ్యకర్మములను అనుసరించినదియును, పింగళ యనుపేరుకలదియును, అయిన నాడియే దేవయానమని యెఱుఁగవలయును. అనఁగా పింగళయనునాడి పునరావృత్తిరహితమైన బ్రహ్మలోకమును కలిగించుననియును ఇదియే అర్చిరాదిమార్గమని యను తాత్పర్యము.

పింగళనాడి :— కుడిముక్కునందుండి వాసనలనుగ్రహించును; యిదియే సూర్యనాడి; యీనాడియు ముక్కునుండి కపాలముదనుక పోవును కనుక నిదియు వాసనలను గ్రహింపఁజేయును. ఈయిడాపింగళానాడులు సుషుమ్నతోఁగూడ నాధారచక్రమునుండి యూర్ధ్వముఖముగాఁబోయి భ్రూమధ్యమందుఁజేరి గంగాయమునాయనుపేరులు కలవియగును. వీనివలననే ప్రాణవాయువునకు సంచారము కలుగును. గంగాయమునాసరస్వతులు కలియుస్థానము గనుక భ్రూమధ్యమునకుఁ త్రివేణీ సంగమ మనుపేరు కలిగెను.

అర్చిరాదిమార్గము:—ఇది సగుణబ్రహ్మోపాసకులు బ్రహ్మలోకమునకుఁ బోవుమార్గము. "అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల ష్షణ్మాసాఉత్తరాయణమ్ తత్రప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మబ్రహ్మవిదోజనాః" భగవద్గీత 8 అ. 24 శ్లో॥ తేజస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము దేవయానము పింగళానాడి తేజోమార్గము—ఈమార్గమునబోవువారు యోగాభ్యాసముచేత వైరాగ్యము పరమోపశాంతియును కలిగి సంకల్పరహితులయి మనస్సన్న్యాసముగలవారై క్రమముగా సూర్యలోకమునుపొంది అనంతరము బ్రహ్మలోకముఁ జేరి ముక్తులగుచున్నారు. దీనినే సూర్యమార్గమనియు నివృత్తిమార్గమనియుఁ జెప్పుదురు.

☞ మఱియును ఇఁకమీఁదటిశ్లోకముచేత ధూమాదిమార్గమునకు సాధనమైన యిడానాడియొక్క స్వరూపము చెప్పఁబడుచున్నదని యెఱుఁగవలయును.

శ్లో॥ ఇడాచవామనిశ్వాసో సోమమండలగోచరా
పితృయానమితిజ్ఞేయా వామమాశ్రిత్యతిష్ఠతి॥ ౧౩

టీ॥ వామనిశ్వాసః=ఎడమభాగమునందు శ్వాసముకలదియును, సోమమండలగోచరా = చంద్రమండలగోచరమైనదియును (అయిన), ఇడాచ =ఇడయనునాడి, పితృయానమితి=పితృయానమని, జ్ఞేయా = తెలియఁదగినది; సా=ఆయిడానాడి, వామమ్=వామభాగమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, తిష్ఠతి=ఉన్నది.

తా॥ ఇడానాడి యనఁగా వామనిశ్వాసము. అది చంద్రమండలగోచరమైనదై పితృయానమని చెప్పఁబడును. ఆ యిడానాడి వామభాగమును ఆశ్రయించియున్నది.

ఇడయనునాడి మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రపర్యంతమును వ్యాపించి యుండుననియును, ఆనాడియే పితృయానమనియును, పునరావృత్తిని కలిగించునట్టి ధూమాదిమార్గమనియును చెప్పఁబడునని తాత్పర్యము.

ఇడానాడి:—ఎడమముక్కునందుండి వాసనలనుగ్రహించును. ఇదియే చంద్రనాడి. ఈనాడి ముక్కునుండి కపాలముదనుక పోవును గనుక వాసనలనుగ్రహింపఁ జేయును.

ధూమాదిమార్గము:—"అగ్నిహోత్రంతపస్సత్యం వేదానాంచానుపాలనమ్ ఆతిథ్యంవైశ్యదేవంచ ఇష్టమిత్యభిధీయతే" అగ్నిహోత్రములు తపస్సులు సత్యవాక్పరిపాలన వేదపఠనము అతిథి అభ్యాగతులకు ఆతిథ్యమిచ్చుట వైశ్యదేవకర్మచేయుట మొదలుగాఁగలకర్మలుచేయువారికి పితృలోకమునకుఁ బోవుమార్గము తామచేయు అగ్నిహోత్రముద్వారా కలుగును. "ధూమోరాత్రిస్తథాకృష్ణ షణ్మాసాదక్షిణాయనమ్ తత్రచాన్ద్రమసంజ్యోతి ర్యోగీప్రాప్యనివర్తతే" భగవద్గీత. అ. 8 శ్లో॥ 25 పొగ రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము పితృయానము యిడానాడి యీమార్గమునఁ బోవువారు చంద్రలోకముఁజేరి అచ్చట పుణ్యఫలమనుభవించి "క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశన్తి" అనున్యాయము చొప్పున మేఘమందుఁబడి జలమై ఆజలరూపమున ఓషధులలోజేరి అన్నమై తద్వారాశుక్లంబై స్త్రీగర్భంబునంజేరి గర్భనరకమనుభవించి జననమై కర్మలునేయుచు చచ్చుచుపుట్టుచుందురు. ఈమార్గమునఁ బోవువారికి పుణ్యక్షయానంతరము పునర్జన్మముకలదు. దీనినే ప్రవృత్తిమార్గమనియు చంద్రమార్గమనియుఁ జెప్పుదురు.

☞ అపరోక్షజ్ఞానముగలవారు సాధనచతుష్టయసంపత్తిఁగలవారై శ్రవణమనననిదిధ్యాసలచేత బ్రహ్మవేత్తలై పైరెండుమార్గములనువిడిచి అనఁగా అర్చిరాది ధూమాదిమార్గములను విడిచి జీవన్ముక్తుఁలై పిమ్మట విదేహముక్తులగుదురు.

☞ ఈవిధముగా ఇడాపింగళానాడులయొక్క స్వరూపములను జెప్పెను కనుక ఇఁక సుషుమ్నానాడీస్వరూపమును వివరింపఁదలచి తత్సంబంధియైన బ్రహ్మనాడియొక్క స్వరూపమును యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడు.

శ్లో॥ దేహస్యపశ్చిమేభాగే వీణాదండస్వరూపభృత్
దీర్ఘాస్థిమూర్ధ్నిపర్యంతం బ్రహ్మదండీతికథ్యతే॥ ౧౪

టీ॥ దేహస్య = శరీరముయొక్క, పశ్చిమేభాగే = వెనుకటిదైనభాగమునందు, వీణాదండస్వరూపభృత్ = వీణాదండమువలె, మూర్ధ్నిపర్యంతమ్ = శిరస్సువఱకును వ్యాపించిన, దీర్ఘాస్థి=పొడుగైనయెముక (అనఁగా వెన్నెముక), బ్రహ్మ దండీతి= బహ్మదండియని, కథ్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ శరీరముయొక్క వెనుకటిభాగమునందు వీణాదండముయొక్క యాకృతి వంటి యాకారముగలదై, శిరస్సులోని సహస్రారపర్యంతమును వ్యాప్తమైయున్న పొడుగగు నెముకయే నడిపీపుననుండు వెన్నెముకయగును ; దీనినే బ్రహ్మదండియని చెప్పదురు. బ్రహ్మైక్యప్రతిపాదకమైన బ్రహ్మనాడియుండెడిస్థానము గనుక బ్రహ్మదండి యని చెప్పఁబడెను.

అ॥ ఈక్రిందిశ్లోకముచేత సుషుమ్నానాడీస్వరూపమును చెప్పుచున్నాఁడు.

శ్లో॥ తస్యాంతేసుషిరంసూక్ష్మం బ్రహ్మనాడీతిసూరిభిః॥ ౧౫

టీ॥ తస్య = ఆబ్రహ్మదండమనియెడునెముకయొక్క, అంతే = అంతమందు, సూక్ష్మమ్=సూక్ష్మమైన, సుషిరమ్ = రంధ్రము,అస్తి=కలదు. ఆరంధ్రమందుండెడి నాడి, సూరిభిః=పెద్దలచేతను, బ్రహ్మనాడీ = బ్రహ్మాత్మైక్యప్రతిపాదకమగునాడి, ఇతి =ఇట్లని, కథ్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ బ్రహ్మదండమనియెడు వెన్నెముకయొక్క అంతరమందు సూక్ష్మమైన బిలము కలదు. అందుండెడి సుషుమ్నానాడియే బ్రహ్మనాడియని చెప్పఁబడునని తాత్పర్యము.

శ్లో॥ ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నాసూక్ష్మరూపిణీ
సర్వంప్రతిష్ఠితంతస్మిన్ సర్వగంసర్వతోముఖమ్॥ ౧౬

టీ॥ ఇడాపింగళయోః = ఇడాపింగళలనియెడునాడులయొక్క, మధ్యే=మధ్య యందు, సుషుమ్నా = సుషుమ్నయనియెడునాడి, సూక్ష్మరూపిణీ = సూక్ష్మమైన స్వరూపముగలది, భవేత్ = అగును; తస్మిన్=ఆసుషుమ్నానాడియందు, సర్వమ్= సర్వస్వరూపమును, సర్వగమ్ = సమస్తమునుపొందినదియును, సర్వతోముఖమ్= విశ్వతోముఖమును (అయిన బ్రహ్మము), ప్రతిష్ఠితమ్=ఉంచఁబడెను.

తా॥ ఇడాపింగళనాడులనడుమను సుషుమ్నానాడి అతిసూక్ష్మమైయుండును. ఆమూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయ సహస్రారచక్ర పర్యంతము కుండలీశక్తియని ప్రసిద్ధినిపొందిన సుషుమ్నానాడియొక్క అగ్రమందు సర్వాత్మకమై సర్వవ్యాపకమై విశ్వతోముఖమై యుండునట్టి తేజస్సు బ్రహ్మజ్యోతి ప్రతిష్ఠితమై యున్నదని తాత్పర్యము. ఇందుకు "తస్యాశ్శిఖాయామధ్యే" అని శ్రుతి ప్రమాణము.

<u>సుషుమ్న</u>:—శరీరముయొక్క వెనుకభాగమున వీణాదండమువలె శిరస్సు పర్యంతమును వెన్నెముకయున్నది. దానినిబ్రహ్మదండియని చెప్పదురు. ఆవెన్నెముక

మధ్యను గొట్టమువలె సూక్ష్మరూపముగనుండు రంధ్రమందు సుషుమ్నానాడి యుండును. ఆనాడి ఇడాపింగళనాడులకు మధ్యయుండినదై సుషుమ్నయనుపేరఁ బరగుచున్నది. ఈసుషుమ్నయే బ్రహ్మాత్మైక్యప్రతిపాదకమైనది గనుక బ్రహ్మనాడి యని చెప్పఁబడెను. ఈసుషుమ్న కంతర్గతముగా కుండలినీశక్తి గలదు. ఈవీణాదండమునకు వీణెకుమెట్లువలెనే యొకటిమీదనొకటిగా ముప్పదిమూడుపూసలుండును. అందు మొదటియేఁడింటినే మెడపూసలని కడమయిరువదియాఱింటిని వెన్నుపూసలనియుఁ జెప్పుదురు. ఈవెన్నెముకకే బ్రహ్మదండి మేరువు నను పేరులు. ఈపూసలనడుమ నాళముండును. ఈనాళముగుండ సుషుమ్న అధోముఖముగ మూలాధారమునకు వచ్చి మనస్సును విషయములకుపోవునట్లుచేసి తాను తిరుగా యూర్ధ్వముఖముగా వ్యాపించుచు వెన్నుపూసలను మెడపూసలనుదాఁటి పెద్దనాళముతోఁ గలియును. ఈపెద్దనాళమునకే బ్రహ్మరంధ్రమనిపేరు. ఈసుషుమ్న సర్పాకారముగానున్నందున వెన్నుపామనిచెప్పుదురు. ఈసుషుమ్న కడుకోమలమయినదియు బహుమృదువైనదియును గావున నేయపాయమునుగలుగకుండ శిరస్సునందలి కపాలకుహరమనెడి దట్టమయిన యెముకలపెట్టెలో నిమడ్చఁబడి యతిజాగ్రతతోఁ గాపాడవలసివచ్చెను. ఈసుషుమ్నయుండెడుస్థానము బ్రహ్మరంధ్రము. ఇదియె ప్రాణాధారము. ఈసుషుమ్న అతికోమలమును సుకుమారమునై, యిడాపింగళలనునాడులతో మూలాధారమునుండి యూర్ధ్వముఖముగాఁబోయి "కుండలీశక్తి" యనుపేరితోఁ గపాలకుహరమునఁ బ్రవేశించి యచటనుండి నాలుకకొనకుఁజేరి "సరస్వతి" యనుపేరిటఁ బ్రసిద్ధమగుచున్నది. ఈసుషుమ్న మూలాధారమునుండి సహస్రారము దనుక వ్యాపించుచు పశ్చిమాభిముఖమై భ్రూమధ్యమందు యిడాపింగళనాడులతోఁ గలిసియుండును. ఆస్థానమే త్రివేణీసంగమము త్రికూటము, ఆజ్ఞాచక్రము, అనిచెప్పఁబడును. సుషుమ్న తెల్లనిరంగుగలదిగాన శుక్లనాడియని పరబ్రహ్మమునుగుఱించిన జ్ఞానమునకుసాధకము గావున బ్రహ్మనాడియనియును జెప్పఁబడును.

☞ ఉత్తరదేశమందు కాశీమహాక్షేత్రమునకు సమీపమున ప్రయాగలో సరస్వతి గుప్తగామినిగా నున్నది. అటులనే సుషుమ్నయను గుప్తగామినియని తలంచునది.

☞ వెన్నెముకయందుండెడి ముప్పదిమూఁడుపూసలనే ముప్పదిముగ్గురు దేవతావారలనియు శరీరమందలి ముప్పదిమూఁడుకోట్లరోమంబులే ముప్పదిమూఁడు కోట్లదేవతలనియుఁ జెప్పుచున్నారు. ఇంద్రుఁడు, బ్రహ్మ, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, మొత్తమున ముప్పదిముగ్గురు దేవతావారలని తెలియునది.

☞ మఱియును, శ్రు॥ శతంచైకాచహృదయస్యనాడ్యః తాసాంమూర్ధానమభినిస్సృతైకా తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి" = మాంసపిండభూతమైన హృదయసంబంధమైన నాడులు నూటయొక్కటియై యున్నవి. ఆనాడులలో ఒకటి శిరస్సునుగుఱించి బయలువెడలి పోయినది. అనాడీమార్గముచేత బయలువెడలిపోవువాఁడు మోక్షమును పొందుచున్నాఁడు. అనియెడు శ్రుతిప్రమాణానుసారముగ ఆసుషుమ్నానాడీమార్గమునుబట్టి పోవువారికి బ్రహ్మప్రాప్తిని నిరూపించుటకొఱకు ఆ కుండలికి సకలజీవాత్మకత్వము, సకలజగదాత్మకత్వము, సకలజగదాధారకత్వము, సకలవేదాత్మకత్వము, సకలవేదాధారకత్వముగలదని యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ తస్యామధ్యగతాస్సూర్య సోమాగ్ని పరమేశ్వరాః
భూతాలోకాదిశఃక్షేత్ర స్సముద్రాః పర్వతాశ్శిలాః॥ ౧౭

శ్లో॥ ద్వీపాశ్చనిమ్నగా వేదా శాస్త్రవిద్యాకలాక్షరాః॥ ౧౮

శ్లో॥ స్వరమంత్రపురాణాని గుణాస్సత్వాదయోపిచ
బీజంబీజాత్మకాస్తేషాం క్షేత్రజ్ఞాఃప్రాణవాయవః॥ ౧౯

శ్లో॥ సుషుమ్నాంతర్గతంవిశ్వం తస్మిన్ సర్వంప్రతిష్ఠితం॥ ౨౦

టీ॥ సూర్యసోమాగ్నిపరమేశ్వరాః=సూర్యుఁడు చంద్రుఁడు అగ్నిదేవుఁడు పరమేశ్వరుఁడు అనువారలును, భూతాః = చరాచరాత్మకమైనజీవులు, లోకాః = చతుర్దశభువనములు, దిశః=పూర్వాది అష్టదిక్కులు, క్షేత్రః = వారణాసి మొదలగు క్షేత్రములు, సముద్రాః=లవణాదిసముద్రములు, పర్వతాః = పర్వతములు, శిలాః= శిలలు, ద్వీపాః=జంబూద్వీపము మొదలయినద్వీపములు, నిమ్నగాః = గంగాదినదులు, వేదాః = ఋక్యజుస్సామాధర్వణంబులను వేదంబులు, శాస్త్రవిద్యాః = మీమాంసాది శాస్త్రములు, కలాః=చతుష్షష్టికళలు, అక్షరాః = అకారాదివర్ణములు, స్వరమంత్రపురాణాని=ఉదాత్తాదిస్వరములు గాయత్ర్యాదిమంత్రములు బ్రాహ్మ్యాదిపురాణములు, సత్త్వాదయః=సత్త్వరజస్తమోగుణములు మొదలుగాఁగల, గుణాః = గుణములు, బీజమ్=బీజము, బీజాత్మకాః=బీజాత్మకులయిన, క్షేత్రజ్ఞాః = క్షేత్రజ్ఞులు, తేషాం= వారియొక్క, ప్రాణవాయవః = సమానవ్యానోదానప్రాణాపానంబులనియెడు పంచప్రాణంబులును నాగకూర్మకృకరదేవదత్తధనుంజయులనెడు ఉపవాయువులును (అనునవి అన్నియు), తస్యాః = ఆసుషుమ్నానాడియొక్క, మధ్యగతాః = మధ్యభాగమునుపొందినవి అయియున్నవి ; విశ్వమ్ = ప్రపంచము, సుషుమ్నాంతర్గతమ్=

సుషుమ్నా నాడియొక్క మధ్యమునుపొందినది అయివున్నది; తస్మిన్=ఆసుషుమ్నా నాడియందు, సర్వమ్=అంతయును, ప్రతిష్ఠితమ్=ఉంచఁబడినది.

తా॥ సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, పరమేశ్వరుఁడు, చరాచరాత్మకమైన భూతములు, అనఁగాజీవులు, పదునాలుగులోకములు, తూర్పుదిక్కు మొదలుగాఁగల దిక్కులు, కాశీక్షేత్రము మొదలుగాఁగల క్షేత్రములు, లవణసముద్రము మొదలు గాఁగల సముద్రములు, సప్తకులపర్వతములు, శిలలు, జంబూద్వీపము మొదలయిన ద్వీపములు, గంగానది మొదలుగాగలనదులు, ఋగ్వేదము మొదలుగాఁగలవేదములు, మీమాంసశాస్త్రము మొదలుగాఁగలశాస్త్రములు చతుష్షష్టికళలు, అకారాదివర్ణ ములు, ఉదాత్తాదిస్వరములు, గాయత్ర్యాదిమహామంత్రములు, బ్రాహ్మ్యాదిపురాణ ములు, సత్వాదిగుణములు, క్షేత్రజ్ఞులగుజీవులు, వారియొక్కపంచప్రాణములు, నాగాది వాయువులు, మొదలగుసర్వమును సుషుమ్నానాడికి మధ్యగతములయినవి. మఱి యును సకలజగజ్జాలములును సుషుమ్నాంతర్గతమయిన కుండలినీశక్తికి అంతర్భూత మని చెప్పఁబడెను; కావున, ఆసుషుమ్నానాడియందే సకలజగత్తులు నుండును అని తాత్పర్యము.

☞ ఈవిషయమంతయును "తస్యాంతేసుషిరంసూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్" ఆహృదయపుండరీకముయొక్కమధ్యమందుసూక్ష్మమైనరంధ్రముకలదు. దానియందు ఉపాసనానుగ్రహముకొఱకు సర్వస్వరూపముగుబ్రహ్మము ప్రతిష్ఠింపఁబడి యున్నది. అనునట్టిశ్రుతిబోధించుచున్నదని యెఱుఁగవలయును.

☞ దక్షిణోత్తరభాగములయందుండి హృదయమువలనబయలువెడలిన ఇడ పింగళ అనురెండునాడులను అడ్డుపఱిచి ఆహృదయమునందుండియే హృదయాగ్ర మూలకముగ నూర్ధ్వగమనశీలమైన సుషుమ్నయనునాడిచేత హృదయసంబంధమైన ప్రాణవాయువును, కంఠావలంబితమును స్తనసదృశమును అయిన మాంసఖండమును పొందించి అక్కడనుండి యామార్గముచేత ప్రాణవాయువును కనుబొమలనడుమ ప్రవేశపెట్టి ప్రమాదములేనివాఁడై బ్రహ్మరంధ్రమునుండి బయలువెడలి సర్వజ్ఞుఁడును, సనాతనుఁడును, అయినపరమపురుషుని పొందుచున్నాఁడనియును, అట్లుకనుబొమల నడుమ ప్రాణవాయువును ప్రవేశపెట్టుటకు పూర్వమునందే భూమిజయమునుకూడా చేయవలసిన దనఁగా పృథివ్యప్తేజోవాయ్వాకాశములనియెడు నైదుభూతములను స్వాధీనచేష్టలుకలవానినిగాఁ జేయవలసినదని యెఱుఁగవలయును. అయితే పంచ భూతములను స్వాధీనములనుగాఁ జేసికొనులక్షణమును సూచించుటకుఁగాను సర్వ మును సుషుమ్నయందే ప్రతిష్ఠింపఁబడియున్నది. అని యీశ్లోకముచేతచెప్పినారు.

☞ ఈ క్రింది శ్లోకముచేతఁగూడ అనుషుమ్నానాడియే జగదుత్పత్తికి కారణమని అనాడీస్వరూపమునే వివరించిచెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ నానానాడీప్రసరగం సర్వభూతాంతరాత్మని
ఊర్ధ్వమూలమధశ్శాఖా వాయుమార్గేణసర్వగమ్॥ ౨౧

టీ॥ సర్వభూత = సర్వప్రాణులయొక్క, అంతరాత్మని =అంతరాత్మయందున్నదై, నానానాడీప్రసరగమ్ = సర్వనాడులకుత్పత్తిస్థానమై, ఊర్ధ్వమూలమ్ = ఊర్ధ్వముఖములయినమూలముకలదై, అధశ్శాఖమ్=క్రిందికివచ్చినశాఖలుగలదియై, వాయుమార్గేణ=ప్రాణాదివాయుమార్గముచేత, సర్వగమ్ = సర్వమునుపొందినదై, తిష్ఠతి =ఉన్నది.

తా॥ అనుషుమ్నానాడి, సర్వప్రాణులయొక్కయును, అంతరాత్మయందున్నదియును, సర్వనాడులకుత్పత్తిస్థానమును, ఊర్ధ్వముఖములయిన శాఖలుకలదియును, హిరణ్యగర్భాదిసృష్టిపరంపరలును, అధోముఖమువలనఁగలిగినదేవతిర్యగాదిశాఖలు గలిగినదియును, ప్రాణాదివాయుమార్గముచేత సర్వమును వ్యాపించినదియును, అయినదై జగదుపాదానకారణమగుచున్నది.

☞ ఈ విషయమంతయును యీ క్రిందివాక్యములచేత వివరింపఁబడుచున్నది. ఎట్లనిన :— “ శ్రు ॥ ఊర్ధ్వమూలోఽవ్యాక్శాఖఏషోశ్వత్థస్సనాతనః తదేవశుక్రంతద్బ్రహ్మతదేవామృతముచ్యతే ” = నిర్వికల్పకశుద్ధపరబ్రహ్మమే వేరుగాఁగలదియును, మహదహంకారాదులే కొమ్మలుగాఁగలదియును, పురాతనము నగు శబళబ్రహ్మమే ముక్తిప్రదము. ఇందుకు పురాణవాక్యప్రమాణము—“ శ్లో॥ అవ్యక్తమూలప్రభవస్తస్యైవానుగ్రహోత్థితః బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాంతరకోటరః మహాభూతప్రశాఖశ్చవిషయైఃపత్రవాంస్తథా ధర్మాధర్మసుపుష్పశ్చసుఖదుఃఖఫలోదయః ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః ఏతద్బ్రహ్మవనంచైవబ్రహ్మాచరతినిత్యశః ఏతచ్ఛిత్వాచభిత్వాచజ్ఞానేనపరమాసినా తతశ్చాత్మరతింప్రాప్య యస్మాన్నావర్తతేపునః॥ ” = అవ్యాకృతము మూలప్రకృతి మాయ యనెడువేరునుండి పుట్టి యావేరుగట్టిదగుటంజేసి క్రమముగావిస్తరించి పెరుగుచున్నదియును, బుద్ధియనెడు వేరునుండిపుట్టి యావేరుగట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియును, బుద్ధియనెడు ప్రానుకలదియును, (లోకములోనఁ జెట్లకు ప్రానునుండి కొమ్మలుపెరుగునట్లుబుద్ధినుండి సమస్తవికారములును బుట్టునుగాన బుద్ధి ప్రానుగాఁ జెప్పఁబడినది) నేత్రేంద్రియాదిరంధ్రములే తొఱ్ఱలుగాఁగలదియును, పృథివ్యాదిపంచభూతములే పెద్దకొమ్మలుగాఁగలదియును, శబ్దాదివిషయములే యాకులుగాఁ

గలదియును, ధర్మాధర్మములనెడు మంచిపుష్పములుకలదియును, సుఖదుఃఖముల నెడు పండ్లుకలదియును, వృక్షముపక్షులకువలె సమస్తప్రాణులకు జీవనాధారమై నదియును చిరకాలమునకు బ్రహ్మజ్ఞానము గలిగినపిమ్మటఁ బోవునదియగుటంబట్టి బహుపురాతనమైనదియు నగుబ్రహ్మమే యధిష్ఠానముగాఁ గనబడు సంసారమనెడు వృక్షమే పరమాత్మకు విహారస్థానమగు వనమైనది — అనఁగా బ్రహ్మమే యవిద్య వలన సంసారిత్వమును బొందినట్లుండుననుట. లేక బ్రహ్మవనం, అనఁగా :— సంసారవృక్షమునకు బ్రహ్మమే వనమువంటిది. వృక్షమునకు వనమువలె సంసారమునకు పరబ్రహ్మమే యధిష్ఠానము. అనఁగా పరబ్రహ్మమందు అధ్యస్తమనుట. ఇట్టి సంసారవృక్షమును అహంబ్రహ్మాస్మియనెడు దృఢజ్ఞానరూపమగు కత్తిచేత ఛేదించినవాఁడు ప్రతిబంధకములనన్నిటిని దొలంగుటంజేసి కేవలాత్మనిష్ఠుఁడై మఱల సంసారబంధముకలుగుటకు వీలులేని కైవల్యపదమునుబొందును. మఱియును. అ, శ్వ, త్థ, అనుపదములలో అ = న = కాదు, శ్వ = శ్వః = రేపు, త్థ = స్థ = స్థాతా = ఉండునది, అనఁగా, శ్వఃనస్థాతా = రేపటికి (ఉత్తరక్షణమువఱకును) ఉండునది కానిది. అట్టి సంసారవృక్షమును బాగుగఁదెలిసినవాఁడే వేదవేదాంతార్థములను దెలిసికొనినవాఁడు. ఏలయంటే :— బ్రహ్మమనెడు మూలము (వేరు) గల సంసారవృక్షమునకంటె నీకఁదెలియవలసినది యణుమాత్రమైనను వేఱులేదుగదా. సంసారమునకు మూలమగుబ్రహ్మమునే (స్వస్వరూపమునే) తెలిసికొనిన కృతకృత్యతకలుగుచుండినను సమూలసంసార వృక్షజ్ఞానముకలవాఁడు వేదార్థవేత్తయని యిందు స్తుతిచేయఁబడినదని గ్రహింపవలయును.

☞ బ్రహ్మోపస్థానముచేత నితరనాడులయొక్క యాధిక్యమును చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ద్విసప్తతిసహస్రాణి నాడ్యస్స్యుర్వాయుగోచరాః
కర్మమార్గేణసుషిరా స్తిర్యఞ్చస్సుషిరాత్మకాః ॥ ౨౨

శ్లో॥ తతశ్చోర్ధ్వగతానాంతు సర్వద్వారాణిరోధయన్
వాయునాసహజీవోర్ధ్వ గామీమోక్షమవాప్నుయాత్ ॥ ౨3

టీ॥ వాయుగోచరాః = వాయుసంచారమున కనుకూలములైన, ద్విసప్తతిసహస్రాణి = డెబ్బదిరెండువేలు, నాడ్యః = నాడులు, కర్మమార్గేణ = కర్మమార్గముచేత, సుషిరాః = (పునరావృత్తిప్రాపకములైన) రంధ్రములుగలవి. తతః = అందువలన, తిర్యఞ్చః = తిర్యగ్భూతములైన, సుషిరాత్మకాః = రంధ్రములేస్వరూపముగాఁగలవి, ఊర్ధ్వగతానాంతు = ఊర్ధ్వభాగమునందు వ్యాపించిన నాడులయొక్క, సర్వద్వారాణి

= సకలములయిన ద్వారములను, రోధయన్ = ధారణయను ప్రాణాయామముచేత ముఖాదిద్వారములనడ్డగించుచు, జీవః = జీవుఁడు, వాయునాసహ = సుషుమ్నానిర్గతములయిన వాయువులతోడ, ఊర్ధ్వగామీ = ఊర్ధ్వగమనముగలవాఁడును, బ్రహ్మాపరోక్షజ్ఞానముకలవాఁడును, (అయి) మోక్షమ్ = మోక్షమును, ఆప్నుయాత్ = పొందును.

తా॥ వాయుసంచారమున కనుకూలములైన డెబ్బదిరెండువేలనాడులు కర్మమార్గముచేత పునరావృత్తిప్రాపకములై సుషిరములు (రంధ్రములు) కలవియగుచున్నవి. కావున అడ్డముగవ్యాపించినవై సుషిరాత్మకములయిన రంధ్రప్రదములు ఊర్ధ్వాధోగతభాగముల యందంతటను వ్యాప్తములయిన నాడులద్వారములలో వాయుధారణయను ప్రాణాయామముచేత ముఖాదిద్వారములవలన నడ్డగించుచు, జీవుఁడు సుషుమ్నాంతర్గతమైన వాయువుతోడి నూర్ధ్వగమనముకలవాఁడగుచు బ్రహ్మాపరోక్షజ్ఞానముకలవాఁడై బ్రహ్మైక్యమును పొందును. ఈవిషయమును "శ్రు॥ తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి"—ఆనాడీమార్గముచేత బయలువెడలిపోవువాఁడు మోక్షమునుపొందుచున్నాఁడు. అనుశ్రుతి ప్రమాణానుసారముగఁ దెలియవలయును. మఱియును, ముందుగ కుంభకప్రాణాయామముచేత ప్రాణాపానముల నొక్కటిగాఁజేసి స్థాపించి అనంతరమందు ఇడ పింగళ యనునట్టినాడులను వదలి సుషుమ్నయనునాడిచేత ప్రాణవాయువును కనుబొమలమధ్యమందు చక్కఁగ లంబికాంతమునకుఁ దెచ్చియుంచి పిమ్మట శీర్షకపాలమును భేదించి వేదోక్తక్రమముగ పృథివ్యప్తేజోవాయ్వాకాశాక్షరమృత్యువులను జయించిపోవువాఁడు సర్వజ్ఞత్వాదిలక్షణములు కల పరమాత్మను పొందుచున్నాఁడని యెఱుఁగవలయును.

☞ ఇట్టికుండలిశక్తి జగత్తునకు ఆధారమైన దగుటచేత ఉపాదానకారణమగుటవలన ఆసుషుమ్నమందే యింద్రపురమగు స్వర్గాదులు కల్పింపఁబడెనని యీ క్రిందిశ్లోకముచేత చెప్పుచున్నారు.

శ్లో॥ అమరావతీతునాసాగ్రే పూర్వస్యాందిశివర్తతే
ఆగ్నిలోకస్తథాజ్ఞేయ శ్చక్షుస్తేజోవతీపురీ॥ ౨౪

టీ॥ తత్ర = ఆనాడీవిశేషమందు, పూర్వస్యామ్= తూర్పుదైన, దిశి= దిక్కునందు, నాసాగ్రే= నాసాగ్రమందు, అమరావతీ= ఇంద్రాదులునివసించునట్టి యింద్రలోకమునందలి యమరావతియనుపట్టణము, వర్తతే= ఉన్నది, తథా= ఆలాగుననే, చక్షుః= దక్షిణనేత్రము, తేజోవతీ= అగ్నిదేవునియొక్క, పురీ=పట్టణము, అగ్నిలోకః=అగ్న్యాదిదేవతావాసమైన లోకమును, వర్తతే=ఉన్నవి.

తా॥ ఆనాడీవిశేషమందు పూర్వదిక్కున నాసాగ్రమందు ఇంద్రాదిదేవతలు నివసించుటకుఁ దగిన యమరావతీపట్టణమున్నది. ఆవిధముగానే దక్షిణనేత్రమున అగ్నిదేవునియొక్క పట్టణము అగ్న్యాదిదేవతావాసమైనలోకమును ఉన్నవి. ఈ విషయమంతయును, “ శ్రు॥ ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత.”= ముఖమువలన యింద్రాగ్నులును, ప్రాణమువలన వాయువును పుట్టెను. “ చక్షుస్సూర్యోఅజాయత” అనియెడు శ్రుతులుబోధించుచున్నవి.

శ్లో॥ యామ్యాసంయమనీశ్రోత్రే యమలోకశ్ప్రతిష్ఠితః
నైఋత్యామథతత్పార్శ్వే నైఋతోలోకఆశ్రితః॥ ౨౫

టీ॥ శ్రోత్రే = దక్షిణకర్ణమందు, యామ్యా= యమసంబంధమైన, సంయమనీ = సంయమనిపట్టణము, యమలోకశ్చ= యమలోకమును, ప్రతిష్ఠితః = ప్రతిష్ఠింపఁబడెను; అథ = పిమ్మట, తత్పార్శ్వే = ఎడమచెవియొక్క పార్శ్వమునందు, నైఋత్యామ్= నిఋఋతిదిక్కునందలి, నైఋతః = నిఋఋతిసంబంధమైన, లోకః= లోకము, ఆశ్రితః=ఆశ్రయింపఁబడెను.

తా॥ దక్షిణకర్ణమందు యమసంబంధమైన సంయమనిపట్టణము కలదనియును, ఎడమచెవియొక్క పార్శ్వభాగమునందు నైఋతిదిక్కునందుండునట్టి నిఋఋతి లోకము కలదనియును, తాత్పర్యము.

శ్లో॥ విభావతీప్రతీచ్యాంతు పృష్ఠేవారుణికాపురీ
వాయోర్గంధవతీకర్ణ పార్శ్వేలోకశ్ప్రతిష్ఠితః॥ ౨౬

టీ॥ ప్రతీచ్యామ్=పడమటిదిక్కునందు, పృష్ఠే=పృష్ఠభాగమునందు, విభావతీ= విభావతియను పేరుకలదియును, వారుణికా = వరుణదేవుని సంబంధమైనదియును అయిన, పురీ= పట్టణము, వర్తతే= ఉన్నది, కర్ణపార్శ్వే=కర్ణములపార్శ్వభాగమునందు, వాయోః= వాయువుయొక్క, గంధవతీ = గంధవతియనునామధేయముగల పట్టణము, లోకశ్చ=వాయులోకమును, ప్రతిష్ఠితః=ప్రతిష్ఠింపఁబడెను.

తా॥ పడమటిదిక్కునందుండునట్టిదియును, వరుణదేవునిసంబంధమైనదియును, అయినవిభావతి యనుపేరుకలపట్టణము పృష్ఠభాగమునందున్నదియును, వామకర్ణ సమీపమందు వాయుదేవునిసంబంధమైన గంధవతియనుపట్టణమును వాయులోకమును ఉన్నవనియును, తాత్పర్యము.

శ్లో॥ సౌమ్యేపుష్పవతీసౌమ్యా సోమలోకస్తుకంఠతః
వామకర్ణేతువిజ్ఞేయా దేహమాశ్రిత్యతిష్ఠతి॥ ౨౭

టీ॥ సౌమ్యే=ఉత్తరదిక్కునందు, కంఠతః=కంఠము మొదలుకొని, వామకర్ణేతు=ఎడమచెవివఱకును, దేహమ్=వామభాగదేహమును, ఆశ్రిత్య=ఆశ్రయించి, సౌమ్యా=కుబేరసంబంధమైన, పుష్పవతీ=పుష్పవతియనుపట్టణము, సోమలోకస్తు=సోమలోకమును, తిష్ఠతి=ఉన్నవి, (ఇతి=ఇట్లని) విజ్ఞేయా=తెలియఁదగినది.

తా॥ ఉత్తరపుదిక్కునందు కంఠము మొదలుకొని వామకర్ణమువఱకును దేహమును ఆశ్రయించి కుబేరసంబంధమైన పుష్పవతియనియెడు పట్టణమును సోమలోకమును కలవని యెఱుఁగవలయును అని తాత్పర్యము.

శ్లో॥ వామచక్షుషిఐశానం శివమస్తిమనోన్మయం
మూర్ధ్నిబ్రహ్మపురీజ్ఞేయా బ్రహ్మాండందేహమాశ్రితమ్॥ ౨౮

టీ॥ వామచక్షుషి = వామనేత్రమునందు, ఐశానం = ఈశ్వరసంబంధమైనదియును, మనోన్మయమ్=మనోన్మయమనియెడునామధేయముకలదియును అయిన, శివమ్=శివలోకము, అస్తి = ఉన్నది; మూర్ధ్ని = శిరస్సునందు, బ్రహ్మపురీ =బ్రహ్మపట్టణముఅని, జ్ఞేయా = తెలియఁదగినది; బ్రహ్మాండమ్ =సకలజగజ్జాలము, దేహమ్=దేహమును, ఆశ్రితమ్=ఆశ్రయించినది, భవతి=అగుచున్నది.

తా॥ వామనేత్రమందు ఈశ్వరసంబంధమైనదియును, మనోన్మయమనియెడు నామధేయముకలదియును, అయిన శివలోకము ఉన్నదనియును, శిరస్సునందు బ్రహ్మపట్టణమున్నదనియును, సకలజగజ్జాలమును దేహమును ఆశ్రయించియున్నదనియును తాత్పర్యము.

శ్లో॥ పాదాధస్తుశివోఽనంతః కాలాగ్నిఃప్రళయాత్మకః
అనామయమధశ్చోర్ధ్వం మధ్యమంతుబహిఃశ్రితమ్॥ ౨౯

టీ॥ పాదాధః = పాదములక్రింద, అనంతః = అనంతుఁడను పేరుకల, శివః=శివుఁడు, ప్రళయాత్మకః=ప్రళయాత్మకుఁడైన, కాలాగ్నిః = కాలానలము, (ప్రళయాత్మకుఁడైన కాలాగ్నిరుద్రుఁడు. అనఁగా అరుద్రుఁడే త్రిలోకములను దహించువాఁడు.) అస్తి=కలఁడు, అధశ్చ=అధోభాగమునందును, ఊర్ధ్వమ్=ఊర్ధ్వభాగమునందును, మధ్యమమ్=మధ్యదేశమందును, బహిః = బాహ్యదేశములయందును, అనామయమ్ = నిరంజనమును మంగళాత్మకమును శివస్వరూపమును అయినబ్రహ్మము, శ్రితమ్=ఆశ్రయింపఁబడెను.

తా॥ పాదములక్రింద అనంతుఁడును ప్రళయకాలాగ్నిరుద్రుఁడును అనునట్టి శివుఁడు కలఁడు. అట్టి కాలాగ్నిరుద్రునిక్రింద నేమియుండునని శంకించుకొని దానికి

సమాధానమును చెప్పుచున్నాఁడు. ఎట్లనిన :— అథోదేశోర్ధ్వదేశములయందును మధ్యదేశమందును బాహ్యదేశమందును అనఁగా సర్వస్థలములయందును నిరంజనమును మంగళాత్మకమును శివస్వరూపమును అయినబ్రహ్మస్వరూపము వ్యాపించియున్నదని తాత్పర్యము

☞ మఱియును ఈక్రిందిశ్లోకముచేత కాలాగ్నిరుద్రునిమీఁద అతలాది లోకకల్పనమును జెప్పుచున్నాఁడని తెలియునది.

శ్లో॥ అథఃపదోతలంవిద్యాత్పాదేచవితలంవిదుః
నితలంపాదసంధౌచ సుతలంజంఘముచ్యతే॥ ౩౦

శ్లో॥ మహాతలంచజానుస్స్యాదూరుదేశేరసాతలం
కటిస్తలాతలంప్రోక్తం సప్తపాతాళసంజ్ఞయా॥ ౩౧

టీ॥ పదః=పాదముయొక్క, అధః = అధోదేశమందు, అతలమ్ =అతలమనులోకమును, విద్యాత్ = తెలియవలయును ; పాదేచ=పాదమునందు, వితలమ్=వితలలోకమును, విదుః = చెప్పుచున్నారు, పాదసంధౌచ=పాదములయొక్క సంధియందు, నితలమ్=నితలలోకమును, విద్యాత్=తెలియవలయును, సుతలమ్=సుతలలోకము, జంఘమ్=జంఘాప్రదేశము (ఇతి=ఇట్లని) ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, జానుః=జానుప్రదేశము, మహాతలంచ=మహాతలలోకము, స్యాత్=అగును. ఊరుదేశే=ఊరుప్రదేశమునందు, రసాతలమ్=రసాతలలోకము, స్యాత్=అగును. కటిః=కటిప్రశదేము, తలాతలమ్ = తలాతలలోకము, (ఇతి = ఇట్లని) ప్రోక్తమ్ = చెప్పఁబడెను. పాతాళసంజ్ఞయా = పాతాళలోకములనియెడు గుర్తుచేత, సప్త = ఏడులోకములును, జ్ఞేయాః=తెలియఁదగినవి.

తా॥ అపరబ్రహ్మముయొక్క పాదములయొక్క యథఃప్రదేశము అతలలోకమనియును, పాదము వితలలోకమనియును, గుల్భములు నితలలోకమనియును, జంఘలు సుతలమనియును, జానువులు మహాతలమనియును, తొడలు రసాతలమనియును, కటిప్రదేశము తలాతలమనియును, సప్తపాతాళలోకములను దెలిసికొనవలసినదని తాత్పర్యము.

శ్లో॥ కాలాగ్నినరకంఘోరం మహాపాతాళసంజ్ఞయా
పాతాళంనాభ్యధోభాగే భోగీంద్రఫణమండలం
వేష్టితస్సర్వతోనంత స్సంబిభ్రజ్జీవసంజ్ఞికః॥ ౩౨

టీ॥ ఘోరమ్ = భయంకరమైనదియును, కాలాగ్నినరకమ్ = కాలాగ్నివలె దుఃఖకరమును, భోగీంద్రఫణమండలమ్ = ఆదిశేషునిపడగలయొక్క మండలముకలది

యను, మహాపాతాళసంజ్ఞయా = మహాపాతాళమనుసంజ్ఞతోఁ గూడినదియును (అయిన) పాతాళమ్=పాతాళలోకము, నాభ్యధోభాగే=బొడ్డునకుక్రిందనున్న ప్రదేశమునందు, వర్తతే=ఉన్నది, తమ్=ఆలోకమును, సర్వతః=అంతటను, వేష్టితః =చుట్టుకొన్నదై, జీవసంజ్ఞికః = జీవుఁడనియెడుసంజ్ఞకలదై, అనంతః=అనంతుఁడను పేరుగలసర్పరాజు, సంబిభ్రత్=లెస్సగాధరించెను.

తా॥ భయంకరమైనదియును, కాలాగ్నివలెదుఃఖమును కలిగించునదియును, అయిన మహాపాతాళమనియెడులోకము నాభికి క్రిందిభాగమునందు ఆదిశేషునివడగల చేత వ్యాప్తమైయున్నది. అట్టిలోకమును జీవసంజ్ఞకలయనంతుఁడు అంతటను చుట్టుకొని భరించుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ భూలోకోనాభిదేశస్తు భువర్లోకస్తుకుక్షితః
హృదయంస్వర్గలోకస్తు సూర్యాదిగ్రహతారకాః॥ 33

టీ॥ నాభిదేశస్తు = నాభిదేశము, భూలోకః = భూలోకము, కుక్షితః=కుక్షి ప్రదేశమునందు, భువర్లోకః=భువర్లోకము, హృదయమ్=హృదయము, స్వర్గలోకః= స్వర్గలోకము, (తత్ర=ఆస్వర్గలోకమునందు), సూర్యాదిగ్రహతారకాః=సూర్యుఁడుమొదలుగాఁగలగ్రహములును, అశ్విన్యాదినక్షత్రములును, సంతి=కలవు.

తా॥ నాభిదేశము భూలోకమనియును, భువర్లోకము కుక్షిప్రదేశమనియును, స్వర్గలోకము హృదయప్రదేశమనియును, ఆస్వర్గలోకమునందు సూర్యాదిగ్రహములును అశ్విన్యాదినక్షత్రములును కలవనియును తాత్పర్యము.

శ్లో॥ సూర్యస్సోమస్సనక్షత్రో బుధశ్శుక్రకఃకుజాంగిరాః
మందస్తుసప్తమోజ్ఞేయో ధ్రువోంతస్స్వర్గలోకతః॥ 34

టీ॥ సూర్యః=సూర్యుఁడు, సోమః = చంద్రుఁడు, సనక్షత్రః=నక్షత్రములతోఁగూడిన, బుధః=బుధుఁడు, శుక్రః=శుక్రుఁడు, కుజః =అంగారకుఁడు, అంగిరాః=బృహస్పతి, సప్తమః = ఏడవవాఁడగు, మందః+తు = శనియును, (తత్ర=ఆ స్వర్గలోకమునందు, అస్తి=కలరు.) స్వర్గలోకతః = స్వర్గలోకముయొక్క, అంతః =అంతమందు, ధ్రువః=ధ్రువుఁడు అని, జ్ఞేయః=తెలియఁదగినది.

తా॥ సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములతోఁ గూడుకొనినబుధుఁడు, శుక్రుఁడు, కుజుఁడు, బృహస్పతి, ఏడవవాఁడగుశని అనునట్టిగ్రహములు ఆస్వర్గలోకమునం దున్నారనియును, ఆస్వర్గలోకముయొక్క అంతమందు ధ్రువలోకమున్నదనియును, తాత్పర్యము.

☞ మఱియును ఇట్లుకల్పించుకొనవలయునని తత్ప్రకారమును ఈక్రింది శ్లోకముచేత వివరించుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ హృదయేకల్పయేద్యోగీ తస్మింత్సర్వసుఖంలభేత్॥ ౩౫

టీ॥ యోగీ = యోగియగువాఁడు, హృదయే = హృదయమునందు, (ఏతత్ = దీనిని, సర్వమ్ = సమస్తమును,) కల్పయేత్ = కల్పింపవలయును. (ఏవంచేత్ = ఈలాగు అయ్యేనేని), తస్మిన్ = ఆహృదయమునందు, సర్వసుఖమ్ = సమస్తసుఖసముదాయమును, లభేత్ = పొందును.

తా॥ యోగియగువాఁడు ఇప్పుడు చెప్పినదానిని సర్వమును హృదయమునందు కల్పించినయెడల ఆహృదయమునందు సర్వసుఖములను పొందునని తాత్పర్యము.

శ్లో॥ హృదయేచమహర్లోకో జనలోకస్తుకంఠతః
తపోలోకోభ్రువోర్మధ్యే మూర్ధ్ని సత్యంప్రతిష్ఠితమ్॥ ౩౬

టీ॥ హృదయేచ = హృదయమునందు, మహర్లోకః = మహర్లోకము, కంఠతః = కంఠమందు, జనలోకః = జనలోకము, భ్రువోః = కనుబొమలయొక్క, మధ్యే = మధ్యమందు, తపోలోకః = తపోలోకము, మూర్ధ్ని = శిరస్సునందు, సత్యమ్ = సత్యలోకము, ప్రతిష్ఠితమ్ = ఉంచఁబడెను.

తా॥ హృదయమునందు మహర్లోకము కంఠమునందు జనలోకము కనుబొమల నడుమ తపోలోకము శిరస్సునందు సత్యలోకము ఉంచఁబడెను అని తాత్పర్యము.

శ్లో॥ ఏవంబ్రహ్మాండనిలయం తస్మిన్ దేహేప్రతిష్ఠితమ్॥ ౩౭

టీ॥ ఏవమ్ = యీవిధముగా, బ్రహ్మాండనిలయమ్ = బ్రహ్మాండం బంతయును, తస్మిన్ దేహే = యీదేహమందే, ప్రతిష్ఠితమ్ = కల్పింపఁబడినది.

తా॥ ఈప్రకారము బ్రహ్మాండంబంతయును, యీదేహమందే కల్పింపఁబడెను.

☞ ఇదివఱకుఁ జెప్పఁబడిన శ్లోకములచేత స్వర్గలోకాది కల్పనాప్రకారము చెప్పఁబడెను కనుక ఈక్రిందిశ్లోకములచేత వాని లయక్రమము జెప్పఁబోవుచున్నాఁడని తెలియవలయును.

శ్లో॥ బ్రహ్మాండరూపిణీపృథ్వీ తోయమధ్యేప్రలీయతే
అగ్నినాపీయతేతోయం వాయునాగ్రస్యతేనలః॥ ౩౮

శ్లో॥ ఆకాశంతుపిబేద్వాయుం మనస్యాకాశమేవచ
బుద్ధ్యాహంకారచిత్తేచ క్షేత్రజ్ఞఃపరమాత్మని॥ ౩౯

శ్లో॥ తుర్యంచతుర్యాతీతంచ శివస్థానమనామయం
గ్రసేత్సమస్తమాత్మేతి ధ్యాయంశ్చపరమాంగతిమ్॥ ౪౦

టీ॥ బ్రహ్మాండరూపిణీ=బ్రహ్మాండమేస్వరూపముగాఁగల, పృథ్వీ=భూమి, తోయ మధ్యే=ఉదకమధ్యమందు, ప్రలీయతే = అణఁగిపోవుచున్నది, తోయమ్ = ఉదకము, అగ్నినా=అగ్నిచేత, పీయతే=పానముచేయఁబడుచున్నది, అనలః=అగ్ని, వాయునా = వాయువుచేత, గ్రస్యతే = గ్రసింపఁబడుచున్నది, ఆకాశంతు = ఆకాశము, వాయుమ్ = వాయువును, పిబేత్ = పానముచేయును, మనసి = మనస్సునందు, ఆకాశమ్=ఆకాశము,లీయతే = అణఁగిపోవుచున్నది, ఆమనస్సు బుద్ధియందును, బుద్ధిః = బుద్ధి, అహంకారః = అహంకారమందును, ఆయహంకారము, చిత్తేచ= చిత్తమందును, ఆచిత్తము, క్షేత్రజ్ఞః=క్షేత్రజ్ఞునియందును, ఆక్షేత్రజ్ఞుఁడు, పరమాత్మని = పరమాత్మయందును, ఆపరమాత్మ, తుర్యమ్ = తుర్యమందును, ఆతుర్యము తుర్యాతీతమందును,తుర్యాతీతమ్ = ఆతుర్యాతీతము, అనామయమ్ = నిరామయమైన, శివస్థానమ్ = శివస్థానమందును, సమస్తమ్ = సర్వమును, ఆత్మ = ఆత్మయందును, గ్రసేత్ = గ్రసింపఁబడును, ఇతి = ఇట్లని, ధ్యాయన్ = ధ్యానము చేయుచు, పరమామ్=సర్వోత్తమమైన, గతిమ్=స్థితిని, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తా॥ బ్రహ్మాండరూపమగుభూమి, ఉదకమందు లీనమగుచున్నదనియును, అగ్నియం దుదకము లీనమగుచున్నదనియును, వాయువునందు అగ్ని లీనమగుచున్నదనియును, ఆకాశమునందు వాయువు లీనమగుచున్నదనియును, ఆకాశము మనస్సునందు లీనమగుచున్నదనియును, మనస్సు బుద్ధియందు లీనమగుచున్నదనియును, బుద్ధి అహంకారమునందు లీనమగుచున్నదనియును, అహంకారము చిత్తమునందు లీనమగుచున్నదనియును చిత్తము క్షేత్రజ్ఞునియందు లీనమగుచున్నదనియును, క్షేత్రజ్ఞుఁడు పరమాత్మయందు లీనమగుచున్నాఁడనియును, పరమాత్మ తుర్యమునందు లీనమగుచున్నాఁడనియును, తుర్యము అనామయమును తుర్యాతీతమును అయినశివస్థానమునందు లీనమగుచున్నదనియును, సర్వమును పరమాత్మయందు లీనమగుచున్నదనియును, అంతయును పరమాత్మస్వరూపమే యనియును ధ్యానముచేయువాఁడు సర్వోత్తమమైనగతిని అనఁగా మోక్షమును పొందుచున్నాఁడని తాత్పర్యము.

☞ ఈవిధముగా యోగాభ్యాసముచేత సిద్ధించిన బ్రహ్మైక్యానుసంధానమువలన సకలదురితనివృత్తియగునని యీక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడని తెలియవలెను.

శ్లో॥ అహంబ్రహ్మేతియోధ్యాయే దేకాగ్రమనసాసకృత్
సర్వంతరతిపాప్మానం కల్పకోటిశతైఃకృతమ్॥ ౮౧

టీ॥ యః=ఎవ్వఁడు, అహమ్ = నేను, బ్రహ్మేతి =బ్రహ్మనని, సకృత్=ఒక్కమాటయినను, ఏకాగ్రమనసా = నిర్మలమైనమనస్సుచేత, ధ్యాయేత్ = ధ్యానమును జేయుచున్నాఁడో,(సః=వాఁడు), కల్పకోటిశతైః=అనేకనూరులకోట్లకల్పములందు, కృతమ్ = చేయఁబడిన, సర్వమ్ = సమస్తమైన, పాప్మానమ్ = పాపమును, తరతి= దాటుచున్నాఁడు.

తా॥ ఈశ్లోకముచేత జీవునకుఁ గలుగునట్టి ముక్తిస్వరూపమును జెప్పుచున్నాఁడు. ఎట్లనిన:—ఎవ్వఁడు నిశ్చలమైనమనసుచేత నేనుబ్రహ్మనని ధ్యానమును జేయునో అట్టివాఁడు అనేకనూరులకోట్లకల్పములయందుఁ చేయఁబడిన పాపమును సర్వమును పోఁగొట్టుకొనుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ ఘటసంవృతమాకాశం లీయమానంఘటేయథా
లీయతేచమహాకాశే తద్వజ్జీవోమహాత్మని॥ ౮౨

టీ॥ ఘటసంవృతమ్=ఘటావృతమైన, ఆకాశమ్ = ఆకాశము, ఘటే=ఘటమునందు, లీయమానంసత్=అణఁగినదగుచు, యథా=ఏవిధముగా, మహాకాశే=మహాకాశమునందు, లీయతే = లీనమగుచున్నదో, తద్వత్ = ఆలాగుననే, జీవః=జీవుఁడు, మహాత్మని=పరమాత్మయందు, లీయతే=లీనమగుచున్నాఁడు.

తా॥ ఘటమునందుఁ జేరియున్న యాకాశము ఘటమునందు లీనమైనదగుచు మహాకాశమునం దేవిధముగా లీనమగుచున్నదో యావిధముగా జీవుఁడు పరమాత్మయందు లీనమగుచున్నాఁ డని తాత్పర్యము.

శ్లో॥ ఘటాకాశమివాత్మానం విలయంవేత్తితత్త్వతః
సగచ్ఛతినిరాలంబం జ్ఞానలోక్యంనసంశయః॥ ౮౩

టీ॥ యః=ఎవ్వఁడు, ఆత్మానమ్ = ఆత్మను, ఘటాకాశమివ = ఘటాకాశమువలె, తత్త్వతః = యథార్థముగా, విలయమ్ = విలయమును, వేత్తి =తెలిసికొనుచున్నాఁడో,సః=వాఁడు,నిరాలంబమ్ = నిరాధారమైనదియును, జ్ఞానలోక్యమ్ =జ్ఞానముచేతఁజూడఁదగినదియును అయిన బ్రహ్మమును, గచ్ఛతి=పొందుచున్నాఁడు, సంశయః=సందేహము, న=లేదు.

తా॥ ఏపురుషుఁడు ఘటాకాశము మహాకాశమందు లీనమైనవిధముగఆత్మ పరమాత్మయం దైక్యమును పొందుచున్నాఁ డని తెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడు పరమాత్మను పొందుచున్నాఁ డనుటకు సందేహమేమియును లేదని తాత్పర్యము.

☞ జ్ఞానయోగమునకు సమానము లేదని యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ అధీత్యచతురోవేదా న్ధర్మశాస్త్రాణిమానవః
యోవై బ్రహ్మనజానాతి దర్వీపాకరసంయథా॥ ౪౪

టీ॥ యోవై=ఏ, మానవః = మానవుఁడు, చతురః = నాలుగైన, వేదాన్ = వేదములను, ధర్మశాస్త్రాణి=ధర్మశాస్త్రములను, అధీత్య=చదివి, బ్రహ్మ=బ్రహ్మమును, నజానాతి=ఎఱుఁగఁడో, సః=వాఁడు, పాకరసమ్=పాకముయొక్కరుచిని, దర్వీ=గరిటె, యథా=ఏవిధముగా, నజానాతి= ఎఱుఁగదో, తథా = ఆవిధముగా, నజానాతి=ఎఱుఁగఁడు.

తా॥ లోకములో నేపురుషుఁడు నాలుగువేదములను సకలధర్మశాస్త్రోక్తములను జదివి బ్రహ్మమును దెలిసికొనఁడో వాఁడు పాకరసమును దెలియని గరిటెవంటి వాఁడని తాత్పర్యము.

☞ బ్రహ్మజ్ఞానము కలుగువఱకును శ్రౌతకర్మమును జేయవలసినదనియును అపరోక్షానుభవము కలిగినపిమ్మట కర్మానుష్ఠానమును జేయపనిలేదనియును, ఈక్రింది శ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ అనంతకర్మశౌచంచ జపయజ్ఞస్తథైవచ
తీర్థయాత్రానుగమనం యావత్తత్త్వంనవిందతి॥ ౪౫

టీ॥ అనంతకర్మశౌచంచ = అనంతములగుకర్మములయొక్క పరిశుద్ధతయును, జపయజ్ఞశ్చ = జపయజ్ఞమును, తథైవ = ఆవిధముగానే, తీర్థయాత్రానుగమనమ్= తీర్థయాత్రలను జేయుటయును, యావత్ = ఎంతదనుక, తత్త్వమ్ =వాస్తవమును అనఁగా బ్రహ్మతత్త్వమును, నవిందతి=తెలియఁడో, తావత్ =అంతవఱకును, అనుష్ఠేయమ్=అనుష్ఠింపఁదగినది.

తా॥ అనంతములగు కర్మములచేతనైన పరిశుద్ధతయును జపయజ్ఞములును తీర్థయాత్రలకుఁ బోవుటయును తత్త్వజ్ఞానమునకు సాధనములు కనుక తత్త్వజ్ఞానము కలుగువఱకును జేయవలసినదే కాని తత్త్వజ్ఞానము కలిగినపిమ్మటఁ జేయనక్కర లేదని తాత్పర్యము.

☞ ఈక్రిందిశ్లోకముచేతఁ దేహములు భిన్నములయినను ఆత్మయొక్కటియే యని సదృష్టాంతముగాఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ గవామనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా
క్షీరవద్భాతివిజ్ఞానం దేహినాంచగవాంయథా॥ ౪౬

టీ॥ గవామ్ = గోవులు, అనేకవర్ణానామపి = అనేకవర్ణములుకలవయినప్పటికిని, క్షీరస్య=క్షీరమునకు (పాలకు), ఏకవర్ణతా = ఏకాకారము, యథా = ఏవిధముగా, భవతి=అగుచున్నదో, తథా = ఆవిధముగా, దేహినామ్ = దేహులకు, విజ్ఞానమ్=విజ్ఞానాత్మ, గవామ్=గోవులయొక్క, క్షీరవత్=పాలవలె, ఏకమ్ = ఏకాకారమైనదై, భాతి=ప్రకాశించుచున్నది.

తా॥ గోవులు అనేకవర్ణము లయినప్పటికిని వానియొక్క క్షీరము లన్నియును ఏకాకారములయి యున్నవిధముగ శరీరములు అనేకములుగానుండినను ఆత్మస్వరూప మొక్కటియేయని తాత్పర్యము.

☞ మఱియును, బ్రహ్మజ్ఞానరహితునియొక్క తపస్సు మొదలగునవి నిరర్థకములని యీక్రిందిశ్లోకముచేతఁ జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ తపేద్వర్షసహస్రాణి ఏకపాదస్థితోనరః
ఏకస్యధ్యానయోగస్య కళాంనార్హతిషోడశీమ్॥ ౪౭

టీ॥ నరః = మానవుఁడు, ఏకపాదస్థితః = ఒంటికాలియందున్నవాఁడై, వర్షసహస్రాణి = అనేకవేలసంవత్సరములు, తపేత్ (+అపి) = తపస్సు చేసినప్పటికిని, తత్ = ఆతపస్సు, ఏకస్య = ఒక్కటియైన, ధ్యానయోగస్య = ధ్యానయోగముయొక్క, షోడశీమ్ = పదునాఱవదైన, కళామ్=కళతో, నార్హతి = సమానముకాదు.

తా॥ మానవుఁడు ఒంటికాలియందు నిలిచి తపస్సుచేసినప్పటికిని ఆతపస్సు ధ్యానయోగముయొక్క పదునాఱవభాగమునకుఁ గూడ దగదని తాత్పర్యము.

శ్లో॥ బ్రహ్మహత్యాసహస్రాణి వీరహత్యాశతానిచ
ఏకేనధ్యానయోగేన దహత్యగ్నిరివేంధనమ్॥ ౪౮

టీ॥ బ్రహ్మహత్యాసహస్రాణి = అనేకవేలబ్రహ్మహత్యలను, వీరహత్యాశతానిచ =అనేకనూరులవీరహత్యలను, ఏకేన=ఒక్కటియైన, ధ్యానయోగేన=ధ్యానయోగముచేత, అగ్నిః=అగ్ని, ఇంధనమివ = కట్టెలనువలె, దహతి = కాల్చివేయుచున్నాఁడు.

తా॥ ధ్యానయోగమును జేయుచున్నవాఁడు తనదు ధ్యానయోగముచేత అనేకవేలబ్రహ్మహత్యలను అనేకనూరుల వీరహత్యలను అగ్నిహోత్రుఁడు కట్టెలను కాల్చినవిధముగఁ గాల్చుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ అశ్వమేధసహస్రాణి వాజపేయశతానిచ
ఏకస్యధ్యానయోగస్య కళాంనార్హతిషోడశీమ్॥ ౪౯

టీ॥ అశ్వమేధసహస్రాణి = అనేకవేలయశ్వమేధయాగములును, వాజపేయశతాని+చ = అనేకనూరులవాజపేయయాగములును, ఏకస్య=ఒక, ధ్యానయోగస్య = ధ్యానయోగముయొక్క, షోడశీమ్ = పదునాఱవదగు, కళామ్ = కళనుగుఱించి, నార్హంతి=తగదు.

తా॥ అనేకవేలయశ్వమేధయాగములును అనేకనూరులవాజపేయయాగములును ఒక్కటియగు ధ్యానయోగముయొక్క పదునాఱవభాగమునకుఁ గూడ సమానము కావని తాత్పర్యము.

శ్లో॥ చతుర్వేదధరోవిప్ర స్సూక్ష్మబ్రహ్మనవిందతి
వేదశాస్త్రభరాక్రాంత స్సవై బ్రాహ్మణగార్దభః॥ ౫౦

టీ॥ యః=ఏ, విప్రః = బ్రాహ్మణుఁడు, చతుర్వేదధరః = నాలుగువేదములను ధరించినవాఁడై, సూక్ష్మబ్రహ్మ = సూక్ష్మమగు బ్రహ్మమును, నవిందతి = ఎఱుఁగఁడో, వేదశాస్త్రభరాక్రాంతః = వేదశాస్త్రములయొక్క భారముచేత ఆక్రమింపఁబడిన, సవై =ఆవిప్రుఁడు, బ్రాహ్మణగార్దభః = బ్రాహ్మణఖరము, స్యాత్ =అగును.

తా॥ ఏబ్రాహ్మణుఁడు నాలుగువేదములను ధరించినవాఁడై సూక్ష్మమైనబ్రహ్మమును దెలిసికొనఁడో అట్టిబ్రాహ్మణుఁడు అనఁగా వేదశాస్త్రములనియెడు భారముతోఁ గూడుకొన్న బ్రాహ్మణుఁడు గాడిదెవంటివాఁడగునని తాత్పర్యము.

శ్లో॥ యథాఖరశ్చందనభారవాహీ సారస్యవాహీనతుచందనస్య
ఏవంహిశాస్త్రాణిబహూన్యధీత్య సారంనజానన్ఖరవద్వహేత్సః॥

టీ॥ యథా = ఏవిధముగా, చందనభారవాహః = చందనభారమును వహించునట్టి; ఖరః = గాడిదె, చందనస్య = చందనముయొక్క, సారస్య = సారమును, వాహః = వహించునట్టిది, నతు = కాదో, ఏవమ్ = ఈవిధముగా, బహూని = అనేకములయిన, శాస్త్రాణి = శాస్త్రములను, అధీత్య = అధ్యయనమునుచేసి, సారమ్ = సారమును, నజానన్ = ఎఱుఁగని, సః = ఆబ్రాహ్మణుఁడు, ఖరవత్ = గాడిదవలె, వహేత్ =వహించును.

తా॥ చందనపుకట్టెలను మోయుచున్నగాడిదె చందనగంధమును తెలిసికొననివిధముగ అనేకములయిన శాస్త్రములను చదివి వానిసారమును దెలియనివాఁడు గాడిదెతోసమానుఁ డని తాత్పర్యము.

శ్లో॥ ఆహారనిద్రాభయమైథునాని సామాన్యమేతత్పశుభిర్నరాణామ్
జ్ఞానీనరాణామధికోవిశేషో జ్ఞానేనహీనఃపశుభిస్సమానః॥ ౫౨

టీ॥ నరాణామ్ = మనుష్యులకును, పశుభిః =పశువులకును, ఆహారనిద్రాభయ మైథునాని = ఆహారము నిద్రభయముమైథునము అనునవి, సామాన్యమ్=సమానము. నరాణామ్=నరులలో, జ్ఞానీ=బ్రహ్మజ్ఞానముకలవాఁడు, అధికోవిశేషః =అధికమయి నవాఁడు. జ్ఞానేన = జ్ఞానముచేత, హీనః = హీనుఁడు, పశుభిః = పశువులతో, సమానః=సమానుఁడు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ ఆహారము నిద్ర భయము సంభోగము ననునవి పశువులకును మనుష్యులకుఁగూడ సమానముగ నుండుగుణములు పశువులకంటెను మనుష్యునియందు జ్ఞానమొక్కటి యధికము. అట్టిజ్ఞానమే లేనిచో మనుష్యుఁడును బశువుతో సమానుఁడే యగుననియును అట్టివాఁడే నరపశువనియును తాత్పర్యము.

శ్లో॥ అహంబ్రహ్మేతినియతం మోక్షేధ్యేయంమహాత్మభిః
ద్వేపదేబంధమోక్షాయ నిర్మమేతిమమేతిచ
మమేతిబధ్యతేజంతు ర్నిర్మమేతివిముచ్యతే॥ ౫౩

టీ॥ అహమ్ =నేను, బ్రహ్మేతి = బ్రహ్మనని, నియతమ్ = నియమముగా, మోక్షే = మోక్షమునందు, అనఁగా మోక్షమునకుగాను, మహాత్మభిః = మహానుభావులచేత, ధ్యేయమ్ = ధ్యానముచేయఁదగినది, నిర్మమేతి = నాదికాదనియు, మమేతి=నాదియనియును, ద్వే = రెండగు, పదే = పదములు. బంధమోక్షాయ= బంధముకొఱకును మోక్షముకొఱకును, భవతః = అగుచున్నవి; జంతుః =జంతువు, మమేతి = మమయనుపదముచేత, బధ్యతే = బంధింపఁబడుచున్నాఁడు, నిర్మమేతి = నాదికాదనుటచేత, విముచ్యతే = విడిచిపెట్టఁబడుచున్నాఁడు.

తా॥ మహాత్ములగువారు ప్రతిదినమునందును సర్వకాలములయందును తప్పక నేనుబ్రహ్మనని ధ్యానముచేయవలయును; నాది యనుటచేత బంధముకలుగుననియును, నాదికాదనుటచేత బంధరహితుఁ డగుననియును, కావున నాదికాదనుటచేత బద్ధుఁడుకాఁడనియును తాత్పర్యము.

శ్లో॥ మనసోహ్యున్మనీభావాత్ ద్వైతంనైవోపలభ్యతే
యదాయాత్యున్మనీభావం తదాతత్పరమంపదమ్॥ ౫౪

టీ॥ మనసః = మనస్సునకు, ఉన్మనీభావాత్ =ఆశారాహిత్యమువలన, ద్వైతమ్ = ద్విధాభావము, నైవోపలభ్యతే = పొందఁబడదు; యదా = ఎప్పుడు, ఉన్మనీభావమ్=ఆశారాహిత్యమును, యాతి = పొందుచున్నాఁడో, తదా = అప్పుడు, తత్ =ఆ, పరమమ్=శ్రేష్ఠమైన, పదమ్=పదమును, యాతి = పొందుచున్నాఁడు.

తా॥ మనస్సునకు ఆశారాహిత్యమగుటవలన ద్వైతప్రపంచము కనఁబడదు. ఎప్పుడు ఆశరహితమగునో అప్పుడాపరమపదమును అనఁగా మోక్షమును పొందు నని తాత్పర్యము.

☞ ఈక్రిందిశ్లోకముచేత బ్రహ్మవిచారము చేయనివానికి సర్వమును వ్యర్థ మని చెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ హన్యాన్ముష్టిభిరాకాశం క్షుధార్తః ఖండయేత్త్ర్యహం
నాహంబ్రహ్మేతిజానాతి తస్యముక్తిర్నజాయతే॥ ౫౫

టీ॥ క్షుధార్తః=ఆఁకలిచేత పీడింపఁబడినవాఁడు, ముష్టిభిః=పిడికిడులచేత, హన్యాత్=కొట్టుటవలన, త్ర్యహమ్=మూఁడుకాలములయందును, ఆకాశమ్= ఆకాశమును, ఖండయేత్=ఖండించునుగాక; అహమ్=నేను, బ్రహ్మేతి=బ్రహ్మ నని, యః=ఎవ్వఁడు, నజానాతి=గుర్తెఱుఁగఁడో, తస్య=అతనికి, ముక్తిః=మో క్షము, నజాయతే=కలుగదు.

తా॥ ఎవ్వఁడైనను వేదశాస్త్రములనన్నింటిని చక్కఁగా సంపూర్ణముగా చదివియుండియును నేనేబ్రహ్మస్వరూపమని ఎఱుఁగఁడో వానికి సకలవేదశాస్త్రములను చదువుటవలన “శ్లో॥ శబ్దబ్రహ్మణి నిష్ణాతో ననిష్ణాయాత్పరేయది శ్రమస్తస్యశ్ర మఫలో హ్యధేనుమివరక్షతః॥”=శబ్దబ్రహ్మమందు అనఁగా వేదశాస్త్రములయందు నిష్ఠకలవాఁడై పరబ్రహ్మమందు నిష్ఠుఁడుకాని వానిశ్రమకు గొడ్డుబోతు అయిన యావును కాపాడుచున్నవాని శ్రమకు శ్రమకంటె వేఱుగుఫలము లేనివిధముగ శ్రమమే ఫలముగాని యితరమగు ఫలమేమియును లేదు. అనియెడు శ్రీమద్భాగవత వచనప్రమాణానుసారముగ ప్రయోజనమేమియును లేదని యెఱుఁగవలయును. మఱియును ఆఁకలికొన్నమనుజుఁడు పిడికిళ్లచేత ఆకాశమును పగులఁగొట్టినను ఆఁకలితీరనివిధముగ సకలవేదశాస్త్రపురాణములను కష్టించి చదివినను నేనుబ్రహ్మ నని తెలిసికొననివానికి పంతశ్రమయేకాని ముక్తిదొరకదని తాత్పర్యము.

గద్య॥ ఇతిశ్రీమహాభారతే శతసాహస్రసంహితాయాం వైయాసిక్యాం శ్రీమదశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సుజ్ఞానయో గోనామ బ్రహ్మసందర్శనయోగోనామ ద్వితీయోధ్యాయః॥

టీ॥ వైయాసిక్యామ్=వేదవ్యాసమునివరునిచేతఁ జేయఁబడినదియును, శత సాహస్రసంహితాయామ్ = నూరువేలశ్లోకములుకలదియును ఛందోబద్ధశాస్త్రమును

(అయిన) శ్రీమహాభారతే = సంపత్కరమైన మహాభారతమునందలి, శ్రీమదశ్వమేధపర్వణి = సంపత్కరమైనయశ్వమేధపర్వమునందు, శ్రీభగవదుత్తరగీతాసు = సంపత్కరుఁడైన భగవంతునిచేత ఉత్తరకాలమునందుచెప్పఁబడిన యుత్తరగీతలనెడు; ఉపనిషత్సు=వేదాంతములయందు, శ్రీకృష్ణార్జునసంవాదే = శోభాయుక్తమైన కృష్ణార్జునుల సంవాదరూపమైన, బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మవిద్యయందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు, అనఁగా బ్రహ్మజ్ఞానవిషయకోపాయమును దెలుపునట్టి గ్రంథమునందు, సుజ్ఞానయోగో+నామ = సుజ్ఞానమనియెడుపేరుకల, లేక, బ్రహ్మసందర్శనయోగోనామ = బ్రహ్మసందర్శనమనుపేరుకల, ద్వితీయః = రెండవదైన, అధ్యాయః=అధ్యాయము, ఇతి=ముగిసెను.

తా॥ వేదవ్యాసమునివరునిచేతఁ జేయఁబడినదియును నూరువేలశ్లోకములు కలదియును ఛందోబద్ధశాస్త్రమును అయినశ్రీమహాభారతమునందలి యశ్వమేధపర్వమునందు సంపత్కరుఁడగు భగవంతునిచేత యుద్ధానంతరమందు జెప్పఁబడిన వేదాంతములయందు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన బ్రహ్మజ్ఞానమునందు యోగశాస్త్రమునందు అనఁగా బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను దెలుపునట్టి గ్రంథమునందు సుజ్ఞానయోగమనియెడు పేరుకల లేక బ్రహ్మసందర్శనయోగమనియెడు పేరుకల రెండవభాగము ముగిసెను.

———:0:———

ఓం
శ్రీకృష్ణాయ పరబ్రహ్మణేనమః.

# శ్రీభగవదుత్తరగీత—యోగశాస్త్రము.

## తృతీయోధ్యాయః.

శ్లో॥ యోగీవ్యర్థక్రియాలాప పరిత్యాగేనశాంతధీః
తృతీయేశరణంయాతి హరి మే వేతికీర్త్యతే॥ ౧

టీ॥ యోగీ = యోగియగువాఁడు, వ్యర్థక్రియాలాపపరిత్యాగేన = వ్యర్థమైనక్రియలయొక్కయును సల్లాపములయొక్కయును పరిత్యాగముచేత, శాంతధీః = శాంతమైనబుద్ధికలవాఁడై, హరిమ్ = నారాయణుని, శరణమ్=శరణమును, యాతి = పొందుచున్నాఁడు, ఇతి = ఇట్లని, తృతీయే = మూఁడవ యధ్యాయమునందు, కీర్త్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ యోగియగువాఁడు వ్యర్థములయినక్రియలను సల్లాపములను విడిచిపెట్టి శాంతమైనబుద్ధికలవాఁడై నారాయణుని శరణమును పొందుచున్నాఁడని యీ మూఁడవయధ్యాయమునందుఁ జెప్పఁబడుచున్నదని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.

సంపత్కరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అగు
శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥అనంతశాస్త్రంబహువేదితవ్య మల్పశ్చ కాలోబహవశ్చవిఘ్నాః
యత్సారభూతంతదుపాసితవ్యం హంసోయథాక్షీరమివాంబుమిశ్రం॥

టీ॥ బహు = అధికముగా, వేదితవ్యమ్ = తెలియఁదగినవి, అనంతశాస్త్రమ్= అంతములేనిశాస్త్రములు—అనఁగా శాస్త్రములనంతములు; కాలశ్చ = కాలము అనఁగా ఆయుర్దాయము, అల్పః = స్వల్పమైనది, విఘ్నాః = అంతరాయములు, బహవశ్చ=అనేకములు, కావున, హంసః = హంస, అంబుమిశ్రమ్ = ఉదకముతోఁ గూడుకొనిన, క్షీరమివ = పాలనువలె, సారభూతమ్ = శ్రేష్ఠమైనది, యత్ = ఏది యో, తత్=అది, ఉపాసితవ్యమ్=సేవింపఁదగినది.

తా॥ శాస్త్రములు అనంతములయి యున్నవి. ఇంతియేకాక ఆశాస్త్రముల యందుఁ దెలియఁదగిన విషయములు ఇంకను విశేషములయి యున్నవి. జీవితకా

లము మిగులస్వల్పమైనది, విఘ్నములన్ననో అనేకములు. కావున శాస్త్రముల నన్నిటిని జదివి వానిరహస్యముల నన్నిటిని దెలిసికొనుట సాధ్యముకాదు కనుక ఉదకముతోఁ గలిసియున్న క్షీరమును గ్రహించి యుదకమును విడిచిపెట్టునట్టి హంసవలె బుద్ధిమంతుఁడగువాఁడు వేదశాస్త్రసారమగుబ్రహ్మమును దెలిసి యుపాసింపవలసినదని తాత్పర్యము.

శ్లో॥ పురాణంభారతంవేద శ్శాస్త్రాణివివిధానిచ
పుత్రదారాదిసంసారో యోగాభ్యాసస్యవిఘ్నకృత్॥ 3

టీ॥ పురాణమ్ = పురాణము, భారతమ్ = భారతము, వేదః=వేదము, వివిధాని = అనేకములయిన, శాస్త్రాణిచ = శాస్త్రములును, పుత్రదారాదిసంసారః =పుత్రులు భార్య మొదలుగాఁగల సంసారము, అనునవియన్నియును, యోగాభ్యాసస్య=యోగాభ్యాసమునకు, విఘ్నకృత్=విఘ్నమును జేయును.

తా॥ పురాణములు భారతము వేదము అనేకములయినశాస్త్రములు పుత్రులు భార్యమొదలుగాఁగల సంసారము అనునవి యోగాభ్యాసమునకు విఘ్నమును జేయునవి యని తాత్పర్యము.

శ్లో॥ ఇదంజ్ఞానమిదంజ్ఞేయం తత్సర్వంజ్ఞాతుమిచ్ఛతి
అపివర్షసహస్రాణీ శాస్త్రార్థంనాధిగచ్ఛతి॥ ౪

టీ॥ ఇదమ్=ఇది, జ్ఞానమ్=జ్ఞానము, ఇదమ్ = ఇది, జ్ఞేయమ్ = తెలియఁదగినది, ఇతి = ఇట్లని, తత్ = ఆ, సర్వమ్ = సర్వమును, జ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, యః=ఎవ్వఁడు, ఇచ్ఛతి = కోరుచున్నాఁడో, సః = వాఁడు సహస్రవర్షాణి+అపి =వేయిసంవత్సరము లయినప్పటికిని, శాస్త్రార్థమ్ = శాస్త్రముయొక్క అర్థమును, నాధిగచ్ఛతి=తెలిసికొనఁజాలఁడు.

తా॥ ఇదిజ్ఞానమనియును ఇదిజ్ఞేయమనియును తెలియుటకొఱకు ఎవ్వఁడు యిచ్ఛయించునో అట్టివాఁడు వేయిసంవత్సరములు జీవించియున్నప్పటికిని శాస్త్రార్థమును తెలిసికొనఁజాలఁ డని తాత్పర్యము.

☞ ఈప్రకారం బయినచోఁ జేయఁదగినకార్యం బేదియని యర్జునుఁ డడుగునేమోయని తలఁచి యీక్రిందిశ్లోకముచేత శ్రీకృష్ణుఁడు సమాధానమును జెప్పుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ విజ్ఞాయాక్షరతన్మాత్రం జీవితంచచలాచలం
విహాయశాస్త్రజాలాని యస్సత్యంతదుపాస్యతామ్॥ ౫

టీ॥ అక్షరతన్మాత్రమ్=అక్షరతన్మాత్రమైనదానిని, విజ్ఞాయ = తెలిసికొని, జీవితమ్ = జీవితమును, చలాచలమ్ = మిగులచపలమైనదానినిగా, విజ్ఞాయ =తెలిసికొని, శాస్త్రజాలాని = శాస్త్రజాలములను, విహాయ = విడిచిపెట్టి, సత్యమ్ = యథార్థమైనది, యత్=ఏదియో, తత్=దానిని, ఉపాస్యతామ్=సేవింపవలయును.

తా॥ అక్షరతన్మాత్రమగు బ్రహ్మమును దెలిసికొని జీవితమును మిగులచపలమైన దానినిగాఁ దెలిసికొని శాస్త్రసముదాయములను విడిచిపెట్టి సత్యమైనది యేదియో దానిని సేవింపవలసిన దని తాత్పర్యము.

శ్లో॥ పృధివ్యాంయానిభూతాని జిహోపస్థనిమిత్తకమ్
జిహోపస్థపరిత్యాగే పృధివ్యాంకింప్రయోజనమ్॥ ౬

టీ॥ పృధివ్యామ్ = భూమియందు, భూతాని = భూతములు, యాని = ఏవి, (సన్తి=కలవో) తత్ = ఆభూతసముదాయము, జిహ్వోపస్థనిమిత్తకమ్ =జిహ్వోపస్థలేనిమిత్తముగాఁగలది అయియున్నది, జిహ్వోపస్థపరిత్యాగే = జిహ్వోపస్థలయొక్క పరిత్యాగముకలుగుచునుండఁగా, పృధివ్యామ్ = భూమియందు, ప్రయోజనమ్ =ప్రయోజనము, కిమ్=ఏమి, (అస్తి=కలదు).

తా॥ భూమియందలి భూతములన్నియును జిహ్వోపస్థలేనిమిత్తముగాఁ గలవి కనుక జిహ్వోపస్థలను పరిత్యజించినయెడల భూమియందు కాఁదగిన కార్యమేదియును లేదని తాత్పర్యము.

శ్లో॥ తీర్థానితోయరూపాణి దేవాన్పాషాణమృణ్మయాన్
యోగినోనప్రపద్యంతే ఆత్మధ్యానపరాయణాః॥ ౭

టీ॥ ఆత్మధ్యానపరాయణాః = ఆత్మధ్యానమునందాసక్తికల, యోగినః = యోగులు, తోయరూపాణి = ఉదకరూపములయిన, తీర్థాని=తీర్థములను, పాషాణమృణ్మయాన్ = శిలామయములును మృణ్మయములును (అయిన), దేవాన్ = దేవతలను, నప్రపద్యంతే= సేవింపరు.

తా॥ ఆత్మధ్యానపరాయణులయినయోగులు ఉదకరూపములయినతీర్థములను శిలామయములును మృణ్మయములును అయినదేవతలను సేవింపరు అని తాత్పర్యము.

శ్లో॥ అగ్నిర్దేవోద్విజాతీనాం మునీనాంహృదిదైవతం
ప్రతిమాస్వల్పబుద్ధీనాం సర్వత్రవిదితాత్మనామ్॥ ౮

టీ॥ ద్విజాతీనామ్=బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, దేవః=దేవుఁడు, మునీనామ్ = మునులకు, హృది = హృదయమునందు, దైవతమ్=దై

వము, అస్తి=కలఁడు, స్వల్పబుద్ధీనామ్=మందబుద్ధులకు అనఁగా అజ్ఞానులకు, ప్రతిమా=విగ్రహము, దైవతమ్ = దైవము, భవతి = అగుచున్నాఁడు, విదితాత్మనామ్ = ఆత్మతత్త్వమునుదెలిసినవారికి, సర్వత్ర=అంతటనుదైవము, అస్తి=కలఁడు.

తా॥ బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు అగ్నిహోత్రుఁడు దేవుఁడు. మునులకు హృదయమునందు దైవముకలఁడు. స్వల్పమైనబుద్ధికలవారికి అనఁగా మందబుద్ధులకు విగ్రహము దైవమైయున్నది. బ్రహ్మజ్ఞానసంపన్నులకు అనఁగా ఆరూఢయోగులకు " శ్రు॥ సర్వంఖల్విదంబ్రహ్మ " కనుబడుచున్న యీప్రపంచమంతయును బ్రహ్మమే —అనునట్టి శ్రుతిప్రమాణానుసారముగ సర్వస్థలములయందును దైవముకలఁడని తాత్పర్యము.

☞ సూర్యుఁడుదయించి యందఱకును కనఁబడుచున్నను గ్రుడ్డివానికిఁ గనఁబడనివిధముగ అజ్ఞానికి జ్ఞాననేత్రములేదు కనుక సర్వస్థలములయందును పరిపూర్ణమైయున్న బ్రహ్మముకనఁబడదని యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపుచున్నాఁడని యెఱుఁగవలయును.

శ్లో॥ సర్వత్రావస్థితంశాంతం నప్రపశ్యేజ్జనార్దనం
జ్ఞానచక్షుర్విహీనత్వా దంధస్సూర్యమివోదితమ్॥ ౯

టీ॥ సర్వత్ర = అంతటను, అవస్థితమ్ = ఉన్నటువంటివాఁడును, శాంతమ్=నిర్వికారుఁడును, (అయిన) జనార్దనమ్ = వాసుదేవుని, ఉదితమ్ = ఉదయించిన, సూర్యమ్ = సూర్యుని, అంధఇవ = గ్రుడ్డివానివలె, జ్ఞానచక్షుర్విహీనత్వాత్=జ్ఞాననేత్రములేనివాఁడగుటవలన, నప్రపశ్యేత్=చూడఁడు.

తా॥ సర్వస్థలములయందును వ్యాపించియున్నవాఁడును నిరాకారుఁడును అయినవాసుదేవుని ఉదయించినసూర్యుని గ్రుడ్డివాఁడు చూడలేనివిధముగ అవివేకియగువాఁడు జ్ఞాననేత్రములేనివాఁడగుటవలన జూడఁజాలఁడని తాత్పర్యము.

శ్లో॥ యత్రయత్రమనోయాతి తత్రతత్రపరంపదం
తత్రతత్రపరంబ్రహ్మసర్వత్రసమవర్తతే॥ ౧౦

టీ॥ యత్రయత్ర = ఏయేవిషయములయందు, మనః = మనస్సు, యాతి=పోవుచున్నదో, తత్రతత్ర=అక్కడక్కడ, పరంపదమ్ = పరమపదము, అస్తి=కలదు, తత్రతత్ర=అక్కడక్కడ, పరంబ్రహ్మ = పరంబ్రహ్మము, అస్తి = కలదు, సర్వత్ర = అంతటను, పరంబ్రహ్మ=పరంబ్రహ్మము, సమవర్తతే=ఉన్నది.

తా॥ మనస్సు ఏయేవిషయములమీఁదికి పోవుచున్నదో అక్కడక్కడ పరమపదమున్నదనియును అక్కడక్కడ పరబ్రహ్మమున్నదనియును, తాత్పర్యము—అనఁగాఘటాదివిషయములు స్ఫురించుచున్నను ఆస్ఫురణానుభవమే బ్రహ్మమని తెలియునది. సర్వమును బ్రహ్మమునుగాఁ దలచుచున్నయోగికి సర్వమును ప్రత్యక్షమగుచుండునని స్పష్టము.

శ్లో॥ దృశ్యతేదృశిరూపాణి గగనంచాతినిర్మలం
అహామిత్యక్షరంబ్రహ్మ పరమంవిష్ణుమవ్యయమ్॥ ౧౧

టీ॥ యః = ఎవ్వఁడు, అహమితి = నేనని, భావయేత్ = భావనచేయునో, తస్య=అట్టివానికి, దృశి=దృక్కునందు, రూపాణి = రూపములు, దృశ్యతే=కనఁబడుచున్నవి; అతినిర్మలమ్=మిగులనిర్మలమైన, గగనమ్ = ఆకాశము, నీలమివ = నల్లనిదానివలె, దృశ్యతే=కనఁబడుచున్నది; (యస్య=ఎవనికి, ఆత్మానమ్ =తనను,) అక్షరమ్ = నాశములేనిదియును, పరమమ్ = సర్వోత్తమమును, అవ్యయమ్ = నాశములేనిదియును, విష్ణుమ్=సర్వవ్యాపకమును అయిన, బ్రహ్మ = బ్రహ్మమునుగా, జానాతి తెలిసికొనుచున్నాఁడో, తస్య=అతనికి, కిమపి = ఏదియును, నదృశ్యతే = కనఁబడుచుండలేదు.

తా॥ ఏపురుషుఁడు నేననియెడునభిమానముకలవాఁడగునో వానికి జ్ఞానమందు నామరూపాత్మకములయిన వస్తువులు కనఁబడుచున్నవి. మిగుల నిర్మలమగు నాకాశము నల్లనిదానివలెఁ గనఁబడుచున్నది. ఎవ్వఁడు తనను నాశరహితమును సర్వోత్తమమును శాశ్వతమును సర్వవ్యాపకమును అయినబ్రహ్మమునుగాఁ దలఁచుచున్నాఁడో వానికి బ్రహ్మముకంటె నితరమేదియును కనఁబడదని తాత్పర్యము. అతినిర్మలమైన యాకాశ మనేకవిధదృశ్యజాలములతోఁ గనఁబడునట్లు నేను బ్రహ్మననియెడునక్షరస్వరూపజ్ఞానము కలవాఁడే యీకనఁబడుచుండు నానావిధనామరూపాత్మకములతోడనిత్యపరమాత్మవస్తువును ప్రత్యక్షముగాఁ జూచుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ దృశ్యతేతుదివాకారం దివాకారంవిచింతయేత్
ఆత్మమధ్యేదివాకారం దివామధ్యేపిచాత్మకమ్॥ ౧౨

టీ॥ దివాకారమ్ = పగటివలెప్రకాశించుచున్నయాకృతి, దృశ్యతేతు=చూడఁబడుచున్నయెడల, ఆత్మానమ్ = తనను, దివాకారమ్ = పగటివలెఁబ్రకాశించుచున్నయాకారముకలవానినిగా, విచింతయేత్ = ఆలోచింపవలసినది; ఆత్మమధ్యే = తనయందు, దివాకారమ్ = ఆత్మస్వరూపమును, దివామధ్యే = పరమాత్మమధ్యయందు, ఆత్మకమ్=తనరూపమును, విచింతయేత్=ఆలోచింపవలయును.

తా॥ పగటివలెఁ బ్రకాశించుచున్న పరమాత్మస్వరూపము కనఁబడినయెడల తనను పగటివలెఁ బ్రకాశించుచున్న పరమాత్మనుగానే యాలోచింపవలయును. మఱియు నిటులనే ఆత్మమధ్యమందుతనను తనయందాత్మను జూడవలయునని తాత్పర్యము.

శ్లో॥ దృశ్యతేచేత్ఖగాకారం ఖగాకారంవిచింతయేత్
సకలంనిష్కళంసూక్ష్మం మోక్షద్వారేణనిర్గతమ్॥ ౧౩

టీ॥ ఖగాకారమ్=హంసస్వరూపముగుజీవాకారము, దృశ్యతేచేత్ = చూడఁబడినయెడల, తదా=అప్పుడు, ఆత్మానమ్ = తనను, ఖగాకారమ్=పరమాత్మస్వరూపమునుగా, విచింతయేత్=ఆలోచింపవలయును; అపిచ=యింతయగాక, ఆత్మానమ్= తనను, సకలమ్ = సంపూర్ణుఁడును, నిష్కళమ్ = నిరవయవుఁడును, సూక్ష్మమ్= సూక్ష్మరూపుఁడును, మోక్షద్వారేణనిర్గతమ్ = మోక్షద్వారము చేతబయలువెడలిన వాఁడును అని, విచింతయేత్=ఆలోచింపవలయును అనఁగా తలంపవలెను.

తా॥ హంసస్వరూపముగు జీవాకారము చూడఁబడినయెడల అప్పుడు తనను సంపూర్ణుఁడును నిరవయవుఁడును సూక్ష్ముఁడును మోక్షద్వారమునుండి బయలు వెడలినవానినిగా భావింపవలయును. అట్లు భావించి తననే బ్రహ్మమునుగా తలపవలయునని తాత్పర్యము.

శ్లో॥ అపవర్గస్యనిర్వాణం పరమంవిష్ణుమవ్యయమ్
సర్వతోజ్యోతిరాకాశం సర్వభూతాధివాసినమ్॥ ౧౪

శ్లో॥ సర్వత్రపరమాత్మానం బ్రహ్మాత్మాపరమవ్యయమ్
అహంబ్రహ్మేతియస్సర్వం విజానాతిచసర్వదా॥ ౧౫

శ్లో॥ హన్త్యాత్స్వయమరీన్సర్వా న్సర్వాశీసర్వవిక్రయీ
సర్వంనిషేధంకృత్వాపి కర్మభిర్నసబధ్యతే॥ ౧౬

టీ॥ బ్రహ్మాత్మా = బ్రహ్మభూతుఁడైన, యః = ఎవ్వఁడు, అపవర్గస్య = మోక్షముయొక్క, నిర్వాణమ్ = సుఖరూపమును, పరమమ్ = సర్వోత్తమమును, విష్ణుమ్ = సర్వవ్యాపకమును, అవ్యయమ్ = నాశములేనిదియును, సర్వతః = అంతటను, జ్యోతిః=ప్రకాశమును కలిగించునదియును, ఆకాశమ్=అంతటను ప్రకాశించుచున్నదియును, సర్వభూతాధివాసినమ్=సర్వభూతములకును ఆధారమైనదియును, సర్వత్ర = అంతటను, పరమాత్మానమ్ = పరమేశ్వరరూపమైనదియును, పరమ్ = శ్రేష్ఠమును, అవ్యయమ్=శాశ్వతమును, సర్వమ్ = సర్వరూపమును అయిన, బ్రహ్మ = బ్రహ్మము,

అహమ్=నేను, ఇతి=అని, సర్వదా = సర్వకాలములయందును, విజానాతి = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, స్వయమ్=తానుగానే, సర్వాన్ = సమస్తములయిన, అరీన్=శత్రువులను అనఁగా కామక్రోధలోభమోహమదమాత్సర్యములనెడు శత్రువులను, హన్యాత్ = చంపును, అపిచ=ఇంతయగాక, సర్వాశీ = నియమములేక సర్వమునుభుజించువాఁడును, సర్వవిక్రయీ = నియమము లేక సర్వమునువిక్రయించువాఁడును అయినప్పటికిని, సర్వమ్ = సమస్తమైన, నిషేధమ్ =నిషిద్ధకృత్యములను, కృత్వాపి=చేసియును, కర్మభిః = కర్మములచేత, నసబధ్యతే=బంధింపఁబడఁడు.

తా॥ బ్రహ్మభూతుడైన యేపురుషుఁడు, తనను, మోక్షసుఖమును కలుగఁజేయునట్టిదియును, సర్వోత్తమమును, సర్వవ్యాపకమును, నాశరహితమును, అంతటను ప్రకాశమును గలిగించునదియును, అంతటను ప్రకాశించుచున్నదియును, సర్వభూతములకును నివాసమును, అంతటను నిండియున్నదియును, శ్రేష్ఠమును శాశ్వతమును, అయిన బ్రహ్మమునుగాఁదలఁచుచున్నాఁడో అట్టివాఁడు స్వయముగానే అనఁగా సహాయమేదియునులేకయే కామక్రోధలోభ మోహమదమాత్సర్యములనియెడుశత్రువులను జయించును. మఱియును ఇంతయగాక నియమములేక సర్వమును భుజించినను సర్వపదార్థములను విక్రయించినను సకలనిషిద్ధకార్యములను జేసినను కర్మములచేత బంధింపఁబడఁడని తాత్పర్యము.

☞ క్షణమాత్రమయినను బ్రహ్మనిష్ఠయందుండుటవలనఁ గలిగెడు ఫలము మఱిదేనిచేతను కలుగదని యీక్రిందిశ్లోకములచేతఁ దెలుపుచున్నాఁడు.

శ్లో॥ నిమిషంనిమిషార్ధంవా జ్ఞానినోధ్యాత్మచింతయా
క్రతుకోటిసహస్రాణాం ధ్యానమేకంవిశిష్యతే॥ ౧౭

టీ॥ జ్ఞానినః=బ్రహ్మజ్ఞానికి, నిమిషమ్=క్షణమాత్రమైనను, నిమిషార్ధంవా=అరనిమిషమైనను, అధ్యాత్మచింతయా = ఆత్మధ్యానముచేత, యత్ = ఏ, ఫలమ్=ఫలము, జాయతే=కలుగుచున్నదో, తత్ = ఆఫలము, క్రతుకోటిసహస్రాణామ్ =అనేకవేల కోట్లయజ్ఞములయొక్క, కరణేన = చేయుటచేత, నజాయతే =పుట్టదు, తతః=అందువలన, ఏకమ్ = ఒక్కటైన, ధ్యానమ్ =ఆత్మధ్యానము, విశిష్యతే=అధికమైనదగుచున్నది.

తా॥ బ్రహ్మజ్ఞానికి క్షణమునేపైనను అరనిమిషమునేపైనను ఆత్మధ్యానముచేత ఏఫలముకలుగుచున్నదో అట్టిఫలము అనేకవేలకోట్లయజ్ఞములను చేయుటచేతఁ గూడ కలుగదు కనుక ఆత్మధ్యానము అన్నిటికంటె నధికమైనదని తాత్పర్యము

శ్లో॥ నిమిషంనిమిషార్థంవా శీతాశీతనివారణమ్
అచలాకేశవేభక్తి ర్విభవైఃకింప్రయోజనమ్॥ ౧౮

టీ॥ నిమిషమ్ = క్షణమునేపైనను,నిమిషార్థంవా=అరనిమిషమయినను, శీతాశీతనివారణమ్ = శీతోష్ణములనివృత్తిని, కృత్వా = చేసి, కేశవే = నారాయణునియందు, అచలా = అచంచలమైనటువంటి—అనఁగా చలించనటువంటి, భక్తిః = భక్తి, స్యాచ్చేత్ = అయ్యెనేని, విభవైః = ఐశ్వర్యములతో, ప్రయోజనమ్=పని, కిమ్ = ఏమి, అస్తి=కలదు.

తా॥ క్షణమునేపైనను అరక్షణమునేపైనను శీతోష్ణములను సహించి కేశవునియందు అనఁగా నారాయణునియందెవ్వనికి అచంచలభక్తికలదో అట్టివానికి ఐశ్వర్యములతోఁ బనియేమనితాత్పర్యము.

శ్లో॥ నిమిషంనిమిషార్థంవా యత్రతిష్ఠతియోగినః
తత్రతత్రకురుక్షేత్రం ప్రయాగోనైమిశంవనమ్॥ ౧౯

టీ॥ నిమిషంవా = క్షణమునేపైనను- నిమిషార్థంవా=అరక్షణము నేపైనను, యత్రయత్ర = ఎక్కడెక్కడ, యోగినః = యోగులు, తిష్ఠతి =ఉన్నారో, తత్రతత్ర = అక్కడక్కడ, కురుక్షేత్రమ్ = కురుక్షేత్రము, ప్రయాగః =ప్రయాగయను క్షేత్రము, నైమిశమ్=నైమిశమనుపేరుగల, వనమ్ = వనము, భవతి = అగుచున్నది.

తా॥ క్షణమునేపైనను అరక్షణమునేపైనను యోగులు అనఁగా స్వానుభవముకల బ్రహ్మజ్ఞానులు నివసించియున్నచోటు కురుక్షేత్రము ప్రయాగనైమిశారణ్యము అనియెడుపుణ్యక్షేత్రములవంటి దగునని తాత్పర్యము.

శ్లో॥ భిక్షాన్నందేహరక్షార్థం కంథాశీతనివారణమ్
అశ్మానంచహిరణ్యంచ శాకంశాల్యోదనంతథా
సమానంచింతయేద్యోగీసూక్ష్మతత్త్వమపేక్షతే॥ ౨౦

టీ॥ దేహరక్షార్థమ్ = దేహసంరక్షణకొఱకు, భిక్షాన్నమ్ = భిక్షాన్నమును, శీతనివారణమ్ = శీతమునుపోగొట్టునట్టి, కంథా = బొంతయనుకోరుతూ, అశ్మానమ్ = ఱాయియును, హిరణ్యంచ = బంగారమును, తథా = ఆవిధముగా, శాకమ్ = కూరయును, శాల్యోదనమ్=శాల్యన్నమును, సమానమ్ = సమముగా, యః =ఏ, యోగీ = యోగియగువాఁడు, చింతయేత్ = తలంచునో, సః = ఆయోగి, సూక్ష్మతత్త్వమ్=సూక్ష్మమైనతత్త్వమును, అపేక్షతే=కోరుచున్నాఁడు.

26992
23.3.73

తా॥ దేహసంరక్షణముకొఱకుమాత్రము భిక్షాన్నమునుగోరుతూ, శీతబాధను పోఁగొట్టుటకుగాను బొంతను ధరించినవాఁడై, ఱాతిని బంగారమును శాకమును శాల్యన్నమును సమముగాఁ దలచునట్టి యోగి సూక్ష్మతత్త్వమును తెలిసినవాఁ డగుచున్నాఁడని తాత్పర్యము. భిక్షాన్నము ఇంద్రియప్రీతికొఱకు గాదనియు, వస్త్రము అలంకారార్థము గాదనియు తెలియవలయును.

శ్లో॥ తస్మాద్బ్రహ్మవిదేదేయం యద్యస్తివస్తుకించిత్
కుక్షౌతిష్ఠతియస్యాన్నం యోగాభ్యాసేనజీర్యతే
సనిస్తరతిదాతారం దశపూర్వాన్దశాపరాన్॥ ౨౧

టీ॥ కించిత్=కొంచెమైనను, యత్ = ఏ, వస్తు = వస్తువు, అస్తి=కలదో, తత్=ఆవస్తువును, బ్రహ్మవిదే = బ్రహ్మవేత్తకొఱకు, దేయమ్=ఈయఁదగినది; యస్య =ఎవనియొక్క. అన్నమ్=అన్నము. యతేః = యతియొక్క, కుక్షౌ = కుక్షియందు, తిష్ఠతి =ఉన్నదో, యోగాభ్యాసేన = యోగాభ్యాసముచేత, జీర్యతే = జీర్ణమగుచున్నదో, సః=ఆయతి, దాతారమ్=దాతను, దశపూర్వాన్ = పదిమందిపూర్వులను, దశాపరాన్=పదిమందిని పిమ్మటివారిని, నిస్తరతి = తరింపఁ జేయుచున్నాఁడు.

తా॥ ఏదైనను కొంచెము ధనమున్నను దానిని యతికి సమర్పింపవలయును. యోగాభ్యాసముకలయతియొక్క కుక్షియందు అన్నమునుపెట్టి జీర్ణింపఁజేసినవాఁడు అనఁగా యతికి అన్నమునుపెట్టినవాఁడు పదిమందిపూర్వులను పదిమంది పిమ్మటివారిని తరింపఁజేయుచు తానుకూడ తరించునని తాత్పర్యము. ఇరువదియొక్క తరమువారు అనఁగా యిరువదియొక్కతరమువారును తరింతురని తెలియవలయును.

శ్లో॥ యతిర్యస్యగృహేభుంక్తే తస్యభుంక్తేహరిస్స్వయం
హరిర్యస్యగృహేభుంక్తే తస్యభుంక్తేజగత్త్రయమ్॥ ౨౨

టీ॥ యతి = సన్న్యాసి, యస్య = ఎవ్వనియొక్క, గృహే = గృహమందు, భుంక్తే = అన్నమునుతినుచున్నాఁడో, తస్య=అతనియొక్క, గృహే = గృహమునందు, హరిః=నారాయణుఁడు, స్వయమ్ = స్వయముగా, భుంక్తే =భుజించుచున్నాఁడు; యస్య = ఎవ్వనియొక్క, గృహే = గృహమునందు, హరిః =నారాయణుఁడు, భుంక్తే=అనుభవించుచున్నాఁడో, తస్య = అతనియొక్క, గృహే= గృహమునందు, జగత్త్రయమ్=లోకత్రయమును, భుంక్తే=అన్నమునుతినుచున్నది.

తా॥ సన్న్యాసి ఎవ్వనియొక్క గృహమునందు భుజించుచున్నాఁడో అతనియొక్క గృహమునందు నారాయణుఁడు భుజించుచున్నాఁడు. ఎవ్వనియొక్క గృహమునందు నారాయణుఁడు భుజించుచున్నాఁడో అతనిగృహమునందు లోకత్రయము భుజించుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ యతిహస్తేజలందద్యా ద్భైక్షందద్యాత్పునఃపునః
తద్భైక్షంమేరుణాతుల్యం తజ్జలంసాగరోపమమ్॥ ౨౩

టీ॥ యతిహస్తే = యతియొక్కహస్తమందు, జలమ్ = ఉదకమును, దద్యాత్ =ఈయవలయును; పునఃపునః=మాటిమాటికిని, భైక్షమ్ = భిక్షాన్నమును, దద్యాత్ =ఈయవలయును, తత్=ఆ, భైక్షమ్ = భిక్షాన్నము, మేరుణా =మేరుపర్వతముతో, తుల్యమ్=సమానము. భవతి = అగుచున్నది; తత్=ఆ, జలమ్ = ఉదకము, సాగరోపమమ్=సముద్రముతోసమానమైనది, భవతి=అగుచున్నది.

తా॥ యతియొక్కహస్తమం దుదకమును సమర్పింపవలయును. మఱియును యతికి భిక్షమును సమర్పింపవలయును. ఆభిక్షము మేరువుతో సమానమైనదియును ఆజలము సముద్రముతో సమానమైనదియును అగునని తాత్పర్యము.

శ్లో॥ ద్వేబ్రహ్మణీవేదితవ్యే శబ్దబ్రహ్మాపరంచతత్
శబ్దబ్రహ్మణినిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి॥ ౨౪

టీ॥ శబ్దబ్రహ్మ = శబ్దబ్రహ్మము, తత్ = ఆ, పరంచ = పరబ్రహ్మయును అనునట్టి, ద్వే=రెండువిధములయిన, బ్రహ్మణీ = బ్రహ్మములు, వేదితవ్యే=తెలియఁదగినవి, శబ్దబ్రహ్మణి = శబ్దబ్రహ్మమునందు, నిష్ణాతః = ఉన్నవాఁడు, పరబ్రహ్మ = పరబ్రహ్మమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా॥ శబ్దబ్రహ్మముపరబ్రహ్మము అనునట్టి రెండువిధములయిన బ్రహ్మములు తెలియఁదగినవి. శబ్దబ్రహ్మమునందున్నవాఁడు పరబ్రహ్మమును పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ ధ్యానాఖ్యయోగారణిదీపితేన పంచాత్మకంధర్మగుణేంధనేన
యోగాగ్నినావాయుసమన్వితేన దగ్ధంయుగాంతేఖిలకర్మబంధమ్॥

టీ॥ ధ్యానాఖ్యయోగారణి = ధ్యానమనియెడుపేరుకల యోగమనియెడు అరణియందు, దీపితేన = ప్రజ్వలింపఁజేయఁబడినదియును, పంచాత్మకమ్ =పంచభూతాత్మకమై, ధర్మగుణేంధనేన = ధర్మగుణమనియెడుకట్టెలతోను, వాయుసమన్వితేన = వాయువుతోకూడినదయిన, యోగాగ్నినా =యోగమనియెడునిప్పుచేత, యుగాంతే = యుగాంతమందు, అఖిలకర్మబంధమ్ = సమస్తమైనకర్మబంధములును, దగ్ధమ్ = కాల్పఁబడును.

తా॥ ధ్యానమనియెడుపేరుగల యోగారణియందు ప్రజ్వలింపఁజేయఁబడినదియును, పంచభూతాత్మకమై ధర్మగుణమనియెడు కట్టెలతోను వాయువుతోను గూడిన యోగమనియెడు నిప్పుచేత సమస్తకర్మబంధములు దహింపఁబడును. అనఁగా యోగాగ్ని సమస్తసంచితకర్మములను కాల్చివేయునని తెలియవలయును.

శ్లో॥ అహిమివజనయోగం సర్వదావర్జయేద్యః
కుణపమివచనారీం త్యక్తకామోవిరాగీ
విషమివవిషయాప్తిం మన్యమానోదురంతాం
జగతిపరమహంసో ముక్తిభావంసమేతి॥ ౯౬

టీ॥ యః=ఎవ్వఁడు, జనయోగమ్ = జనసంబంధమును, అహిమివ = సర్పమునువలె, సర్వదా = సర్వకాలములయందును, వర్జయేత్ = విడిచిపెట్టునో, యః=ఎవ్వఁడు, త్యక్తకామః = విడువఁబడినకోర్కెగలవాఁడును, విరాగీ = విరాగము కలవాఁడును, (భూత్వా = అయి), నారీమ్=స్త్రీని, కుణపమివచ = శవమునువలె, వర్జయేత్=విడిచిపెట్టునో, దురంతామ్ = దుఃఖము అంతమందుగల, విషయాప్తిమ్=విషయప్రాప్తిని, విషమివ=విషమునువలె, మన్యమానః=తలఁచుచున్నవాఁడై, యః=ఎవ్వఁడు, వర్జయేత్=విడిచిపెట్టునో, సః=అటువంటి, పరమహంసః=సన్న్యాసి, జగతి=జగత్తునందు, ముక్తిభావమ్=మోక్షమును, సమేతి=పొందుచున్నాఁడు.

తా॥ సర్పముతోఁ జెలిమివిడుచునటుల ఉత్తముఁడగుసన్న్యాసి సర్వకాలములయందును జనసంబంధమును విడువవలయును; విరాగియై స్త్రీనిశవమునువలె చూడవలయును. మఱియును, విషమునువిడిచినవిధముగ దుఃఖాంతమైనభోగేచ్ఛను విడువవలయును. ఇట్టి పరమహంస యవశ్యముగ ముక్తినిపొందునని తాత్పర్యము.

శ్లో॥ యథారవిస్సర్వరసాన్ప్రభుంక్తే హుతాశనశ్చాపిహిసర్వభక్షః
తథైవయోగీవిషయాన్ప్రభుంక్తే నలిప్యతేకర్మశుభాశుభాభ్యామ్॥

టీ॥ రవిః=సూర్యుఁడు, యథా=ఏవిధముగా, సర్వరసాన్ = సకలరసములను, ప్రభుంక్తే=అనుభవించుచున్నాఁడో, యథా = ఏవిధముగా, హుతాశనశ్చాపిహి = అగ్నిహోత్రుఁడు, సర్వభక్షః = సర్వమునుభక్షించువాఁడు, (భవతి=అగుచున్నాఁడో), తథైవ=అటులనే, (యః=ఎవ్వఁడు), విషయాన్=విషయములను, ప్రభుంక్తే=అనుభవించుచున్నాఁడో, (సః = అటువంటి,) యోగీ = యోగియగువాఁడు, కర్మశుభాశుభాభ్యామ్ = శుభాశుభకర్మములచేత, నలిప్యతే = లిప్తుండుకానేరఁడు.

తా॥ సూర్యుఁడు రసములనుభుజించినప్పటికిని మేధ్యామేధ్యసంయోగము కలవాఁడు కానివిధముగను, అగ్నిహోత్రుఁడు సర్వభక్షకుఁడయ్యును మేధ్యామేధ్య సంబంధము లేనివాఁడగువిధమునను, యోగియగువాఁడు విషయములను అనుభవించినను శుభాశుభకర్మములచేత బద్ధుఁడుకానేరఁడని తాత్పర్యము.

శ్లో॥ సమానంచింతయేద్యోగీ యదిచింత్యమపేక్షతే
సర్వచింతావినిర్ముక్తం తన్నిత్యమచలంధ్రువమ్॥ ౨౭

టీ॥ యోగీ = యోగియగువాఁడు, సర్వచింతావినిర్ముక్తమ్ = సర్వవిచారములచేతనువిడువఁబడినదియును, నిత్యమ్=నిత్యమును, అచలమ్ = చలనరహితమును, ధ్రువమ్=శాశ్వతమును, చింత్యమ్=విచారింపఁదగినదియును అయిన, తత్=ఆబ్రహ్మమును, అపేక్షతేయది=కోరినయెడల, సర్వమ్ = సమస్తమును, సమానమ్ = సమానముగా, చింతయేత్=విచారింపవలయును.

తా॥ యోగియగువాఁడు సర్వవిచారములచేతను విడువఁబడినదియును నిత్యమును చలనరహితమును శాశ్వతమును, విచారింపఁదగినదియును, అయిన బ్రహ్మమును అపేక్షించినయెడల సర్వమును సమానముగా ఆలోచింపవలయును అనఁగా తలంచవలెను అని తాత్పర్యము.

శ్లో॥ భూతవస్తున్యశోచిత్వే సిద్ధేచాగామివస్తుని
సిద్ధేచనిరపేక్షత్వే పునర్జన్మనవిద్యతే॥ ౨౮

టీ॥ భూతవస్తుని=గతించినవస్తువు, అశోచిత్వేసతి = వ్యసనమునుపొందఁదగినది కానిదగుచునుండఁగను, సిద్ధే = సంప్రాప్తమైనవస్తువునందును, ఆగామివస్తునిచ =రాఁదగినవస్తువునందును, నిరపేక్షత్వే = అపేక్షారాహిత్యము, సిద్ధేసతి = సిద్ధమైనదగుచునుండఁగను, పునః=మరల, జన్మ=జన్మము, నవిద్యతే=లేదు.

తా॥ గతించినవస్తువునందు దుఃఖములేమియును సంప్రాప్తమైనవస్తువునందును రాఁదగినవస్తువునందును అపేక్షారాహిత్యము కలుగుచునుండఁగా మరల జన్మము కలుగదు. అనఁగా ముక్తుఁడగును అని యెఱుఁగవలసినదని తాత్పర్యము.

శ్లో॥ జన్మమృత్యుసుఖదుఃఖవర్జితం జాతినీతికులగోత్రదూరగం
చిద్వివర్తజగతోఽస్యకారణం తత్సదాహమితిమానమాశ్రయ॥ ౩౦

టీ॥ జన్మమృత్యుసుఖదుఃఖవర్జితమ్=జననము మరణము సుఖము దుఃఖము అనువానిచేతవిడువఁబడినదియును, జాతినీతికులగోత్ర దూరగమ్ = జాతి నీతి కులము గోత్రము అనునవిలేనిదియును, అస్య = ఈ, వివర్తజగతః = వివర్తాకారమైనజగత్తునకు, కారణమ్ = సాధనమును, చిత్ = స్వయంప్రకాశమానమును, అయిన, తత్ = ఆపరబ్రహ్మము, అహమ్ = నేను, ఇతి=ఇట్లని, సదా = ఎల్లప్పుడును, మానమ్ = మానమును, ఆశ్రయ=ఆశ్రయింపుము.

తా॥ జననము మరణము సుఖము దుఃఖము అనునవిలేనిదియును, జాతి నీతి కులము గోత్రము అనునవియును లేనిదియును, వివర్తజగత్తునకు కారణమును, స్వయంప్రకాశమును అయిన పరబ్రహ్మము నేనని తలఁచి సర్వకాలములయందును మౌనమును ఆశ్రయింపుమని తాత్పర్యము.

శ్లో॥ సత్యచిద్ఘనమఖండమద్వయం సర్వదృశ్యరహితంనిరామయం
యత్పదంవిమలమక్షరంశివంతత్సదాహమితిమౌనమాశ్రయ॥౩౦

టీ॥ సత్యచిద్ఘనమ్=సద్ఘనమును చిద్ఘనమును అయినదియును, అఖండమ్=తెంపులేనిదియును అనఁగా అఖండాకారమును, అద్వయమ్ = ఏకమును అనఁగా ద్వయదోషరహితమును, సర్వదృశ్యరహితమ్ = సకలదృశ్య ప్రపంచరహితమును, నిరామయమ్ = నిర్వికారమును, విమలమ్ = నిర్మలమును, అక్షరమ్ = నాశరహితమును, శివమ్=మంగళకరమును అయిన, పదమ్ = స్థానము, యత్ = ఏదికలదో, తత్ = ఆపరబ్రహ్మము, అహమితి = నేనని, సదా = ఎల్లప్పుడును, మౌనమ్ = మౌనమును, ఆశ్రయ=ఆశ్రయింపుము.

తా॥ సద్ఘనమును చిద్ఘనమును అఖండమును అద్వయమును సమస్తప్రపంచరహితమును నిరామయమును నిర్మలమును నాశరహితమును మంగళకరమును అయినస్థానమేదికలదో ఆపరబ్రహ్మమే నేనని తలఁచి సర్వకాలములయందును ఆశ్రయింపుము అనితాత్పర్యము.

శ్లో॥ పూర్ణమద్వయమఖండచేతనం విశ్వభేదకలనాదివర్జితం
అద్వితీయపరసంవిదంశకం తత్సదాహమితిమౌనమాశ్రయ॥౩౧

టీ॥ పూర్ణమ్ =సంపూర్ణమును, అద్వయమ్ = రెండవదిలేనిదియును, అఖండచేతనమ్ = తెంపులేనిచేతనమును, విశ్వభేదకలనాదివర్జితమ్ = విశ్వభేదకలనశూన్యమును, అద్వితీయపరసంవిదంశకమ్ = భేదరహితమును పరమజ్ఞానరూపమును, అయిన, తత్ =ఆపరబ్రహ్మము, అహమితి = నేనని, సదా = సర్వకాలములయందును, మౌనమ్=మౌనమును, ఆశ్రయ=ఆశ్రయింపుము.

తా॥ పరిపూర్ణమును, అద్వయమును, అఖండమును, అచేతనమును, ప్రపంచముకంటె భిన్నముకానిద్దియును, అద్వితీయమును, పరమజ్ఞానరూపమును, అయిన పరబ్రహ్మము నేనని సర్వకాలములయందును దలచి మౌనము నాశ్రయించి యుండవలసినదని తాత్పర్యము.

శ్లో॥ ఆత్మయోగమవోచద్యో భక్తియోగశిరోమణిం
తంవందేపరమానందం నందనందనమీశ్వరమ్॥ 33

టీ॥ యః = ఏభగవంతుఁడు, భక్తియోగశిరోమణిమ్ = శ్రేష్ఠమైనభక్తియోగమైన, ఆత్మయోగమ్=ఆత్మయోగమును, అవోచత్=చెప్పెనో, పరమానందమ్= పరమానందస్వరూపుఁడును, ఈశ్వరమ్ = సర్వజగన్నియామకుఁడును, నందనందనమ్ = నందునకుపుత్త్రుఁడును (అయిన)తమ్ = ఆశ్రీకృష్ణభగవానుని, వందే = నమస్కరించుచున్నానని అర్జునుఁడుచెప్పుచున్నాఁడు.

తా॥ భక్తియోగములలో శ్రేష్ఠమైనయాత్మయోగము నుపదేశించినవాఁడును, పరమానందరూపుఁడును, నందపుత్త్రుఁడును, సర్వజగన్నియామకుఁడును అయినశ్రీకృష్ణభగవానుని నమస్కరించుచున్నానని అర్జునుఁడు చెప్పుచున్నాఁడు అనితాత్పర్యము.

గద్య॥ ఇతి శ్రీమహాభారతే శాతసాహస్రసంహితాయాం వైయాసిక్యాం శ్రీమదశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే తుర్యజ్ఞానయోగోనామ తృతీయోధ్యాయః॥

టీ॥ శాతసాహస్రసంహితాయామ్ = ఛందోబద్ధములయిననూరువేల శ్లోకములుకలదియును, వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్తమును (అయిన) శ్రీమహాభారతే = సంపత్కరమైన మహాభారతమునందలి, అశ్వమేధపర్వణి = అశ్వమేధపర్వమునందు, శ్రీభగవదుత్తరగీతాసు = సంపత్కరుఁడగు భగవంతునిచేతఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు =వేదాంతములయందు, బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మజ్ఞానమందు, యోగశాస్త్రే = యోగశాస్త్రమునందు. (బ్రహ్మజ్ఞానసాధనములను బోధించునట్టిగ్రంథమునందు) శ్రీకృష్ణార్జునసంవాదే = శ్రీకృష్ణార్జునులసంభాషణమందు, తుర్యజ్ఞానయోగోనామ = తుర్యజ్ఞానయోగమనుపేరుకల, తృతీయః = మూఁడవదైన, అధ్యాయః =భాగము, ఇతి=ముగిసెను.

తా॥ నూరువేలశ్లోకములు కలదియును వ్యాససంబంధమైనదియును అయిన మహాభారతమునందలి యశ్వమేధపర్వమునందు కృష్ణార్జునుల సంవాదరూపమును బ్రహ్మజ్ఞానవిషయకోపాయములను దెలుపునదియును అయిన యుత్తరగీతలయందు తుర్యజ్ఞానమనియెడు మూఁడవయధ్యాయము ముగిసెను.

—:o:—

# ఓం

శ్రీకృష్ణాయపరబ్రహ్మణేనమః.

## శ్రీభగవదుత్తరగీత—యోగశాస్త్రము.

### చతుర్థోధ్యాయః.

### అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ ఓంకారస్యతుమాహాత్మ్యం రూపంస్థానంపరంతథా
తత్సర్వంశ్రోతుమిచ్ఛామి బ్రూహిమేపురుషోత్తమ॥ ౧

టీ॥ హే పురుషోత్తమ = పురుషశ్రేష్ఠుఁడవైనయోకృష్ణుఁడా ! ఓంకారస్యతు=ఓంకారముయొక్క, మాహాత్మ్యమ్ = మహిమము, రూపమ్ = రూపము, తథా= అటులనే, పరమ్=సర్వోత్తమమైన, స్థానమ్ = స్థానము, అనునట్టి, తత్=ఆ, సర్వమ్=సమస్తమును, శ్రోతుమ్ = వినుటకొఱకు, ఇచ్ఛామి = యిచ్ఛయించుచున్నాను. మే=నాకొఱకు, బ్రూహి=చెప్పుము.

తా॥ పురుషోత్తముఁడైనయోకృష్ణా ! ఓంకారముయొక్క మహిమము రూపము స్థానము మొదలగునవియన్నియును వినవలయునని కోరుచున్నాను. కాఁబట్టి నాకుఁజెప్పుమని తాత్పర్యము.

### శ్రీభగవానువాచ.

సంపత్కరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అయిన కృష్ణుఁడుచెప్పుచున్నాఁడు.

శ్లో॥ సాధుపార్థమహాబాహో యన్మాంత్వంపరిపృచ్ఛసి
విస్తరేణప్రవక్ష్యామి తత్తేనిగదితంశ్రుణు॥ ౨

టీ॥ మహాబాహో =అధికమయిన భుజబలముకల, పార్థ = ఓయర్జునుఁడా ! యత్ = దేనినయితే, త్వమ్ =నీవు, మామ్ = నన్ను, సాధు=చక్కఁగా, పృచ్ఛసి= అడుగుచున్నావో, తత్=దానిని, విస్తరేణ = అధికముగా, తే=నీకొఱకు, ప్రవక్ష్యామి=చెప్పుచున్నాను, నిగదితమ్=చెప్పఁబడుదానిని, శ్రుణు=వినుము.

తా॥ అధికమైన పరాక్రమముగల యోయర్జునుడా ! నీవు చక్కనిప్రశ్నమును జేసితివి. కావున నీకు సర్వమును సంపూర్ణముగఁ జెప్పెదను. సావధానచిత్తుఁడవై వినుమని తాత్పర్యము.

శ్లో॥ పృథివ్యగ్నిశ్చఋగ్వేదో భూరిత్యేవపితామహః
అకారేతులయంప్రాప్తే ప్రథమేప్రణవాంశకే॥ ౩

టీ॥ ప్రథమే=మొదటిదైన, ప్రణవాంశకే = ప్రణవభాగమైన, అకారేతు =అకారము, లయమ్ = లయమును, ప్రాప్తేసతి = పొందినదగుచునుండఁగా, పృథివి=భూమియును, అగ్నిశ్చ=అగ్నియును, ఋగ్వేదః = ఋగ్వేదమును, భూః=భూలోకమును, పితామహః=బ్రహ్మ, ఇత్యేవ=ఇట్లని, భవతి=అగుచున్నది.

తా॥ మొదటిప్రణవభాగమైన యకారము లయమునుపొందినదగుచుండఁగా భూమి యగ్ని ఋగ్వేదము బ్రహ్మ అనునవికలుగుచున్నవని తాత్పర్యము.

శ్లో॥ అంతరిక్షంయజుర్వేదో భువోవిష్ణుస్సనాతనః
ఉకారేతులయంప్రాప్తే ద్వితీయేప్రణవాంశకే॥ ౪

టీ॥ ద్వితీయే = రెండవదైన, ప్రణవాంశకే = ప్రణవభాగమైన, ఉకారేతు=ఉకారము, లయమ్ = లయమును, ప్రాప్తేసతి=పొందినదగుచునుండఁగా, అంతరిక్షమ్=అంతరిక్షలోకము, యజుర్వేదః = యజుర్వేదము, భువః=భువర్లోకము, సనాతనః=ప్రాచీనుఁడైన, విష్ణుః=విష్ణువును, జాయంతే=పుట్టుచున్నారు.

తా॥ రెండవప్రణవభాగమైన యుకారము లయమునుపొందినదగుచునుండగా అంతరిక్షలోకము యజుర్వేదము భువర్లోకము సనాతనుఁడగువిష్ణువును పుట్టుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ ద్యౌస్సూర్యస్సామవేదశ్చ స్వరిత్యేవమహేశ్వరః
మకారేతులయంప్రాప్తే తృతీయేప్రణవాంశకే॥ ౫

టీ॥ తృతీయే=మూఁడవదైన, ప్రణవాంశకే = ప్రణవభాగమైన, మకారేతు=మకారము, లయమ్ = లయమును, ప్రాప్తేసతి =పొందినదగుచునుండఁగా, ద్యౌః=ద్యులోకము, సూర్యః=సూర్యుఁడు, సామవేదశ్చ = సామవేదమును, స్వః=స్వర్గలోకము, మహేశ్వరః=మహేశ్వరుఁడు, ఇత్యేవ = ఇట్లని, జానీయాత్ = తెలియవలయును.

తా॥ ప్రణవమునందలి మూఁడవభాగమగు మకారము లయమునుపొందినదగుచునుండఁగా ద్యులోకము సూర్యుఁడు సామవేదము స్వర్గలోకము మహేశ్వరుఁడు అనునవి పుట్టెనని తాత్పర్యము.

శ్లో॥ అకారఃపీతవర్ణశ్చ రజోగుణసముద్భవః
ఉకారశ్శుక్లవర్ణశ్చ సత్త్వగుణసముద్భవః॥ ౬

టీ॥ అకారః=అకారము, పీతవర్ణశ్చ = పచ్చనివర్ణముకలదియును, రజోగుణసముద్భవః = రజోగుణమువలనఁబుట్టినదియును, భవతి = అగుచున్నది. ఉకారః=ఉకారము, శుక్లవర్ణశ్చ = శుక్లవర్ణముకలదియును, సత్త్వగుణసముద్భవః = సత్త్వగుణమువలనఁబుట్టినదియును, భవతి=అగుచున్నది.

తా॥ అకారము పచ్చనివర్ణముకలదియును రజోగుణమువలనఁ బుట్టినదనియును, ఉకారము శుక్లవర్ణముకలదియును సత్త్వగుణమువలనఁ బుట్టినదనియును తెలియవలయునుఅనితాత్పర్యము.

శ్లో॥ మకారఃకృష్ణవర్ణశ్చ తమోగుణసముద్భవః॥ ౭

శ్లో॥ అకారేచఉకారేచ మకారేచధనంజయ
ఇదమేకంసునిష్పన్న మోమితిజ్యోతిరూపకమ్॥ ౮

టీ॥ మకారః=మకారము, కృష్ణవర్ణశ్చ = కృష్ణవర్ణముకలదియును, తమోగుణసముద్భవః=తమోగుణమువలనఁబుట్టినదియును, భవతి = అగుచున్నది. ధనంజయ =ఓ అర్జునుఁడా ! అకారేచ=అకారమునందును, ఉకారేచ =ఉకారమునందును, మకారేచ =మకారమునందును, జ్యోతిరూపకమ్ = జ్యోతిస్స్వరూపమైనదియును, ఏకమ్=ఒక్కటియును, అయిన, ఇదమ్ =ఈ; ఓమితి = ఓంఅనునక్షరము, సునిష్పన్నమ్=పుట్టినది, భవతి=అగుచున్నది.

తా॥ మకారము కృష్ణవర్ణముకలదియనియును, తమోగుణమువలనఁ బుట్టినదనియును తెలియవలయును; మఱియును, ఓఅర్జునుఁడా ! అకారోకారమకారములనునట్టి మూఁటియందును జ్యోతిరూపమగు నోంకారము పుట్టెనని యెఱుఁగవలయునని తాత్పర్యము.

శ్లో॥ త్రిస్థానంచత్రిమాత్రంచ త్రిబ్రహ్మాత్ర్యక్షరంతథా
త్రిమాత్రమర్థమాత్రంచ ప్రణవస్యవిశేషతః॥ ౯

శ్లో॥ అష్టాంగంచచతుష్పాదం త్రిస్థానంపంచదైవతమ్
ఓంకారంయోనజానాతి బ్రాహ్మణోనసబ్రాహ్మణః॥ ౧౦

టీ॥ ప్రణవస్య=ప్రణవముయొక్క, త్రిస్థానమ్ = మూఁడువిధములయినస్థానములను, త్రిమాత్రమ్=మూఁడుమాత్రలను, త్రిబ్రహ్మ = బ్రహ్మత్రయమును, త్ర్యక్షరమ్ =అక్షరత్రయమును, త్రిమాత్రమ్ = మాత్రత్రయమును, అర్ధమాత్రంచ = అర్ధమాత్రమును, విశేషతః = విశేషముగా, అష్టాంగంచ = అష్టాంగములను, చతుష్పాదమ్ = పాదచతుష్టయమును, త్రిస్థానమ్ = స్థానత్రయమును, పంచదైవతమ్=దేవతాపంచక

మును కల, ఓంకారమ్ = ఓంకారమును, యః = ఏ, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, నజానాతి=ఎఱుఁగఁడో, సః = వాఁడు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, న = కాఁడు.

తా॥ ప్రణవముయొక్క స్థానత్రయమును, బ్రహ్మత్రయమును, అక్షరత్రయమును, త్రిమాత్రలను, అర్ధమాత్రమును, అష్టాంగములను, చతుష్పాదములను, స్థానత్రయమును, దేవతాపంచకమును, ప్రణవస్వరూపమును, ఏబ్రాహ్మణుఁడు ఎఱుఁగఁడో వాఁడు బ్రాహ్మణుఁడు కాఁడని తాత్పర్యము.

శ్లో॥ ఓమిత్యేవపరంరూపం పరంబ్రహ్మప్రవర్తితం
ఓంకారేతుప్రవిష్టోహం ప్రభవఃప్రళయస్తథా॥ ౧౧

శ్లో॥ ప్రణవేసర్వగందేవ మేకీకృత్యసమభ్యసేత్॥ ౧౨

టీ॥ ఓమిత్యేవ=ఓం అనియెడునక్షరము, పరమ్ = సర్వోత్తమమైన, రూపమ్= =రూపముగల, పరంబ్రహ్మ = పరబ్రహ్మస్వరూపమై, ప్రవర్తితమ్ = ప్రవర్తింపఁజేయఁబడినది; ఓంకారేతు=ఓంకారమునందు, అహమ్ = నేను, ప్రవిష్టః =ప్రవేశించినవాఁడను; ప్రళయః=ప్రళయము, తథా=అవిధముగానే, ప్రభవః = పుట్టెను; సర్వగమ్ =సమస్తమునుపొందిన, దేవమ్ = దేవుని, ఏకీకృత్యమ్ = ఒక్కటిగాఁజేసి, ప్రణవే= ప్రణవమునందు, సమభ్యసేత్=అభ్యసింపవలయును.

తా॥ సర్వోత్తమమైన రూపముగల పరబ్రహ్మస్వరూపమయిన ఓం అను నక్షరమునందు నేను ప్రవేశించియున్నాను. ఆయోంకారమునందు ప్రళయముకలుగుచున్నది. అట్టియోంకారమునందు బ్రహ్మమును ఏకీభవింపఁజేసి అభ్యసింపవలసినదని తాత్పర్యము.

శ్లో॥ భూర్భువస్స్వరితిమంత్రేణ శరీరంపరిశుద్ధ్యతే
శరీరీప్రణవంధ్యాయే త్సర్వాజ్ఞానివర్తకమ్॥ ౧౩

టీ॥ భూర్భువస్స్వరితిమంత్రేణ=భూర్భువస్స్వ అనునట్టిమంత్రముచేత, శరీరమ్ =శరీరము, పరిశుద్ధ్యతే = పరిశుద్ధికలదిగా చేయఁబడుచున్నది, శరీరీ = శరీరముకలవాఁడు, సర్వాజ్ఞానివర్తకమ్=సమస్తమైనయవివేకమునునివర్తింపఁజేయునట్టి, ప్రణవమ్=ప్రణవమును, ధ్యాయేత్=ధ్యానముచేయవలయును.

తా॥ "భూర్భువస్సువః" అనునట్టి మంత్రముచేత శరీరము పరిశుద్ధికలదిగాఁ జేయఁబడుచున్నది. దేహముకలవాఁడు సమస్తమైన యవివేకమును పోఁగొట్టునట్టి ప్రణవమును ధ్యానము చేయవలయునని తాత్పర్యము.

శ్లో॥ రేచకోచ్ఛ్వాసనిశ్వాసః పూరకఃపరిచక్షతే
తద్రోధఃకుంభకశ్చైవ ప్రాణాయామస్సఉచ్యతే॥ ౧౪

టీ॥ ఉచ్ఛ్వాసనిశ్వాసః =ప్రాణవాయువును బయలునకు విడుచుట లోపలికిఁ బీల్చుట అనునవి, రేచకః=రేచకమనియును, పూరకః =పూరకమనియును, పరిచక్షతే=చెప్పఁబడుచున్నవి; తద్రోధః = ఆప్రాణవాయువును లోనికి బయలునకుఁ బోనీయక నిలుపుట, కుంభకః = కుంభకమనియును, పరిచక్షతే=చెప్పఁబడుచున్నది, సః =అది, ప్రాణాయామః=ప్రాణాయామమని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ రేచక పూరక కుంభకములను జేయుటయే ప్రాణాయామమనఁబడునని యెఱుఁగవలయునని తాత్పర్యము.

శ్లో॥ ప్రణవస్సశిరోహ్యాత్మా తల్లక్ష్యంబ్రహ్మఉచ్యతే
అప్రమత్తస్సవేత్తవ్యం శరవత్తన్మయోచ్యతే॥ ౧౫

టీ॥ సశిరః = శిరస్సుతోఁగూడిన, ప్రణవః = ప్రణవము, ఆత్మా =పరమాత్మ, స్యాత్ =అగును, తల్లక్ష్యమ్ = ఆప్రణవముయొక్క-లక్ష్యము, బ్రహ్మ =బ్రహ్మము, ఇతి =ఇట్లని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. అప్రమత్తః = ప్రమాదములేని వాఁడై, శరవత్ = బాణమువలె, తన్మయః = ఆబ్రహ్మమయుఁడై, సః = వాఁడు, వేత్తవ్యమ్= తెలిసికొనదగునని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

తా॥ శిరస్సుతోఁగూడిన ప్రణవము బ్రహ్మమని చెప్పఁబడును. బ్రహ్మము ఆ ప్రణవమునకు లక్ష్యమనఁబడును, బాణమును సంధానముచేయునపుడు లక్ష్యమును కనిపెట్టువిధముగ లక్ష్యమగు బ్రహ్మమును కనిపెట్టవలసినదని తాత్పర్యము.

శ్లో॥ నివర్తంతేక్రియాస్సర్వా స్తస్మిన్దృష్టేపరావరే
ఓంకారప్రభవావేదా ఓంకారప్రభవాస్స్వరాః॥ ౧౬

టీ॥ సర్వాః=సమస్తములయిన, క్రియాః=క్రియలు, తస్మిన్ = ఆ, పరావరే = కారణకార్యరూపమును ఓంకారవాచ్యమును అయినబ్రహ్మము, దృష్టేసతి = చూడఁబడినదగుచునుండఁగా, నివర్తంతే = మరలిపోవుచున్నవి, వేదాః =వేదములు, ఓంకారప్రభవాః =ఓంకారమువలనఁబుట్టినవి, స్వరాః = స్వరములు, ఓంకారప్రభవాః=ఓంకారమువలనఁబుట్టినవి.

తా॥ కార్యకారణరూపమును ఓంకారవాచ్యమును అయినబ్రహ్మము చూడఁబడినదగుచునుండఁగా సర్వక్రియలునునివిర్తించిపోవుచున్నవి. వేదములు ఓంకారము వలనఁ బుట్టినవి. స్వరములు ఓంకారమువలనఁబుట్టినవి అని తాత్పర్యము.

శ్లో॥ ఓంకారప్రభవంసర్వం త్రైలోక్యంసచరాచరమ్
ఓమిత్యేవపరంరూపం హృత్పద్మేచవ్యవస్థితమ్॥ ౧౭

టీ॥ సచరాచరమ్ = చరాచరములతోఁగూడిన, త్రైలోక్యమ్ = ముల్లోకములును, సర్వమ్=సమస్తమును, ఓంకారప్రభవమ్ = ఓంకారమువలనఁబుట్టినవి, ఓమిత్యేవ=ఓం అనునట్టి, పరమ్ = సర్వోత్తమమైన, రూపమ్ = రూపము, హృత్పద్మేచ= హృదయమనియెడుపద్మమునందు, వ్యవస్థితమ్=ఉంచఁబడియున్నది.

తా॥ చరాచరాత్మకములయిన ముల్లోకములును ఓంకారమువలనఁబుట్టినవి. ఓమనియెడునక్షరస్వరూపము హృత్పద్మమునం దున్నదని తాత్పర్యము.

శ్లో॥ తస్మాత్తదభ్యసేదేకం సర్వగంపరమేశ్వరమ్
హ్రస్వోదహతిపాపాని దీర్ఘో మోక్షప్రదాయకః॥ ౧౮

టీ॥ తస్మాత్=ఆయోంకారమువలనసర్వమును పుట్టినదికనుక, ఏకమ్=ఒక్కటియును, సర్వగమ్ = సర్వస్వరూపమును, పరమేశ్వరమ్ = పరమేశ్వరస్వరూపమును, అయిన, తత్ = ఆప్రణవమును, అభ్యసేత్ =అభ్యసింపవలయును; హ్రస్వ=హ్రస్వము, పాపాని=పాపములను, దహతి = కాల్చివేయుచున్నది, దీర్ఘః=దీర్ఘము, మోక్షప్రదాయకః=మోక్షమునిచ్చునది, భవతి=అగుచున్నది.

తా॥ ఓంకారమువలననే సర్వమును పుట్టినది కనుక ఒక్కటియును పరమేశ్వరస్వరూపమును సర్వమునుపొందినదియును అయినప్రణవమును అభ్యసింపవలయును, హ్రస్వము సకలపాపములను కాల్చివేయుచున్నది. దీర్ఘము మోక్షమును గలుగజేయునది యగుచున్నది.

శ్లో॥ అవాచ్యంప్రణవస్యార్థం యస్తంవేదసవేదవిత్
ఓంకారప్రభవోవిష్ణు స్త్రినేత్రోవచసాంపతిః॥ ౧౯

టీ॥ యః=ఎవ్వఁడు, అవాచ్యమ్ = చెప్పశక్యముగాని, తమ్ = ఆ, ప్రణవస్య = ప్రణవముయొక్క, అర్థమ్ = అర్థమును, వేద = తెలిసికొనుచున్నాఁడో, సః = వాఁడు, వేదవిత్ = వేదమునుదెలిసినవాఁడు, భవతి = అగుచున్నాఁడు; విష్ణుః = విష్ణుమూర్తియును, త్రినేత్రః = పరమశివుఁడును, వచసాంపతిః = బ్రహ్మదేవుఁడును, ఓంకారప్రభవః=ఓంకారమువలన బుట్టినవారు.

తా॥ చెప్పనలవికానిప్రణవార్థము నెవ్వఁడుతెలిసికొనుచున్నాఁడో వాఁడు వేదార్థమును దెలిసినవాఁ డగుచున్నాఁడు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముమ్మూరును ఓంకారమువలనఁ బుట్టిరని తాత్పర్యము.

శ్లో॥ తస్యోచ్చారణమాత్రేణ పరంబ్రహ్మాధిగచ్ఛతి
ధ్రువమగ్నిమయంరూపంతద్దేహేసమధిష్ఠితమ్॥ ౨౦

టీ॥ తస్య = ఆప్రణవముయొక్క, ఉచ్చారణమాత్రేణ = ఉచ్చారణముచేత, పరంబ్రహ్మ = పరబ్రహ్మమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు, ధ్రువమ్ = శాశ్వతమైనదియును, అగ్నిమయమ్ = అగ్నివికారమయిన, రూపమ్ = రూపముకలదియును అయిన, తత్=ఆప్రణవము, దేహే = దేహమునందు, సమధిష్ఠితమ్=నిలిచియున్నది.

తా॥ ఆప్రణవముయొక్క యుచ్చారణమాత్రముచేతనే పరబ్రహ్మమునుపొందుచున్నాఁడు. శాశ్వతమును అగ్నిమయమును అయినప్రణవము దేహమునందున్నదని యెఱుఁగవలయునని తాత్పర్యము.

శ్లో॥ ఇంద్రియాణిపశూన్హత్వా ఆత్మనైవతుతుష్యతి॥ ౨౧

శ్లో॥ హృత్పద్మకర్ణికామధ్యే శుద్ధందీపశిఖాకృతి
అంగుష్ఠమాత్రమచలం ధ్యాయేదోంకారమీశ్వరమ్॥ ౨౨

టీ॥ ఇంద్రియాణి = ఇంద్రియములనియెడు, పశూన్ = పశువులను, హత్వా= చంపి, ఆత్మనైవతు=ఆత్మచేతనే, తుష్యతి = సంతోషించుచున్నాఁడు. శుద్ధమ్ =పరిశుద్ధమును, దీపశిఖాకృతి =దీపశిఖయొక్క ఆకారమువంటి ఆకారముకలదియును, అంగుష్ఠమాత్రమ్ = అంగుష్ఠపరిమితికలదియును, అచలమ్ = చలింపనిదియును, ఈశ్వరమ్ = ఈశ్వరస్వరూపమును అయిన, ఓంకారమ్ = ఓంకారమును, హృత్పద్మకర్ణికామధ్యే = హృత్పద్మకర్ణికయొక్క మధ్యమందు, ధ్యాయేత్ = ధ్యానముచేయవలయును.

తా॥ ఇంద్రియములనియెడు పశువులనుజంపి పరిశుద్ధమైనదియును, దీపశిఖవంటి యాకారముకలదియును, అంగుష్ఠమాత్రమును, అచలమును, ఈశ్వరస్వరూపమును, అయినయోంకారమును హృదయపద్మముయొక్క కర్ణికామధ్యయందు ధ్యానముచేయవలయునని తాత్పర్యము.

శ్లో॥ హృదయకమలమధ్యే దీపవద్వేదసారం
ప్రణవమయమతర్క్యం యోగిహృద్ధ్యానగమ్యం
అజహరిశివయోగం సర్వభూతస్థమేకం
సకృదపిమనసామాం ధ్యాయతేయస్సముక్తః॥ ౨౩

టీ॥ హృదయకమలమధ్యే = హృత్పుండరీకముయొక్క మధ్యమందు, దీపవత్ = దీపమువలె ప్రకాశించుచున్నవాఁడును, వేదసారమ్ = వేదముయొక్కసారమగువేదాంతస్వరూపుఁడును, ప్రణవమయమ్ = ప్రణవస్వరూపుఁడును, అతర్క్యమ్ =

ఊహింపనలవి కానివాఁడును, యోగిహృద్ధ్యానగమ్యమ్ = యోగులయొక్క హృదయమునందు ధ్యానముచేత పొందఁదగినవాఁడును, అజహరిశివయోగమ్ = బ్రహ్మవిష్ణుమహేశ్వరుల సంబంధముకలవాఁడును, సర్వభూతస్థమ్ = సకలభూతములయందును అంతర్యామిరూపముతోనున్నవాఁడును, ఏకమ్ = ఒక్కఁడును (అయిన) మామ్ = నన్ను, సకృదపి = ఒక్కమాటయినను, మనసా = మనస్సుచేత, యః = ఎవ్వఁడు, ధ్యాయతే = ధ్యానమును జేయుచున్నాఁడో, సః = వాఁడు, ముక్తః = ముక్తిని జెందినవాఁడు, భవతి = అగుచున్నాఁడు.

తా॥ హృత్పుండరీకమధ్యమందు దీపమువలెఁ బ్రకాశించుచున్నవాఁడును, వేదాంతస్వరూపుఁడును, ప్రణవస్వరూపుఁడును, ఊహింపనలవి కానివాఁడును, యోగులయొక్క హృత్పద్మమునందు ధ్యానయోగముచేత పొందఁదగినవాఁడును బ్రహ్మవిష్ణుమహేశ్వరులనెడు త్రిమూర్తులసంబంధముకలవాఁడును, సర్వభూతములయందును అంతర్యామిరూపముతోనున్నవాఁడును, అద్వితీయుఁడును, అయిన నన్ను యెవ్వఁడుమనస్సుచేత ధ్యానముచేయుచున్నాఁడో వాఁడు ముక్తుఁడగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ ఇడాయాంవాయుమారోప్య పూరయిత్వోదరస్థితం
తతోగ్నిందేహమధ్యస్థం ధ్యాయేజ్జ్వాలావళీవృతమ్॥ ౨౮

టీ॥ ఉదరస్థితమ్ = ఉదరమందున్న, వాయుమ్ = వాయువును, పూరయిత్వా = పూరించి, ఇడాయామ్ = ఇడయందు, ఆరోప్య = ఆరోపించి, తతః = పిమ్మట, దేహమధ్యస్థమ్ = దేహమధ్యమందున్నదియును, జ్వాలావళీవృతమ్ = జ్వాలావళులచేత ఆవరింపఁబడినదియును అయిన, అగ్నిమ్ = అగ్నిని, ధ్యాయేత్ = ధ్యానముచేయవలెను.

తా॥ ఉదరమందున్నవాయువును పూరించి యిడానాడియం దారోపించి దేహమధ్యమందున్నదియును జ్వాలావళులచేతఁ జుట్టఁబడినదియును అయిన అగ్నిని ధ్యానముచేయవలసినదని తాత్పర్యము.

శ్లో॥ రేచకంబిందుసంయుక్తమగ్నిమండలసంస్థితమ్
ధ్యాయేచ్చ రేచయేత్పశ్చాన్నాదంపింగళమాప్నుయాత్॥ ౨౯

టీ॥ బిందుసంయుక్తమ్ = బిందువుతోఁగూడియున్నదియును, అగ్నిమండలసంస్థితమ్ = అగ్నిమండలమందున్నదియును అయిన, రేచకమ్ = రేచకమును, ధ్యాయేత్ = ధ్యానముచేయవలయును, రేచయేచ్చ = రేచనమునుకూడచేయవలయును, పశ్చాత్ = పిమ్మట, పింగళమ్ = పింగళమును, నాదమ్ = నాదమును, ఆప్నుయాత్ = పొందును.

తా॥ బిందువుతోఁగూడియున్నదియును అగ్నిమండలమందున్నదియును అయిన రేచకమును ధ్యానముచేయవలయును, మఱియును రేచకప్రాణాయామమును కూడ ఆచరింపవలయును. అనంతరమందు పింగళమనునట్టి నాదమును పొందవలసినదని తాత్పర్యము.

శ్లో॥ బ్రహ్మాతుపూరకోజ్ఞేయః కుంభకోవిష్ణురుచ్యతే
రేచకస్తుతథాజ్ఞేయో క్షరాక్షరమయశ్శివః॥ ౨౬

టీ॥ పూరకః = పూరకప్రాణాయామము, బ్రహ్మాతు = బ్రహ్మమని, జ్ఞేయః= తెలియఁదగినది, కుంభకః = కుంభకప్రాణాయామము, విష్ణుః = విష్ణువని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది, తథా = అవిధముగానే, రేచకస్తు = రేచకప్రాణాయామము, క్షరాక్షరమయః=క్షరాక్షరస్వరూపుఁడైన, శివః=శివుఁడని, జ్ఞేయః= తెలియఁదగినది.

తా॥ పూరకప్రాణాయామముబ్రహ్మమనియును కుంభకప్రాణాయామమువిష్ణువనియను రేచకప్రాణాయామము క్షరాక్షరస్వరూపుఁడగు శివుఁడనియును తాత్పర్యము.

శ్లో॥ దేహోదేవాలయఃప్రోక్తో జీవోదేవస్సనాతనః
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోహంభావేనపూజయేత్॥ ౨౭

టీ॥ దేహః=దేహము, దేవాలయః = దేవాలయము, ఇతి = ఇట్లని, ప్రోక్తః= చెప్పఁబడినది; జీవః=జీవుఁడు, సనాతనః=ప్రాచీనుఁడైన, దేవః = దేవుఁడు; అజ్ఞాననిర్మాల్యమ్ = అవివేకమనియెడుమాలిన్యమును, త్యజేత్= విడువవలయును; తతః =పిమ్మట, సోహంభావేన=ఆబ్రహ్మమే నేననియెడుతలంపుచేత, పూజయేత్=పూజింపవలయును.

తా॥ దేహము దేవాలయమనియును జీవుఁడు సనాతనుండగు దేవుఁడనియును తెలిసికొని అవివేకమనియెడు నిర్మాల్యమును విడిచిపెట్టి ఆబ్రహ్మమే నేననియెడు తలంపుచేత పరబ్రహ్మమును పూజింపవలయునని తాత్పర్యము.

శ్లో॥ బహిర్భ్రామ్యతియఃకశ్చి త్త్యక్త్వాదేహస్థమీశ్వరమ్
స్వగృహేపాయసంత్యక్త్వా భిక్షామటతిదుర్మతిః॥ ౨౮

టీ॥ యః=ఎవ్వఁడో, కశ్చిత్= ఒకఁడు, దేహస్థమ్ = దేహమందున్న, ఈశ్వరమ్=ఈశ్వరుని, త్యక్త్వా=విడిచిపెట్టి, బహిః = వెలుపల, భ్రామ్యతి=తిరుగుచున్నాఁడో, సః=ఆ, దుర్మతిః=దుష్టబుద్ధికలవాఁడు, స్వగృహే =స్వగృహమునందు, పాయసమ్=క్షీరాన్నమును, త్యక్త్వా =విడిచిపెట్టి, భిక్షామ్ = భిక్షనుగురించి, అటతి=తిరుగుచున్నాఁడు.

తా॥ దేహమందున్న యీశ్వరుని విడిచిబయలుననున్న దేవునిగుఱించి తిరుగువాఁడు స్వగృహమునందు క్షీరాన్నమును విడిచిపెట్టిభిక్షాన్నముకొఱకు పొరుగిండ్లకుఁదిరుగువానితో సమానుఁడని తాత్పర్యము.

శ్లో॥ శిలామృద్దారుపాత్రేషు దైవబుద్ధిఃప్రకల్పితః
అకల్పితస్స్వయంజ్యోతి రాత్మానోదేవతానకిమ్॥ ౨౯

టీ॥ శిలామృద్దారుపాత్రేషు=శిలయొక్కయును మృత్తుయొక్కయును దారువుయొక్కయును పాత్రలయందు, దైవబుద్ధిః = దేవుఁడనియెడుబుద్ధి, ప్రకల్పితః=కల్పింపఁబడినది, భవతి=అగుచున్నది, స్వయంజ్యోతిః=స్వయంప్రకాశమానమైన, ఆత్మా = పరమాత్మ, నః = మనకు, అకల్పితః = కల్పింపఁబడని, దేవతా = దేవుఁడు, నకిమ్= కాఁడాయేమి ? అగుననుట.

తా॥ శిలచేతను మృత్తుచేతను మ్రానుచేతను చేయఁబడినవిగ్రహములయందలి దేవతాబుద్ధి కల్పితమైనదనియు స్వయంప్రకాశమానమైన పరమాత్మ అకల్పితమైన దేవుఁడనియును తాత్పర్యము.

శ్లో॥ నాభిమూలేస్థితంపద్మం నాళంతస్యదశాంగుళం
కోమలంతస్యతన్నాళం నిమ్నపద్మమధోముఖం
కదళీపుష్పసంకాశం చంద్రకాంతసమప్రభమ్॥ 30

టీ॥ నాభిమూలే=నాభిమూలమునందు, పద్మమ్ = కమలము, స్థితమ్=ఉన్నది. తస్య =ఆపద్మముయొక్క, నాళమ్ = నాళము, దశాంగుళమ్ = పదియంగుళములపరిమితికలది; తస్య = ఆపద్మముయొక్క, తన్నాళమ్ = ఆనాళము, కోమలమ్ =మృదువైనది; అధోముఖమ్=క్రిందిముఖముగల, నిమ్నపద్మమ్=లోతైనపద్మము, కదళీపుష్పసంకాశమ్ = అరటిపువ్వువంటిదియును, చంద్రకాంతసమప్రభమ్ = చంద్రకాంతమణియొక్క కాంతితోసమానమగు కాంతికలదియును, భవతి=అగుచున్నది.

తా॥ నాభిమూలమందు పద్మమున్నది. ఆపద్మముయొక్క నాళము పదియంగుళములపరిమితికలది. మఱియును ఆనాళము మిగులకోమలమయినది. మఱియును ఆ పద్మము నిమ్నమును అధోముఖమును కలది యని తెలియునది, ఆపద్మము అరటిపువ్వుతో సమానమైనదనియును చంద్రకాంతమణులయొక్క కాంతివంటి కాంతి కలదియనియును తెలియవలయునని తాత్పర్యము.

అర్జున ఉవాచ.

అర్జునుఁడు అడుగుచున్నాఁడు.

శ్లో॥ దుర్విజ్ఞేయందురారాధ్యం దుష్ప్రాప్యంజనార్దన
అధోముఖంయథాభూత్వా హృదయేకేనగచ్ఛతి॥ 31

టీ॥ దుర్విజ్ఞేయమ్ = తెలిసికొనశక్యముకానిదియును, దురారాధ్యమ్ = ఆరాధింపశక్యముకానిదియును, దుష్ప్రాప్యమ్ = పొందశక్యముకానిదియును, అధోముఖమ్ =క్రిందిభాగమునందుముఖముకలదియును అయినపద్మమును, హేజనార్దన !=ఓకృష్ణుఁడా ! యథా=ఏవిధముగా, భూత్వా=అయి, హృదయే=హృదయమందు, కేన =దేనిచేత, గచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా॥ తెలిసికొనశక్యముకానిదియును ఆరాధింపనలవికానిదియును పొందుటకు వీలులేనిదియును అధోముఖమును అయినపద్మమును శ్రీకృష్ణుఁడా హృదయమునందు దేనిచేతపొందుచున్నాఁ డని తాత్పర్యము.

శ్రీభగవానువాచ.

సంపత్కరుఁడును షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అయినకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అధోముఖంతుహృత్పద్మ ముద్ధృత్యప్రణవేనతు
గత్వాతుపద్మకోశాంత మేకస్సేవ్యోపునఃపునః॥ 32

టీ॥ అధోముఖంతు=అధోముఖమైన, హృత్పద్మమ్ = హృదయపుండరీకమును, ప్రణవేనతు=ప్రణవముచేతను, ఉద్ధృత్య = లేవనెత్తి, పద్మకోశాంతమ్ = పద్మకోశముయొక్కతుదను, గత్వా=పొంది, ఏకః=ఒకఁడైన పరమేశ్వరుఁడు, పునఃపునః = మాటిమాటికిని, సేవ్యః=సేవింపఁదగినవాఁడు, భవతి=అగుచున్నాఁడు.

తా॥ అధోముఖమైన హృత్పద్మమును ప్రణవముచేత లేవఁదీసి పద్మకోశముయొక్కతుదనుపొంది యొక్కఁడైన పరమశివుఁడు అనఁగా పరమాత్మ మాటిమాటికిని సేవింపఁదగినవాఁడని తాత్పర్యము.

శ్లో॥ తతఃపశ్చాద్భవేత్పద్మం సర్వగాత్రసుఖావహమ్॥ 33

టీ॥ తతఃపశ్చాత్ = అటుపిమ్మట, పద్మమ్ = హృదయకమలము, సర్వగాత్రసుఖావహమ్=సర్వావయవములకును సుఖమునుగలిగించునది, భవతి = అగుచున్నది.

తా॥ అటుపిమ్మట ఆపద్మము సర్వావయవములయందును సుఖమునుకలుగఁజేయునది యగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ హృదిస్థితంపంకజమష్టపత్రం సకేసరంకర్ణికమప్యలీనం
అంగుష్ఠమాత్రంమునయోవదంతి ధ్యాయేతివిష్ణుంపురుషంపురాణమ్॥

టీ॥ హృది=హృదయమునందు, స్థితమ్ = ఉన్నటువంటి, పంకజమ్ =పద్మము, అష్టపత్రమ్=ఎనిమిదిదళములుగలది; సకేసరమ్ = కింజల్కములతోఁగూడినది; కర్ణికమపి=కర్ణికగలదైనప్పటికిని,అలీనమ్ = లీనమైనదికాదు, (అపిచ=ఇంతియగాక, తత్=ఆపద్మము), అంగుష్ఠమాత్రమ్ = అంగుష్ఠమాత్రపరిమితికలది, భవతి =అగుచున్నది; తస్మిన్=ఆపద్మమునందు. పురుషంపురాణమ్ =పురాణపురుషుఁడైన, విష్ణుమ్=విష్ణువును, ధ్యాయేతి=ధ్యానముఁజేయుమని, మునయః=మునులు, వదంతి=చెప్పుచున్నారు.

తా॥ ఆపద్మము హృదయమందున్నది. ఎనిమిదిదళములుకలది. ఇంతియగాక కేసరములును కర్ణికయును కలదైయున్నది. అంగుష్ఠమాత్రపరిమితికలది. ఆపద్మమునందు పురాణపురుషుఁడగు విష్ణువును ధ్యానముచేయవలసినదని మునులుచెప్పుచున్నారు అని తాత్పర్యము.

16

శ్లో॥ అష్టపత్రంతుహృత్పద్మం ద్వాత్రింశత్కుసుమంతథా
తత్రమధ్యస్థితంధ్యాయే దింద్రాద్యాన్దిశిదేవతాః॥ 35

టీ॥ హృత్పద్మమ్=హృదయపుండరీకము, అష్టపత్రమ్=ఎనిమిదిదళములుగలది తథా=అటులనే, ద్వాత్రింశత్కుసుమమ్ = ముప్పదిరెండుపుష్పములుగలది, తత్ర= ఆపద్మమునందు, మధ్యస్థితమ్=మధ్యభాగమునందున్న పరమేశ్వరుని, దిశి = దిక్సముదాయమునందలి, ఇంద్రాద్యాన్ = ఇంద్రుఁడు మొదలుగాఁగల, దేవతాః=దేవతలను, ధ్యాయేత్=ధ్యానముచేయవలయును.

తా॥ హృదయపుండరీకము ఎనిమిదిదళములును ముప్పదిరెండుకుసుమములును కలది. ఆపద్మముయొక్క మధ్యయందు దున్న పరమేశ్వరుని దిగ్దేవతలయిన యింద్రాదులను ధ్యానముచేయవలసినదని తాత్పర్యము.

శ్లో॥ తస్యమధ్యగతోభాను ర్భానుమధ్యగతశ్శశీ
శశిమధ్యగతోవహ్ని ర్వహ్నిమధ్యగతాప్రభా॥ 36

టీ॥ భానుః=సూర్యుఁడు, తస్య = ఆపద్మముయొక్క, మధ్యగతః =మధ్యను పొందెను ; శశీ = చంద్రుఁడు, భానుమధ్యగతః=సూర్యమధ్యమును పొందినవాఁడు; వహ్ని=అగ్ని, శశిమధ్యగతః = చంద్రమధ్యమునుపొందినవాఁడు ; ప్రభా = కాంతి, వహ్నిమధ్యగతా=అగ్నిమధ్యమందు పొందినది.

తా॥ సూర్యుఁడు ఆపద్మముయొక్కమధ్యను పొందెను; చంద్రుఁడు భానుమధ్యమును పొందియున్నాఁడు; అగ్నిహోత్రుఁడు చంద్రమధ్యమును పొందియుండెను. కాంతి అగ్నిమధ్యమందు పొందియున్నదని తాత్పర్యము.

శ్లో॥ ప్రభామధ్యగతంపీఠం నానారత్నప్రవేష్టితం
అనేకరత్నసంకీర్ణం జ్వలనార్కసమప్రభమ్॥ 37

టీ॥ పీఠమ్=పీఠము, ప్రభామధ్యగతమ్ = కాంతియొక్క మధ్యమునుపొందియున్నది, తత్ = ఆపీఠము, నానారత్నప్రవేష్టితమ్ = అనేకములయిన రత్నములచేతఁ జెక్కఁబడినదియును, అనేకరత్నసంకీర్ణమ్=అనేకములయినరత్నములచేతవ్యాప్తమైనదియును, జ్వలనార్కసమప్రభమ్=అగ్నియొక్కయును సూర్యునియొక్కయును, కాంతివంటి కాంతికలదియును, భవతి=అగుచున్నది.

తా॥ ఆపీఠము కాంతియొక్కమధ్యమును పొందియున్నది. ఆపీఠము నానావిధములయిన రత్నములచేతఁ జెక్కఁబడినదియును అనేకములయిన రత్నములచేత వ్యాప్తమైనదియును, అగ్నియొక్కయును సూర్యునియొక్కయును కాంతివంటి కాంతికలదియును, అగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ తస్యమధ్యస్థితందేవం నారాయణమనామయం
శ్రీవత్సకౌస్తుభోరస్కం ముక్తాహారోపశోభితమ్॥ ౩౮

టీ॥ తస్య=ఆపీఠముయొక్క, మధ్యస్థితం=మధ్యయందున్నవాఁడును, దేవం=స్వయంప్రకాశుఁడును, అనామయమ్=కలుషరహితుఁడును, శ్రీవత్సకౌస్తుభోరస్కమ్=శ్రీవత్సకౌస్తుభములు ఱొమ్మునందుఁగలవాఁడును, ముక్తాహారోపశోభితం = ముత్యాలహారములచేత ప్రకాశించుచున్నవాఁడును అయిన, నారాయణమ్=నారాయణుని.

తా॥ ఆపీఠముయొక్కమధ్యమందున్నవాఁడును, స్వయంప్రకాశమానుఁడును, నిరామయుఁడును, శ్రీవత్సకౌస్తుభములు ఱొమ్మునందుఁగలవాఁడును, ముత్యాలహారములచేత ప్రకాశింపఁజేయఁబడినవాఁడును అయిన నారాయణుని అని తాత్పర్యము.

శ్లో॥ అనేకసూర్యసంకాశం మకుటాధిష్ఠమస్తకం
శంఖంచక్రంగదాపద్మం ముసలంఖడ్గమేవచ॥ ౩౯

శ్లో॥ ధనురాద్యాయుధోపేత మష్టబాహుధరంహరిం
శుద్ధస్ఫటికసంకాశం చంద్రకాంతసమప్రభమ్॥ ౪౦

టీ॥ అనేకసూర్యసంకాశమ్=అనేకమందిసూర్యులతోసమానమైన కాంతికలవాఁడును, మకుటాధిష్ఠమస్తకమ్=కిరీటముతోఁగూడిన శిరస్సుగలవాఁడును, శంఖమ్=శంఖము, చక్రమ్=చక్రము, గదా=గద, పద్మమ్ = పద్మము, ముసలమ్ = ముసలమనునాయుధము, ఖడ్గమేవచ=ఖడ్గమును, ధనుః=ధనుస్సు, ఆద్యాయుధోపేతమ్=మొదలుగాఁగల యాయుధములతోఁ గూడినవాఁడును, అష్టబాహుధరమ్=ఎనిమిది భుజములనుధరించినవాఁడును, శుద్ధస్ఫటికసంకాశమ్=పరిశుద్ధమైనస్ఫటికముయొక్క కాంతివంటికాంతికలవాఁడును, చంద్రకాంతసమప్రభమ్=చంద్రకాంతమణులయొక్క కాంతితోసమానమైనకాంతికలవాఁడును అయిన నారాయణుని.

తా॥ అనేకమందిసూర్యులతోసమానమైన కాంతికలవాఁడును, కిరీటముచేత అలంకరింపఁబడిన శిరస్సుకలవాఁడును, శంఖము చక్రము గద ఖడ్గము పద్మము ముసలము ధనుస్సు మొదలుగాఁగల యాయుధములతోఁ గూడుకొన్నవాఁడును, ఎనిమిది భుజములు కలవాఁడును, భక్తులపాపమును హరించువాఁడును, పరిశుద్ధమైన స్ఫటికముయొక్క కాంతివంటి కాంతికలవాఁడును చంద్రోపలముతో సమమైన కాంతికలవాఁడును అయిన నారాయణుని అని తాత్పర్యము.

శ్లో॥ పద్మకింజల్కసదృశం తప్తకాంచనసన్నిభం
కృతేశ్వేతంహరింవింద్యా త్త్రేతాయాంరక్తవర్ణకమ్॥ ౪౧

టీ॥ పద్మకింజల్కసదృశమ్=పద్మమునందలికింజల్కములతో సమానమైనవాఁడును, తప్తకాంచనసన్నిభమ్=పుటమువేయఁబడిన బంగారము అనఁగా అపరంజి

తో సమమైన కాంతికలవాఁడును అయిననారాయణుని, కృతే=కృతయుగమునందు, శ్వేతమ్=తెల్లనివానినిగాను, త్రేతాయామ్ = త్రేతాయుగమునందు, రక్తవర్ణకమ్= ఎఱ్ఱనివర్ణముకలవానినిగాను, వింద్యాత్=తెలియవలయును.

తా॥ పద్మమునందలి కింజల్కము. (కేసరము) లతో సమానమైన కాంతికల వాఁడును, పుటము వేయఁబడిన బంగారము అనఁగా అపరంజియొక్క కాంతివంటి కాంతికలవాఁడును, అయిన నారాయణుని కృతయుగమునందు తెల్లవానినిగాను త్రేతాయుగమునందు ఎఱ్ఱనివర్ణముగలవానినిగాను తెలియవలయునని తాత్పర్యము.

శ్లో॥ ద్వాపరే శ్యామవర్ణంచ పీతవర్ణం కలౌయుగే
శుద్ధం సూక్ష్మం నిరాకారం నిర్వికల్పం నిరంజనమ్॥ ౪౨

శ్లో॥ అప్రమేయమజందేవం తంవింద్యాత్పురుషోత్తమం
తైలాగ్నివర్తిసంయోగ మధూమజ్యోతిరూపకమ్॥ ౪౩

టీ॥ ద్వాపరే=ద్వాపరయుగమునందు, శ్యామవర్ణంచ = నల్లనివర్ణముగలవానినిగాను, కలౌయుగే=కలియుగమునందు, పీతవర్ణంచ = పచ్చనివర్ణముగలవానినిగాను, వింద్యాత్=తెలియవలయును, శుద్ధమ్=పరిశుద్ధుఁడును, సూక్ష్మమ్=సూక్ష్మరూపుఁడును, నిరాకారమ్ = ఆకారరహితుఁడును, నిర్వికల్పమ్ = వికల్పములేనివాఁడును, నిరంజనమ్=జడసంబంధశూన్యుఁడును, అప్రమేయమ్=ఇంతపరిమితికలవాఁడని తెలియ శక్యముకానివాఁడును, అజమ్ = పుట్టుపులేనివాఁడును, దేవమ్ = స్వయంప్రకాశ మానుఁడును, తైలాగ్నివర్తిసంయోగమ్=తైలముఅగ్నివర్తి అనువానియొక్కసంబంధముకలదై, అధూమమ్=ధూమములేనిదై, జ్యోతిరూపకమ్=వెలుతురుయొక్క ఆకృతి కలవాఁడునుఅయిన, తమ్=ఆనారాయణుని, పురుషోత్తమమ్=పురుషశ్రేష్ఠునిగా, వింద్యాత్=తెలియవలయును.

తా॥ ద్వాపరయుగమునందు నల్లనివర్ణముకలవాఁడనియును, కలియుగమునందు పచ్చనివర్ణముకలవాఁడనియును, తెలియవలయును. పరిశుద్ధుఁడును, సూక్ష్మస్వరూపుఁడును, ఆకారరహితుఁడును, వికల్పములేనివాఁడును, జడసంబంధశూన్యుఁడును, ఇంతపరిమితికలవాఁడని తెలియశక్యముకానివాఁడును, జన్మములేనివాఁడును, స్వయంప్రకాశమానుఁడును, తైలాగ్నివర్తులును పొగయునులేని జ్యోతి స్వరూపుఁడును, అయిన నారాయణుని పురుషోత్తమునిగాఁ దెలియవలయునని తాత్పర్యము.

శ్లో॥ తాదృశంపరమంరూపం స్మరేత్పార్థహ్యానన్యధీః
కారణంయోగవిజ్ఞాన హేతుసాధనవర్జితమ్॥ ౪౪

టీ॥ తాదృశమ్ =పైనచెప్పఁబడినవిధముకలదియును, పరమమ్=సర్వోత్తమమును, కారణమ్=సర్వమునకును కారణమైనదియును, యోగవిజ్ఞానహేతుసాధన

వర్జితమ్ = యోగము విజ్ఞానము హేతువు సాధనము అనునవిలేనిదియును, అయిన, రూపమ్=రూపమును, హే పార్థ !=ఓ అర్జునుఁడా! అనన్యధీః = ఇతరబుద్ధిలేనివాఁడవై, స్మరేత్=స్మరింపవలయును.

తా॥ పైనజెప్పఁబడినవిధముకలదియును, సర్వోత్తమమును, సర్వమునకును కారణమును, యోగము విజ్ఞానము సాధనము అనునవిలేనిదియును, అయినరూపమును, ఓఅర్జునుఁడా ! ఇతరవిషయమునందు బుద్ధిలేనివాఁడవై అనఁగా యితరచింతలుమాని చిత్తైకాగ్రతకలవాఁడవై ధ్యానముచేయవలసినదని తాత్పర్యము.

శ్లో॥ భిన్నేకుంభేయథాకాశో మహాకాశేవిలీయతే
విభిన్నేప్రకృతేదేహే తథాత్మాపరమాత్మని॥ ౪౫

టీ॥ కుంభే=ఘటము, భిన్నేసతి = బ్రద్దలయినదగుచునుండఁగా, ఆకాశః = ఆకాశము, యథా = ఏవిధముగా, మహాకాశే= మహాకాశమునందు, విలీయతే=లయమయిపోవుచున్నదో, తథా = ఆవిధముగా, ప్రకృతే = ప్రాకృతమైన, దేహే = దేహము, విభిన్నేసతి = భిన్నమైనదగుచునుండఁగా, ఆత్మా = జీవాత్మ, పరమాత్మని= పరమాత్మయందు, విలీయతే=అణఁగిపోవుచున్నది.

తా॥ ఘటము బ్రద్దలయినదగుచునుండఁగా ఆఘటాకాశము మహాకాశమునందు ఏవిధముగా లయమై పోవుచున్నదో ఆవిధముగా ప్రాకృతమైనదేహము పోయినదగుచునుండఁగా ఆత్మ పరమాత్మయందు లయమగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ అశ్వారూఢోగజారూఢో సంగ్రామేసంకటేతథా
ఏతదేవసదాధ్యాయీ పరబ్రహ్మాధిగచ్ఛతి॥ ౪౬

టీ॥ అశ్వారూఢః = అశ్వమునెక్కినవాఁడయ్యును, గజారూఢః =ఏనుఁగునెక్కినవాఁడయ్యును, సంగ్రామే =యుద్ధమునందును, సంకటే = సంకటములయందును కష్టములయందును దుఃఖములయందును, తథా = ఆవిధముగా, ఏతదేవ = ఈపరబ్రహ్మరూపమునే, సదా = సర్వకాలములయందును, ధ్యాయీ=ధ్యానమునుజేయువాఁడు, పరబ్రహ్మ=పరబ్రహ్మమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

తా॥ అశ్వమునెక్కినవాఁడయ్యును, గజమునెక్కినవాఁడయ్యును, సంగ్రామమునందును, సంకటమునందును, ఈపరబ్రహ్మస్వరూపమునే ధ్యానమునుజేయువాఁడు పరబ్రహ్మమును పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో॥ ఆసీనోవాశయనోవా గచ్ఛన్తిష్ఠన్సదాశుచిః
తస్మాత్సర్వప్రయత్నేన యోగయుక్తోభవార్జున॥ ౪౭

టీ॥ అర్జున =ఓఅర్జునుఁడా! ఆసీనోవా = కూర్చుండియున్నవాఁడవయ్యును, శయనోవా = శయనించినవాఁడవయ్యును, గచ్ఛన్ = పోవుచున్నవాఁడవయ్యును,

26992 25.3.72

తిష్ఠన్ = నిలిచినవాఁడవయ్యును, అశుచిః = అపరిశుద్ధుఁడవయ్యును, సదా = సర్వకాలములయందును, తస్మాత్ = అందువలన, సర్వప్రయత్నేన = సకలప్రయత్నములచేతను, యోగయుక్తః = యోగముతోఁగూడుకొన్నవాఁడవు, భవ = అగుము.

తా॥ ఓయర్జునుఁడా ! కూర్చున్నప్పుడును, పరున్నప్పుడును, పోవుచున్నప్పుడును, నిలుచున్నప్పుడును, పరిశుద్ధుఁడవైనప్పుడును, అపరిశుద్ధుఁడవైనప్పుడును అనఁగా సర్వకాలములయందును సర్వవిధప్రయత్నములచేతను యోగమును అవలంబించి యుండుమని తాత్పర్యము.

శ్లో॥ అంతస్సంగంబహిస్సంగ మాత్మసంగంపరిత్యజేత్
సర్వసంగనివృత్తాత్మా పశ్యేదాత్మానమాత్మని॥ ४८

టీ॥ అంతస్సంగమ్ = లోపలిసంబంధమును, బహిస్సంగమ్ = బాహ్యమునందలిసంబంధమును, ఆత్మసంగమ్ = మనస్సంబంధము, పరిత్యజేత్ = విడిచిపెట్టవలయును, సర్వసంగనివృత్తాత్మా = సమస్తసంబంధములనుండియును మరలినమనస్సుకలవాఁడు, ఆత్మానమ్ = తనను, ఆత్మని = పరమాత్మయందు, పశ్యేత్ = చూడవలయును.

తా॥ లోపలిసంబంధమును బాహ్యమునందలిసంబంధమును మనస్సంబంధమును పరిత్యజింపవలయును. సర్వసంబంధములనుండి మరలినయాత్మకలవాఁడు తనను పరమాత్మయందుఁ జూడవలయును. అనఁగా పరమాత్మకును తనకును భేదములేదని యెఱుఁగవలయునని తాత్పర్యము.

శ్లో॥ విషయాసక్తచిత్తానా మంధస్యేందూదయంయథా
గీతాసారమిదంశాస్త్ర ముక్తంమోక్షార్థసిద్ధయే॥ ४९

టీ॥ విషయాసక్తచిత్తానామ్ = విషయములయందాసక్తమైనమనస్సుకలవారికి, అంధస్య = గ్రుడ్డివానికి, ఇందూదయంయథా = చంద్రోదయమువంటి, ఇదమ్ = ఈ, గీతాసారమ్ = గీతాసారమనునట్టి, శాస్త్రమ్ = శాస్త్రము, మోక్షార్థసిద్ధయే = మోక్షమునిద్ధించుటకొఱకు, ఉక్తమ్ = చెప్పఁబడెను.

తా॥ విషయములయందు అనఁగా స్రక్చందనవనితాదులయం దాసక్తమైన చిత్తముకలవారికి, గ్రుడ్డివానికి ప్రకాశమును కలిగించునట్టి చంద్రోదయమువంటి యీగీతాశాస్త్రము మోక్షము సిద్ధించుటకొఱకుఁ జెప్పఁబడెనని తాత్పర్యము.

శ్లో॥ తత్రస్థితంబ్రహ్మశాస్త్రం వేదశాస్త్రసునిశ్చితం
ఇదంశాస్త్రంమయాప్రోక్తం గుహ్యంవేదార్థవిస్తరమ్॥ ५०

టీ॥ తత్ర = ఆబ్రహ్మవిషయమునందు, స్థితమ్ = ఉన్నదియును, బ్రహ్మశాస్త్రమ్ = బ్రహ్మప్రతిపాదకశాస్త్రమును, వేదశాస్త్రసునిశ్చితమ్ = వేదశాస్త్రములచేతనిశ్చయింపఁబడినదియును, గుహ్యమ్ = రహస్యమైనదియును, వేదార్థవిస్తరమ్ = వేదార్థములయొక్క యాధిక్యముకలదియును, అయిన, ఇదమ్ = ఈ, శాస్త్రమ్ = శాస్త్రము, మయా = నాచేత, ప్రోక్తమ్ = చెప్పఁబడినది.

తా॥ బ్రహ్మవిషయమునందున్నదియును బ్రహ్మప్రతిపాదకమును వేదశాస్త్రములచేతఁ జక్కఁగ నిశ్చయింపఁబడినదియును, మిగులరహస్యమైనదియును, వేదసారమును, అయిన యీగీతాశాస్త్రము నాచేతఁజెప్పఁబడినదని తాత్పర్యము.

శ్లో॥ యఃపఠేత్పరయాభక్త్యా సగచ్ఛేద్విష్ణుసామ్యతాం
ఏతత్పుణ్యంపాపహరం ధన్యందుస్స్వప్ననాశనమ్॥ ౫౧

టీ॥ పుణ్యమ్=పావనమైనదియును, పాపహరమ్ = పాపమునుపోఁగొట్టునట్టిదియును, ధన్యమ్ =కృతార్థమును, దుస్స్వప్ననాశనమ్ = దుస్స్వప్నములనుపోఁగొట్టునట్టిదియును అయిన, ఏతత్ = ఈగీతాశాస్త్రమును, యః = ఎవ్వఁడు, పరయా= సర్వోత్తమమైన, భక్త్యా=భక్తిచేత, పఠేత్ = పఠించునో, సః = వాఁడు, విష్ణుసామ్యతామ్=విష్ణుసామ్యమును, గచ్ఛేత్=పొందును.

తా॥ పావనమైనదియును, పాపమునుపోఁగొట్టునట్టిదియును, కృతార్థమును, దుస్స్వప్నములనుపోఁగొట్టునట్టిదియును, అయిన యీగీతాశాస్త్రమును ఎవ్వఁడు భక్తిచేత పఠించునో వాఁడు విష్ణుసామ్యమును పొందునని తాత్పర్యము.

శ్లో॥ పఠతాంశృణ్వతాంచైవ విష్ణోర్మాహాత్మ్యముత్తమం
అష్టాదశపురాణాని దశవ్యాకరణానిచ॥ ౫౨

శ్లో॥ క్షణమాత్రస్యయోగస్య కళాంనార్హతిషోడశీం
నిర్మథ్యచతురోవేదా న్మునినాభారతంకృతమ్॥ ౫౩

టీ॥ పఠతామ్ = పఠించుచున్నవారలకును, శృణ్వతాంచైవ=వినుచున్నవారలకును, విష్ణోః=విష్ణుదేవునియొక్క, మాహాత్మ్యమ్ = మహిమము, ఉత్తమమ్ = శ్రేష్ఠమైనది; అష్టాదశ = పదునెనిమిదైన, పురాణాని = పురాణములును, దశ = పదియైన, వ్యాకరణానిచ = వ్యాకరణములును, క్షణమాత్రస్య = క్షణమాత్రమైన, యోగస్య= యోగముయొక్క, షోడశీమ్ = పదునారవదైన, కళామ్ = కళనుగుఱించి, నార్హతి= తగదు; మునినా = వేదవ్యాసమునివరునిచేత, చతురః=నాలుగైన, వేదాః = వేదములు, నిర్మథ్య=చక్కఁగఁబరిశీలింపఁబడి, భారతమ్ = భారతమనుగ్రంథము, కృతమ్ =చేయఁబడినది.

తా॥ పఠించుచున్నవారలకును వినుచున్నవారలకును విష్ణుదేవునియొక్కమాహాత్మ్యము మిగులశ్రేష్ఠమైనది. పదునెనిమిదగుపురాణములును పదియగువ్యాకరణములును క్షణమాత్రమైనయోగముయొక్క పదునాఱవభాగమునకుఁగూడఁ దగవు. వేదవ్యాసమునివరుఁడు నాలుగువేదములను చక్కఁగనాలోచించి మహాభారతమనునట్టి గ్రంథమును జేసెనని తాత్పర్యము.

శ్లో॥ భారతోదధిమంథస్య గీతానిర్మథనస్యచ
సారముద్ధృత్యతంకృష్ణో అర్జునస్యముఖేహుతమ్॥ ౫౪

టీ॥ భారతోదధిమంథస్య = భారతమనియెడుసముద్రమునుమథించునట్టి, గీతానిర్మథనస్య = గీతానిర్మథనముయొక్క, సారమ్ = సారమును, ఉద్ధృత్య = పైకిలేవదీసి, కృష్ణః=కృష్ణుఁడు, తమ్=ఆసారమును, అర్జునస్య = అర్జునునియొక్క, ముఖే=ముఖమునందు, హుతమ్=హోమముఁజేసెను.

తా॥ భారతమనియెడుసముద్రమును గీతయనియెడు కవ్వముచేత మథించి సారమునెత్తి అర్జునునకు శ్రీకృష్ణుఁ డుపదేశించెనని తాత్పర్యము.

శ్లో॥ పూజాకోటిసమంస్తోత్రం స్తోత్రకోటిసమంజపం
జపకోటిసమంధ్యానం ధ్యానకోటిసమోలయః॥ ౫౫

టీ॥ స్తోత్రమ్ = స్తోత్రము, పూజాకోటిసమమ్ = కోటిపూజలకుసమమైనది, జపమ్=జపము, స్తోత్రకోటిసమమ్ = కోటిస్తోత్రములకుసమమైనది, ధ్యానమ్ = ధ్యానము, జపకోటిసమమ్ = కోటిజపములకుసమమైనది, లయః=లయము, ధ్యానకోటిసమమ్=కోటిధ్యానములకుసమమైనది.

తా॥ స్తోత్రముకోటిసంఖ్యాకమగుపూజకు సమానమైనదనియును, జపము కోటిసంఖ్యాకస్తోత్రమునకు సమమైనదనియును, ధ్యానము కోటిసంఖ్యాకమగుజపమునకు సమానమైనదనియును, లయము అనఁగా మనోలయము కోటిసంఖ్యాకధ్యానమునకు సమానమైనదనియును తాత్పర్యము.

గద్య॥ ఇతి శ్రీమహాభారతే శాతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం శ్రీమదశ్వమేధపర్వణి శ్రీభగవదుత్తరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గీతాసారయోగోనామ చతుర్థోధ్యాయః॥

టీ॥ శాతసాహస్ర్యామ్ = నూఱువేలశ్లోకములుకలదియును, సంహితాయామ్ = ఛందోబద్ధశాస్త్రమును, వైయాసిక్యామ్ = వ్యాసప్రోక్తమును అయిన, శ్రీమహాభారతే = సంపత్కరమైన మహాభారతమనునట్టిగ్రంథమునందు, శ్రీమదశ్వమేధపర్వణి = సంపత్కరమైనయశ్వమేధపర్వమునందు, శ్రీభగవదుత్తరగీతాసు = సంపత్కరుఁడైనభగవంతునిచేత యుద్ధానంతరమందుఁ జెప్పఁబడిన, ఉపనిషత్సు = ఉపనిషత్తులయందు, బ్రహ్మవిద్యాయామ్ = బ్రహ్మవిద్యయనునట్టి, యోగశాస్త్రే =యోగశాస్త్రమునందు, శ్రీకృష్ణార్జునసంవాదే = కృష్ణార్జునులసంవాదమునందు, గీతాసారయోగోనామ=గీతాసారమను, చతుర్థః=నాల్గవదైన, అధ్యాయః=భాగము, ఇతి=ముగిసెను.

తా॥ నూఱువేలశ్లోకములుకలదియును, ఛందోబద్ధశాస్త్రమును అయిన మహాభారతమునందలి అశ్వమేధపర్వమునందు అనఁగా యుద్ధానంతరకాలమునందు భగవంతునిచేతఁ జెప్పఁబడినదియును బ్రహ్మప్రతిపాదకమును అయిన యోగశాస్త్రమునందు గీతాసార మనుపేరుగల నాల్గవయధ్యాయము ముగిసెను.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

26992
2-3-73